# చతుర

జూన్ 2000 ★ రూ. 7/-



పి. కృష్ణకుమారి

## రాలిన మొగ్గలు

# ఏరిన ముత్యాలు

★ నాగరిక మానవులు ప్రేమ లేకుండా శృంగారకాంక్షను సంతృప్తి పరచలేరు.

–రస్సెల్

★ మానవ హృదయ వ్యాపారులు కవి, చిత్రకారుడు, సంగీతజ్ఞులు

–డబ్ల్యు.ఎస్.మెసిక్యూ

★ ప్రేమ బాధలను సహిస్తుందేకాని, ఎన్నడూ ప్రతీకారాన్ని తలపెట్టదు.

–గాంధీ

★ ధీరుడు ఒకేసారి మరణిస్తాడు. పిరికివాడు క్షణక్షణం మరణిస్తాడు.

–స్వామి వివేకానంద

★ మన అజ్ఞానం గురించి తెలుసుకోవడమే నిజమైన విజ్ఞానం.

–సర్వేపల్లి రాధాకృష్ణన్

★ పిరికివాళ్లు కూడా చేయగల ఒకే ఒక సాహసకృత్యం పెళ్లిచేసుకోవడం.

–డేనియల్

★ సంతృప్తి ఒక్కటే మానవుడికి సహజమైన సంపద. వైభోగం అనేది కృత్రిమమైన దారిద్ర్యం.

–సోక్రటీస్

★ పేదవాడంటే తక్కువ సంపద వున్నవాడుకాదు. ఎక్కువ కోరికలు వున్నవాడు.

–డేనియల్

★ మనకున్న దానిపై నిర్లక్ష్యం, లేనిదానిపై ఆరాటమే మనం పూర్తిగా సుఖపడకపోవడానికి కారణం.

–రియో

★ ప్రపంచంలోని మేధావులందరికన్నా ఒక మంచి హృదయం కల వ్యక్తి ఎంతో గొప్పవాడు.

–బల్వర్‌టన్

★ చిన్నచిన్న విషయాలే అల్పులకు ఎంతో పెద్దవిగా కనిపిస్తాయి.

–గోల్డ్‌స్మిత్

★ వయసుతోపాటు మానసిక పరిణతి సాధించని వ్యక్తులకు వృద్ధాప్యం శాపంలాంటిది.

–థోలన్

★ రెండు అనంతాల మధ్య కాసేపు వెలిగే కాంతి కిరణమే జీవితం.

–కార్లయిల్

★ విమర్శకు పూనుకుంటే ప్రేమ, ఔదార్యాలకు అవకాశం ఉండదు.

–మదర్‌థెరీస్సా

సేకరణ: పట్నం శేషంశెట్టి

# చతురర కతలు

## హైజాకింగ్

జాతీయ క్రికెట్ జట్టు విదేశాలలో అనేక అంతర్జాతీయ పోటీలలో పాల్గొనడానికి దేశంలోని ప్రధాన విమానాశ్రయం నుంచి ప్రత్యేక విమానంలో బయలుదేరింది. విమానం ఆకాశంలోకి ఎగిరిన కొద్దిసేపటికే నలుగురు ముసుగు మనుషులు క్రికెట్ ఆటగాళ్ల మధ్య ఆధునిక మారణాయుధాలతో ప్రత్యక్షమయ్యారు.

ఆ జాతీయజట్టులో రకరకాల బౌలింగులను రించి కాక్‌పిట్‌లోకెళ్లి పైలెట్, కో పైలెట్ తలలకి పిస్టల్ గురిపెట్టి విమానాన్ని దారి మళ్లింపచేసి తమ మిత్ర దేశంలో దింపించారు.

అక్కడినుంచి క్రికెట్ ఆటగాళ్ల దేశాధినేతలకు జైళ్లలో బంధించివుంచిన తమ దేశపు ఉగ్రవాదులను విడిచిపెట్టాలనీ, అప్పుడే క్రికెట్ ఆటగాళ్లను ప్రాణాలతో వదులుతామనీ సందేశం పంపారు.



ఎదుర్కొన్న బాట్స్‌మెన్ ఉన్నారు. ఏ పొజిషన్‌లోనయినా ఉండి పరుగును అరికట్టగల, క్యాచ్‌లు పట్టుకోగల ఫీల్డర్లు ఉన్నారు. తమ బౌలింగ్ నైపుణ్యంతో ఎవరినయినా ఔట్ చేయగల బౌలర్స్ ఉన్నారు. అయినా ఎవరి ప్రతిభా ఆ క్షణంలో చెల్లలేదు. అందరూ కిమ్మనకుండా కూర్చున్నారు.

ఆ ముసుగు మనుషులు "కదిల్తే కాల్చేస్తాము. కళ్లు, నోళ్లు మూసుకుని కూర్చోండి" అని క్రికెట్ వీరులని హెచ్చ

ప్రధానమంత్రి మంత్రివర్గ అత్యవసర సమావేశం ఏర్పాటు చేశారు. పత్రికలు, రేడియో, టి.విలలో క్రికెట్ జట్టు హైజాకింగ్ వార్తలే. ఆ హైజాకింగ్ క్రికెట్ ఒన్‌డే అంతర్జాతీయ పోటీలకన్నా ఉత్కంఠ రేపింది.

క్రికెట్ అధికారులు, అభిమానులు జైళ్లలోని ఉగ్రవాదులను వెంటనే విడిచిపెట్టి, క్రికెట్ ఆటగాళ్లని రక్షించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తుల మీద విజ్ఞప్తులు చేశారు. అయితే కొందరు ప్రముఖులు తమ దేశానికి పెద్ద ప్రమాదం తెచ్చిన ఉగ్రవాదులను సైన్యం ఎంతో కష్టపడి, ఎందరో సైనికులు ప్రాణ





త్యాగం చేయగా పట్టుకుందనీ వారిని విడిచిపెట్టకూడదనీ పత్రికా సమావేశాలు ఏర్పాటుచేసి వెల్లడించారు. అంతేకాక ఇటీవలి కాలంలో క్రికెట్ జట్టు ఓటమి మీద ఓటమి ఎదుర్కొంటూ వుందనీ, హైజాక్ చేసిన వారే వారిని కొంతకాలం తర్వాత విడిచిపెట్టవచ్చనీ, క్రికెట్ జట్టు హైజాకింగ్‌కి గురయినంతకాలమూ ఓటమిలు తప్పుతాయనీ పేర్కొన్నారు.

ప్రభుత్వం, రన్‌లు చేయకుండా కాలాన్ని బాట్స్‌మన్ నెట్టుకు వచ్చినట్లు ఏ నిర్ణయమూ హైజాకింగ్ విషయంలో తీసుకోక తాత్సారం చేయడం మొదలుపెట్టింది.

ఇంతలో హైజాకింగ్ జాతీయ సమస్యగా మారింది. దేశం నలుమూలలా క్రికెట్ అభిమానులు నిరాహార దీక్షలు ప్రారంభించారు. పాఠశాలలను క్రికెట్ కుర్రాళ్లు బహిష్కరించారు. ప్రభుత్వ కార్యాలయాలలో అసలే అంతంత మాత్రంగా జరిగే పని రికార్డు స్థాయిలో పడిపోయింది.

ప్రభుత్వం మధ్యవర్తులద్వారా హైజాకర్లతో రాయబారాలు నడపడం ప్రారంభించింది. అగ్రరాజ్యాల దృష్టికి ఆలస్యంగానైనా హైజాకింగ్‌ని తెచ్చింది. ఐరాస తలుపు తట్టింది.

ఎంత జరిగినా హైజాకర్లు క్రికెట్ ఆటగాళ్లని విడిచిపెట్టలేదు.

ఇక లాభం లేదనుకుని హైజాకర్లు విమానాన్ని పేల్చేశారు.

"అమ్మా" అంటూ బిజీ కృష్ణ అర్ధరాత్రి అరుస్తూ లేచాడు.

"ఏమిటిరా ఏమయింది" అంటూ పక్కగదిలో పడుకున్న అమ్మలేచి వచ్చింది. "ముందు ఈ చల్లని నీళ్లుతాగు" అంటూ ఫ్రిజ్‌లోంచి నీళ్లు తెచ్చి ఇచ్చింది. "ఏదయినా పీడకల వచ్చిందా" అని అడిగింది.

బిజీకృష్ణ తనకి వచ్చిన కల గురించి చెప్పాడు.

"ఛీ పీడకల. అలాంటిది ఎప్పుడూ జరగదురా. మన క్రీడాకారుల్ని ముఖ్యంగా క్రికెట్ ఆటగాళ్లని మరీ పిచ్చాస్పత్రినుండి పారిపోయొచ్చిన వాళ్లు తప్ప హైజాక్ చేసే పిచ్చి పనెవరు చేస్తార్రా! భయపడకు" అంది ఓదార్పుగా.

"నిజమే అమ్మా" అంటూ బిజీకృష్ణ నిద్రలోకి జారిపోయాడు, వాళ్ల అపజయాల జాబితా నెమరేసుకుంటూ.

—తాజీప్రసాద్

---

# చెక్

ఈశ్వరరావు ఈగిల్ కంపెనీ లిమిటెడ్ ఎమ్.డీ. అతని పెర్సనల్ సెక్రటరీ కామేశ్వరి మంచి పరువంలో వున్న పడుచు. ఇద్దరూ కలిసి కాన్ఫరెన్స్‌కని బెంగుళూరు వచ్చారు. మీటింగు అనుకోకుండా ఆలస్యమవడంవల్ల ఫ్లైట్ మిస్సయ్యింది.

మళ్లీ ఫ్లైట్ తెల్లవారి ఆరుంబావుకు. హోటల్‌కి వచ్చేసరికి రాత్రి పది దాటింది. "మళ్లీ పడుకుంటే పెందరాళే లేవడం కష్టం. ఎలాగో ఈ నైట్‌కి గడిపేద్దాం." అన్నాడు ఈశ్వర్రావు.

"యస్ బాస్!" అనక తప్పలేదు కామేశ్వరికి. ఈశ్వర్రావు ఆలోచన వేరు. ఎలాగైనా కామేశ్వరిని పటాయించాలని ఎప్పడినుండో వుంది అతగాడికి. డైరెక్టుగా రంగంలోకి దిగితే శృంగభంగమవ్వచ్చు. పెద్ద పెద్ద మంత్రులకే తప్పట్లేదు అవమానాలు. కనుక నేక్‌గా కామేశ్వరిని వలలో వేసుకోవాలని ఈశ్వర్రావు ప్లాను.

"నైట్ అంతా గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవడం కష్టం. టైమ్‌పాస్‌కి ఏదైనా చేద్దాం." అన్నాడు ఈశ్వర్రావు.

"ఏంచేద్దామంటారు సార్!" అనడిగింది కామేశ్వరి బిక్కుబిక్కుమంటూ. తను ఇలాంటి విచిత్రమైన పరిస్థితుల్లో ఇరుక్కోవలసి వస్తుందని ముందుగానే ఊహించి వుంటే ఏదో చేసేది. ఇప్పుడు తెలివిగా బాస్

ట్రాప్‌లోంచి తప్పించుకోవాలి. మొండిగా ఎదురు తిరిగితే మొగాళ్లు ఏంచేయగలరో తెలుసుకోలేనంత అమాయకురాలు కాదామె.

“ఛస్ ఆడదాం!” అన్నాడు ఈశ్వర్రావు. అతగాడికి ఛస్‌లో మంచి ప్రవేశముంది. కామేశ్వరికి బోర్డ్ ఎలా వుంటుందో ఇప్పుడిప్పుడే తెలుస్తోంది. కాయలు నడపడం కొద్దిగా తెలుసు. కానీ గ్రాండు మాస్టరులాంటి బాస్‌తో తలపడడం మాటలుకాదు.

“నాకు ఛస్ అంతగా రాదు సార్!” అంది బేలగా.

“ఫర్వాలేదులే. ఊరికే కాలక్షేపం కోసమేగా.” అన్నాడు ఈశ్వర్రావు.

కామేశ్వరి బల్లమీద కాయలు సర్దింది.

“పందెం ఏమిటి?” అనడిగాడు ఈశ్వర్రావు హుషారుగా.

“పందెం ఏమీ వద్దులెండి.” అంది కామేశ్వరి ఖంగారుగా.

“పందెం లేకపోతే ఆటలో పసేమివుంటుంది? నామ్‌కేవాస్తే ఏదైనా పందెం పెట్టుకుందాం.”

“అయితే మీరే చెప్పండి!”

“ఈ ఆటలో నువ్వు గెలిస్తే నీకు ప్రమోషన్ ఇస్తాను.”



కామేశ్వరిలో ఉత్సాహం పెరిగింది. ప్రస్తుత పరిస్థితుల్లో తనకు ప్రమోషన్ ఎంతో అవసరం కూడా.

“మరి నేను ఓడిపోతేనో?” అనుమానంగా అడిగింది కామేశ్వరి.

“ఓడటం దాకా వద్దుకానీ మొదటిసారి చెక్ చెపితే చెయ్యిమీద ముద్దు పెట్టుకోనివ్వాలి.”

“వద్దు సార్!”

“ఉట్టుట్టిగానేలే. రెండోసారి చెక్ చెబితే... బుగ్గలమీద...”

కళ్లుమూసుకుని వింటోంది కామేశ్వరి.

“మూడోసారి చెబితే... పెదాలమీద.”

“మీకు ఆట బ్రహ్మాండంగా వచ్చు. నాకు ఫండమెంటల్స్ కూడా సరిగ్గా తెలియవు. ఈ పందెం అన్యాయం సార్!” అంది కామేశ్వరి.

“గెలిస్తే ప్రమోషనిస్తానన్నాగా. ఇప్పుడే ఇక్కడే ఆర్డర్స్ మీద సంతకం చేస్తా.”

“ప్రమోషన్ అంటే ఆశగానే వుంది కానీ... ఈ పందెం...” నసిగింది కామేశ్వరి.

ఈశ్వర్రావు నవ్వాడు. “రిస్క్ వుంటేనే ప్రాఫిట్ వచ్చేది.”

“మీరు నాతో పందెం ఓడిపోనని మాట ఇవ్వండి సార్!”

ఈశ్వర్రావు భుజాలెగరేశాడు. ఆట మొదలయ్యింది.





అనుకున్నట్టుగానే ఈశ్వర్రావు ముందు చెక్ చెప్పాడు. చేతులు చాచింది కామేశ్వరి. అప్పటికి ఒంటిగంటయింది. రెండోసారి చెక్ కూడా ఈశ్వర్రావే చెప్పాడు. బుగ్గల మీద ముద్దు పెట్టుకుంటుంటే ఈశ్వర్రావు గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి.

'ఎంతకాలం నుంచి ఎదురు చూస్తున్నాడు. ఇప్పటికి దొరికింది పిట్ట.' అని మురిసిపోయాడు.

ఈశ్వర్రావు మనసు మనసులో లేదు. 'మూడో చెక్... పెదాల మీద ముద్దు' ను గురించి తలుచుకుని తలుచుకుని ఎగ్జైట్ అయిపోతున్నాడు. చొంగ కారుతోంది.

"చెక్!" అంది కామేశ్వరి సడెన్‌గా.

ఉలిక్కిపడి బోర్డువంక చూసుకున్నాడు. ఈశ్వర్రావు 'రాజు' అష్టబంధంలో వున్నాడు. కదిలేందుకు చోటు లేదు.

కామేశ్వరికి ప్రమోషన్ పేపర్సుమీద సంతకం పెట్టక తప్పలేదు ఈశ్వర్రావుకి.

"ఛెస్ ఆట ఆట్టే తెలియనిదానివి అంత పెద్ద బాస్‌తో అలాంటి పందెం ఎందుకు పెట్టావే? ఒకవేళ నిజంగానే నువ్వు ఓడిపోతే..." అంది కామేశ్వరి ఫ్రెండ్ కనకదుర్గ.

"ఓడిపోయే ప్రశ్న లేదు. నాకు ఛెస్ ఆట అంతగా తెలియకపోవచ్చు కానీ... మగాళ్ల మనస్తత్వం బాగా తెలుసు. రెండుసార్లు పరాయి ఆడదాన్ని ముద్దు పెట్టుకున్న మగాడి బుర్ర ఎంతలా పని చేస్తుందో నాకు తెలియదా? ప్రమోషన్‌కి ఆమాత్రం సాహసం చేయకపోతే ఎలా? " అంది కామేశ్వరి నవ్వుతూ.

—కర్లపాలెం హనుమంతరావు.

---

## పథకం

ఋతు పవనాల ప్రభావం చాలా ఎక్కువగా ఉండడంతో కోస్తా జిల్లాల్లో ఒకే తీరుగా కుండపోత వర్షం




కురిసింది. వారం రోజులపైబడి కురిసిన వర్షాలకి వాగులు, వంకలు ఒకటై ప్రవహించాయి. గోదావరి పొంగి గట్లను ఒరిసి సాగింది. వరదనీటి తాకిడికి బలహీనంగా ఉన్నచోట గండిపడి ఊళ్లకి ఊళ్లే మునిగిపోయాయి. ప్రజాజీవనం స్థంభించిపోయింది.

ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని కకావికలై పరుగులెత్తారు ప్రజలు. ఎక్కడ ఎత్తు కనిపిస్తే అక్కడికి పోయారు ప్రజలు. చెట్లమీద, గట్ల మీద నిలబడి ప్రాణభీతితో అల్లాడిపోయారు. తల్లికీ, పిల్లకీ, భర్తకీ, భార్యకీ

సంబంధాల్లేకుండా విడిపోయారు. కుటుంబాలకి కుటుంబాలే ఎవరెక్కడున్నదీ తెలియని పరిస్థితిలో కొట్టుమిట్టాడారు. వర్షం తగ్గినా వరదనీటి విజృంభణతో కల్లోల కడలిలా మారిన ఊళ్లల్లో అల్లకల్లోలమైపోయింది ప్రజానీకం. చుట్టూ నీరున్నా తాగడానికి గుక్కెడు నీరు లేక, కతకడానికి పిడికెడు మెతుకులు లేక ఎవరో వస్తారని, ఏదో చేస్తారని ఎదురుచూస్తూ గడిపారు.

సరైన సమయానికే స్పందించిన ప్రభుత్వం ఆహారపు పొట్లాలని, మంచినీటి సంచుల్ని హెలికాప్టర్ల ద్వారా జారవిడిచింది. పడవల మీద పోయి చెట్లమీద, ఇళ్లకప్పుల మీద బిక్కుబిక్కుమంటూ ఉన్నవాళ్లని సురక్షిత ప్రాంతాలకి తరలించింది ప్రభుత్వ సిబ్బంది. ఎప్పటికప్పుడు వార్తల్ని ముఖ్యమంత్రి తెలుసుకుంటూ సహాయ కార్యక్రమాల్ని స్వయంగా పర్యవేక్షిస్తున్నాడు.

క్రమేపీ వరదనీరు తగ్గుముఖం పట్టడంతో సామాన్య పౌరజీవనం మామూలు స్థితికి చేరుకుంటోంది. సహాయకార్యక్రమాల్ని ముమ్మరం చేసింది ప్రభుత్వం. ప్రతిపక్షాలకి ఎక్కడా విమర్శలకి తావివ్వకుండా ప్రజల్ని ఆదుకునే ప్రయత్నం చేస్తోంది అధికార పక్షం. స్వచ్ఛంద సంస్థలు తమ వంతు కృషిని తాము చేస్తున్నాయి. ప్రతిపక్షపార్టీలు కూడా తాము చేసేదేమీలేక తమ వంతు ప్రజాసేవకు ఆయత్తమైనాయి.

అంతకుముందే వరదప్రాంతాల్ని ఏరియల్ సర్వే చేసిన ముఖ్యమంత్రి వరదనీరు తగ్గిన తర్వాత కారులో వరదతాకిడికి గురైన గ్రామాల్ని సందర్శించి ప్రజల్ని పరామర్శించడానికి వచ్చాడు. తాముపడిన ఇబ్బందుల్ని, కలిగిన నష్టాన్ని ముఖ్యమంత్రిగారికి విన్నవించుకుంటున్నారు ప్రజలు. వాళ్లు చెప్పేవన్నీ ఓర్పుగా విని వాళ్లిచ్చిన విజ్ఞాపన పత్రాల్ని అందుకుంటూ, అందరికీ అన్నీ తీరుస్తామంటూ హామీలు గుప్పిస్తున్నాడు ముఖ్యమంత్రి. బహిరంగ ప్రకటనలు చేస్తున్నాడు "నేనున్నాను మిమ్మల్ని ఆదుకోవడానికి" అంటూ.

"మీకేం భయం అక్కర్లేదు. ఇకపైన వరదలనుంచి శాశ్వత విముక్తి కలగడానికి వెయ్యికోట్ల రూపాయలతో అద్భుతమైన ఒక పథకాన్ని అమలు చేయడానికి ఈరోజే మా మంత్రిమండలి సమావేశంలో ఏకగ్రీవంగా తీర్మానం చేశాము..." అన్నాడు.

"ఏమిటా అద్భుత పథకం" అనుకుంటూ ప్రజలందరూ ముఖ్యమంత్రి వంక ఆశగా, ఆతృతగా చూశారు.

"ప్రజలందరికీ చిన్నచిన్న పడవలనిచ్చి వాటిని ఎలా నడపాలో తర్ఫీదు ఇప్పిస్తామని మనవి చేసుకుంటున్నాను." అంటూ ఉపన్యాసాన్ని ముగించి కారెక్కాడు ముఖ్యమంత్రి.

—సూరిపండు

---

## ఎ పెట్ స్టోరీ

చిత్తూరులో మా చదువయ్యాక నేను ఓ చిట్‌ఫండ్ కంపెనీలో క్లర్క్‌గా చేరాను. నా మిత్రుడు సాయిరాం బెంగుళూరులో తన చిన్నాన్న నడిపే షాపుని చూసుకోవడానికి వెళ్లాడు. తరచు సాయిరాం నుంచి లెటర్స్ వస్తూండేవి. ఓసారి రమ్మనీ మద్రాస్, హైదరాబాదులకన్నా బెంగుళూరు ఎంతో అందంగా వుంటుందనీ ఊరించేవాడతను.

బెంగుళూరు చూడడం కన్నవాడు నడిపే పెంపుడు జంతువులను అమ్మే దుకాణం చూడాలన్న కోరికతో మొదటి ఏన్యువల్ లీవ్ తీసుకోగానే తిరుపతి వెళ్లి అక్కడినుంచి సరాసరి బెంగుళూరు వెళ్లాను. బస్‌స్టాండుకి నన్ను రిసీవ్ చేసుకోవడానికి వచ్చాడు సాయిరాం. ఇద్దరం వాడి గదికి చేరుకున్నాం. మర్నాడు సోమవారం వాడితోపాటు 'ది నెస్ట్' అనే వాడి దుకాణానికి వెళ్లాను. ఇరవై బై పది అడుగుల విస్తీర్ణంలో ఉన్న ఆ దుకాణంనిండా చిలకలు, మైనాలు, పావు




రాలు, పిల్లులు, కుక్కపిల్లలు.... ఓ చిన్న పాముపిల్ల కూడా అమ్మకానికి ఉంది.

వాళ్ల చిన్నాన్న నవ్వుతూ చెప్పాడు. "మావాడు ఘటికుడోయ్. వ్యాపారాన్ని ఏడాదిలో రెట్టింపు చేశాడు."

ఎలాగో ఆరోజు తెలుసుకున్నాను. నాలుగురోజుల క్రితం ఓ పమేరియన్ డాగ్ పిల్లలను పెట్టింది. నాలుగు తెల్లటి చూడముచ్చటైన పిల్లలవి.

'ఫ్రీ పమేరియన్స్' అన్న మాటలని ఇంగ్లీషులో రాసి దుకాణం బైట పెట్టాడు సాయిరాం. యం.జి రోడ్డులో రద్దీగా వుండే కార్నర్‌లో ఉన్న ఆ దుకాణంలోకి ఆ బోర్డ్ పెట్టిన గంటన్నరలోగా నలుగురు వచ్చారు తాము చదివింది నిజమా అని తెలుసుకోవడానికి.

ఒకరికి ఆల్‌రెడీ ఓ లేబ్రడార్ ఉంది. అయినా ఆ పమేరియన్ పిల్లల్ని చూసి వదలలేక అడిగాడు.

"నిజంగా ఫ్రీ గా ఇస్తారా దీన్ని?"

"అవును తలకొకటి" చెప్పాడు సాయిరాం.

ఆ కుక్క పిల్లనీ దానికి అవసరమయ్యే సామానునీ కొనుక్కుని వాటితో సహా వెళ్లిపోయారు వాళ్లు.

"అమ్మితే ఒకదాని ఖరీదు ఎంత?" అడిగాను నేను.

"మూడువందల యాభై నుంచి అయిదువందలదాకా" చెప్పాడు సాయిరాం.

లంచ్‌అవర్‌లోగా నాలుగు కుక్కపిల్లల్ని ఉచితంగా ఇచ్చేశాడు సాయిరాం.

"ఒకోటీ మూడువందల యాభై కి అమ్మినా పధ్నాలుగు వందలు వచ్చేది కదా! ఆమొత్తం నష్టం కదా?" అడిగాను.

చిన్నగా నవ్వి చెప్పాడు సాయిరాం. "ఆ డబ్బులో కొంత నీముందే సంపాదించానుగదా!"

ప్రశ్నార్థకంగా చూశాను.

"కుక్కపిల్ల ఉచితమే అయినా దానికి డాగ్‌ఫుడ్, డాగ్‌బెడ్, గొలుసు, లైసెన్సు బౌండ్ లాంటివన్నీ వాళ్లు కొన్నారుకదా! వాటిమీద వచ్చిన లాభం కుక్కపిల్లని అమ్మడం వల్ల వచ్చే లాభంకన్నా అధికం తెలుసా?"




"ఓ"

"అంతేకాదు. వాళ్లిక ఎప్పుడు పెంపుడు కుక్క కోసం ఏం కొనాలన్నా నా దుకాణం గుర్తొచ్చి ఇక్కడికే వస్తుంటారు కుక్కపిల్లని ఫ్రీగా ఇచ్చాసన్న గౌరవంతో. దాంతో భవిష్యత్తులో వాళ్లవల్ల పెరిగే నా అమ్మకాల్లోంచి వచ్చే లాభం నాకు అదనపు లాభమేగా."

సాయిరాం చిన్నాన్న నవ్వి చెప్పాడు. "ఇందాకే చెప్పానుగా, సాయిరాం వచ్చాక బిజినెస్ డబుల్ అయిందని."

—పద్మజాదేవి



# 'సహజీవనం' పై సమీక్షలు

ఏప్రిల్ 'చతుర'లో ప్రచురితమైన పొత్తూరి విజయలక్ష్మి రచన 'సహజీవనం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.



## 'ఆమోదయోగ్యం'

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

నేటి సమాజంలోని వివాహ వ్యవస్థలో కొన్ని స్థూలమైన కట్టుబాట్లతో కొట్టుమిట్టాడుతున్న భార్యాభర్తల వ్యక్తిత్వాలను సున్నితంగా ఉతికి ఆరేసి, భార్యాభర్తల అనుబంధాలు స్వేచ్ఛానురాగాలతో పెనవేసుకుంటే కుటుంబం స్వర్గతుల్యమౌతుందని పొత్తూరి విజయలక్ష్మిగారు 'సహజీవనం'లో చక్కని నినాదాన్ని అందించారు. మనుషుల ఎదుగుదలకి తద్వారా వ్యవస్థ పురోగతికి కొన్ని క్లిష్టమైన, సున్నితమైన మార్పులు అవసరమని భావించిన రచయిత్రి నాటికి నేటికి ప్రశ్నగానే ఎదురౌతున్న స్త్రీపురుష బేధాన్నే ప్రధానాంశంగా తీసుకొని వారి మధ్య వివక్షతను తుంగలోతొక్కి సహజీవన సౌందర్యాన్ని గుబాళింపచేసి స్త్రీ-పురుషుల సమైక్యతే సామాజిక ఔన్నత్యానికి ప్రతీక అని స్పష్టంగా, హృద్యంగా చెప్పిన తీరు ప్రశంసనీయం! నవల్లోని ముఖ్య పాత్రలన్నింటినీ చాలా హుందాగా పరిధులకు లోబడినట్లు చక్కగా మలచి మెప్పించారు రచయిత్రి.

అసూయతో ఎత్తులో ఉన్న ఆకాశంపై ఉమ్మితే అది తిరిగి ఉమ్మినవారి మొహం పైనే పడుతుందని మాధవరావు, ప్రభావతి పాత్రలద్వారా తెలియజేసి చురకలంటించడం, అమ్మాయిలను అసత్యాలతో మభ్యపెట్టి మోసం చేస్తే తగిన శిక్ష అనుభవించక తప్పదని సుధీర్ పాత్రద్వారా హెచ్చరిక చేయడం సందర్భోచితంగా అనిపించాయి. అలాగే ఆత్మీయులకు కానుకలు ఇవ్వడంలోని ముఖ్యోద్దేశాన్ని మధుసూదన్ చెప్పిన వైనం మనోహరంగా అనిపించింది.

అయితే హాయిగా ఆహ్లాదంగా సాగిపోయే నవల చివరిలో అంత గజిబిజిగా ఎందుక





యిందో అర్థం కాలేదు. మాధురి పాత్రలో ఒక సంచలనం, క్లైమాక్స్‌లో మలుపుల హంగామాకి మాధవి, మధుసూదన్‌ల మధ్య కలహపు కలకలం సృష్టించడం అంత సహజంగా అనిపించలేదు. వ్యక్తిత్వవికాసా లతో ప్రకాశించిన మధు, మాధవిల జంట చిన్న విషయానికే అంత అవగాహనా రాహిత్యంతో పోట్లాడుకొని విభేదాలు సృష్టించుకోవడం కాస్త ఎబ్బెట్టుగానే అనిపించింది. అయితే అంతర్లీనంగా రచయిత్రి అందించిన సందేశం ఆమోదయోగ్యం. దానిని అందరూ అర్థం చేసుకొని ఆహ్వానించడం మన సమిష్టి కర్తవ్యం. సామాజిక న్యాయం కూడా.

**–వి.శ్రీదేవి,**
సనత్‌నగర్- 500018

## విలక్షణం

*(రెండవ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

**పొ**త్తూరి విజయలక్ష్మిగారి 'సహజీవనం' నవల ఎత్తుగడ హాస్యస్ఫోరకంగానూ, కథా వస్తువు వినూత్నంగానూ ఉంది. వధువు కోసం వరుడి ప్రకటనే విలక్షణంగా ఉంది. 'బ్రాహ్మణ కులస్తుడు, ఆరు అడుగుల సివిల్ ఇంజనీర్, ఉద్యోగం చేసే ఆలోచన లేదు, పెద్ద కంపెనీలో ఎగ్జిక్యూటివ్‌గా పని చేస్తున్న యువతికాని, సివిల్ సర్వీసెస్‌లో ఉద్యోగం చేస్తున్న యువతికాని కావాలి' అని. ఈ ప్రకటన చదివి ఎంతమంది యువతులు అప్లై చేస్తారనేది సుమారుగా మనం ఊహించవచ్చు. ఎందుకంటే ఎంత పెద్ద ఉద్యోగస్తురాలైనా, చివరకు ఏమీ చదువుకోని స్త్రీ అయినా కూడా తన భర్త బాగా చదువుకున్న వాడూ, మంచి ఉద్యోగం చేస్తూ సంఘంలో సముచితస్థానంలో ఉన్న వాడూ అయి ఉండాలని ఆశిస్తారుకాని బాగా చదువుకుని కూడా ఇంట్లో ఉండి వంట పని, ఇంటిపని చూస్తానంటే ఏ స్త్రీ అయినా మెచ్చుతుందా? స్త్రీ విద్య, ఉద్యోగం ఎంతో సహజమైన ఈ రోజుల్లో కూడా ఆడ వాళ్లందరు ఒకచోట చేరితే ఫస్టు ప్రశ్న మీ వారేం చేస్తుంటారు అనే. తరువాత అంశంగా మాత్రమే మీరూ చదువుకున్నారా, ఉద్యోగమా, హౌస్‌వైఫ్ పనా అని అడుగుతున్నారు. ఇక పురుషుల సంగతికి వస్తే తన కన్నా ఎక్కువ చదువుకుని పెద్ద మొత్తం జీతం అందుకుంటున్న భార్యను చూస్తే మురిపెం లేకపోగా అంతరాంతరాల్లో ఈర్ష్య, ఆత్మన్యూనతా భావం ఉంటోంది. తనతోపాటు ఆఫీసులో అలసిపోయి ఇంటికివచ్చిన భార్యకు తన చేతనైన సహాయం చేసే భర్తల్ని వేళ్లమీద లెక్కపెట్టవచ్చు. పురుష అహంకారంతో ఇంటిపని ఆడవాళ్లదే అనే దృక్పథం చాలామంది మగవాళ్లలో ఇంకా ఉంది. ఎవరో మహానుభావులు అన్నట్లు మనకు చేతకాక అనుకోవడమేకాని ఆడపని, మగపని అంటూ వేరేలేవు. భార్య ఉద్యోగం చేస్తుంటే తను జీవితాంతం ఇంటి పని చేస్తాను అనే భర్త చివరివరకూ ఆ భావంతో ఉండగలడా? ఇరుగు పొరుగుల ఎకసెక్కెం మాటలు రావా? తల్లిదండ్రులు 'ఇంత చదివీ మనబ్బాయి ఇంటిపనీ, వంట పనీ చేస్తున్నాడే' అని బాధపడరా? అత్తమామలు, మా అమ్మాయి కష్టపడి సంపాదిస్తుంటే అల్లుడు హాయిగా ఇంటిపట్టున తిని కూచుంటున్నాడు అనుకోకుండా ఉంటారా? మానవ జీవితంలో కొత్త ప్రయోగాలకు కోటి సందేహాలు, శత కోటి అనుమానాలు. ఎంతో ప్రేమించిన భార్యే తమ బిడ్డకు దెబ్బ తగిలితే తన భవిష్యత్తుకోసం దూరంగా ఉన్న తనకు తెలియపర్చలేదని ఆవేశంతో 'ముష్టి ఎత్తయినా నిన్ను పోషించేదాన్నికదా వెధవ ఉద్యోగం కోసం నా బిడ్డకు దెబ్బతగిలితే నాకు తెలియపర్చకుండా ఉంటావా' అని అంది కదా? మరి సంపాదనలేని భర్త విలువ అదేమరి. కథ చివరలో భార్య అన్న మాటలకు అతను బాధపడి ఇంట్లోంచి వెళ్లి



పోవడం, (అదీ తమ బిడ్డకు పూర్తిగా నయం కాకముందే) అతని ఉన్నత వ్యక్తిత్వాన్ని కొంచెం తగ్గించినట్లైంది. మాధవి తన ఆవేశంచల్లారాక భర్తను నిందించినందుకు పశ్చాత్తాప పడేదికదా ఆ మాత్రం సంస్కారం ఆమెకు ఉండే ఉంటుంది.

ఈ నవలలో మూల సూత్రధారి మాధురి. ఆమె జీవితం ఎన్నో ఒడిదుడుకులతో సాగుతుంది. ఓర్పుతో, తెలివితో ఆమె తన సంసారం సుఖమయం చేసుకుంది. విభిన్న మనస్తత్వాలతో అల్లకల్లోలంగా ఉన్న ఇంటిని తీర్చి దిద్దుకుంది. మాధవిది మొదటినుండి వడ్డించిన విస్తరిలాంటి జీవితం. అందుకే ఆమె ఏ ఒడిదుడుకులూ భరించలేదు.

ఆలోచించదగ్గ అంశంతో వచ్చిన ఈ నవల ఉత్తమంగా ఉంది. రచయిత్రి అభినందనీయురాలు.

–కనకదుర్గ
గుంటూరు- 520020

## పెళ్లికి చక్కని భాష్యం

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

భార్యాభర్తలంటే ఒక గూటికింద బలవంతంగా కాపురం చేసే శతృవుల్లాంటి వారు కాదనీ, కలసిమెలసి ఉంటూ ఒకరినొకరు అర్థం చేసుకుని కలిమిలేములు కలసి పంచుకొని సహజీవనం చేసేవారనీ, పెళ్లికి చక్కని భాష్యం చెప్పారు పొత్తూరి విజయలక్ష్మిగారు 'సహజీవనం'లో. ఆద్యంతం కథనం ఎంతో ఆసక్తికరంగా, తెలుగుదనం ఉట్టిపడుతూ సాగింది. మాధవి, మాధురి, మధుసూదన్, భారతి, రాజశేఖరం, భవాని, భానుప్రతాప్ పాత్రల వ్యక్తిత్వ చిత్రీకరణ బావుంది. పాత్రలన్నీ కూడా మన కుటుంబ సభ్యుల్లానో, లేక మన బంధుమిత్రుల్లానో అన్పించారంటే అతిశయోక్తి కాదు. 'ముదితల్ నేర్వగరాని విద్యగలదే, ముద్దార నేర్పింపగన్' అన్నట్లుగా ఈ ఆధునిక కాలంలో స్త్రీ అవకాశాలు లేని చోట కల్పించుకొని మరీ ప్రగతిపథంలో సాగిపోగలదన్న దానికి ప్రతీకలు మాధవి, మాధురిలు.

స్త్రీ, పురుష సంబంధాలను కొత్త కోణం లోంచి చూడాల్సిన, స్త్రీపురుష వివక్షత లేకుండా ఇద్దరూ సమానమేనని గ్రహించాల్సిన ఆవశ్యకతను రచయిత్రి చక్కగా వివరించారు. ఉన్నత, మధ్యతరగతి కుటుంబ చిత్రణే అయినా అన్ని వర్గాలవారికి వర్తించే, ఆకట్టుకునే నవల ఇది. మాధురి పెళ్లి ఆగిపోవడం, దాని తర్వాత జరిగిన సంఘటనలు, పోలీస్ కంప్లయింట్, ప్రెస్ మీట్, స్త్రీజనోద్ధరణ సంఘాలవారి హంగామా ఇవన్నీ కొంచెం సినిమా టిక్‌గా అన్పించినా కథనాన్ని దెబ్బతీయలేదు. మాధురి తన అత్త, తోటికోడలు, ఆడబిడ్డలను సంస్కరించిన తీరు కటువుగా వున్నా ఆమె వ్యవహారదక్షతను, మంచితనాన్ని తెలియజేస్తుంది. వివాహబంధంపట్ల, కుటుంబ జీవనంపట్ల చక్కని అవగాహన కల్గించే నవల ఇది. వివాహంతో స్త్రీగానీ, పురుషుడుగానీ మనిషికి సంపూర్ణత సిద్ధిస్తుందనే విషయం రచయిత్రి చక్కగా తెలియజేశారు.

–ఉమ్మెత్తాల శ్రీనివాసరావు
బొబ్బిలి- 535558

## చక్కని ప్రయత్నం

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

సమకాలీన సామాజికాంశాన్ని స్పృశిస్తూ విభిన్నమైన కథలను ఎన్నుకుని చక్కని శైలిలో అందించారు పొత్తూరి విజయలక్ష్మిగారు 'సహజీవనం' నవలలో. ఫెమినిజం, వుమెన్స్‌లిబ్‌లకు సంబంధించిన అంశాన్ని తీసుకొని ఆ ఛాయలు అంతగా కన్పడకుండా రాయడంలో రచయిత్రి కృతకృత్యుల




య్యారు.

నేటి యువ నారీ తరానికి అసలు సిసలు ప్రతినిధులు మాధవి, మాధురిలు. 'ఆకాశంలో సగం' అంటూ ఉన్నత స్థానానికి కష్టించి చేరిన అమ్మాయిలు వీరిద్దరూ. మధు కథానాయకుడుగా చాలా ఉదాత్తంగా ఉన్నాడు. మిగిలిన పాత్రల చిత్రణా, సంభాషణల, సన్నివేశాల కల్పన చక్కగా పటుతరంగా ఉన్నాయి.

ఇటువంటి అంశాన్ని తీసుకొని ఎక్కడా బిగి సడలకుండా రచన చేయడం నిజంగా కత్తిమీద సామే. ఆ మేరకు రచయిత్రి అభినందనీయురాలు. అయితే రచయిత్రి కొంత పాత భావజాలాన్ని వదుల్చుకోలేకపోయారేమో అన్పిస్తోంది. ఇప్పటివరకూ భర్త సంపాదిస్తుంటే భార్య ఇంటిని చక్కబెడుతోంది. ఇందులో భార్య సంపాదిస్తూ ఉంటే భర్త ఇల్లు చూస్తుంటాడు. అంటే పాత కథే కాకపోతే పాత్రలు మారాయంతే. ఇద్దరం పని సర్దుకుందాం అన్న భావనే లేదు. ఇలా గనక జరిగితే కొన్నాళ్లకు స్త్రీవాదం స్థానంలో పురుషవాదం ప్రవేశిస్తుంది. ఒక్కచోటకూడా మాధవి భర్తకు ఇంటి పనిలో సాయం చేసినట్లులేదు.

విస్తృత ఆలోచనా పరిధి కల్గిన వీరిద్దరూ మామూలు భార్యాభర్తల్లా చిన్న విషయానికే పోట్లాడుకోవడం కృతకంగా ఉంది. అయితే నవలకు ముగింపు కోసం అలా చేయకుండా మరోవిధంగా ఉంటే బాగుండేది.

ఇది ఒక చక్కని ప్రయత్నం.

–భార్గవి
పలాసా-532221

## అన్ని రుచులున్న నవల

*(ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

నేటి సమాజంలో విద్యావంతులైన యువతీ యువకులు తమ కోరికలను ఆధునిక పద్ధతులకు, పరిస్థితులకు అనుగుణంగా తీర్చుకుంటూ తమదైన అరుదైన పంథాలో తమ వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోకుండా జీవిత భాగస్వామి ఆశలు, అభిరుచులు గౌరవిస్తూ సహజీవనం కొనసాగించటం ఈ నవల ద్వారా కళ్లెదుట నిలిపారు పొత్తూరి విజయలక్ష్మిగారు.

ముఖ్యమైన నాలుగు నాయికా నాయక పాత్రలూ, వారి తల్లిదండ్రులు, వారి స్వభావాలు నేటి సంఘంలో అరుదుగా తారసపడతాయేమో! ముఖ్యంగా మాధవ్ సదవగాహన, ఓర్పు నేటి యువతకు ఆదర్శదాయకం. కాని ఆచరణలో అదంత సులభం కాదు. ఎందుకంటే మొదటి నుండి మగవాడిని ఉన్నత స్థానంలో నిలిపి గౌరవించిన సమాజం, దేశం మనది. ఆడదాని పనులు, జీవితంలోకి మగ పాత్రను హుందాగా పరకాయ ప్రవేశం చేయించటం అన్నది రచయిత్రి రచనా చమత్కృతికి మచ్చుతునక. ముఖ్యంగా చదివే పాఠకులకు బోర్ కొట్టకుండా, తప్పు అన్పించకుండా ఆ పాత్రను మలచిన తీరు అమోఘం.

అలాగే తన భర్త గృహిణి స్థానంలో ఉన్నా తక్కువగా భావించకుండా, తన ఆధిక్యతను ప్రదర్శించకుండా భర్తను సంపూర్తిగా ప్రేమించిన మాధవి, తనకి సరిపడని ప్రపంచంలోకి ఛాలెంజ్ చేసి అడుగిడి భర్తను, కుటుంబ సభ్యులను ప్రేమించి, పోరాడి జయించి జీవితాన్ని తనకు అనుకూలంగా మలచుకున్న మాధురి ఇద్దరూ ఆదర్శప్రాయులే. ఇటువంటి పాత్రలు ఎక్కడో గాని తారసపడవు.

సందేశం కావాలనుకున్న వారికి సందేశం, కాలక్షేపం కోరుకునేవారికి అందమైన పాత్రలు, విసుగు రానివ్వని శైలితో 'సహజీవనం' చదివించగలిగిన రచయిత్రిగారికి అభినందనలు.

–ఎం.మాధురి రంగారావు
మహబూబ్‌నగర్- 509001



# చతుర

సంపుటి : 23 సంచిక : 5 జూన్ : 2000

ఇంటర్ చదువుతున్న ఆ యువకుడు ఓరోజు ఫ్యాన్‌కు ఉరివేసుకుని ఆత్మహత్య చేసుకుందుకు పూనుకున్నాడు.

తల్లితండ్రుల స్వభావాల కారణంగా మానసికంగా క్షణ క్షణం చస్తూనే వున్న అతడు ఆరోజు శరీరాన్ని కూడా వదిలిపెట్టెయ్యాలనుకున్నాడు.

అతడి విద్యార్థి జీవితాన్ని ప్రభావితం చేసిన ఆ తల్లితండ్రుల స్వభావం ఎలాంటిది?

తల్లిగా వాత్సల్యంతో అక్కున చేర్చుకోవాల్సిన తన మాతృమూర్తిపైనే అతడికి విముఖత ఏర్పడిన పరిస్థితి ఏమిటి?

విరిసీ విరియని ఆ లేతమొగ్గ విచ్చుకోకమునుపే వసివాడబోయిన కారణం...?

తరాల అంతరాలు శృతిమించిన తీరు తెన్నులను విశదీకరిస్తూ పి. కృష్ణకుమారి రాసిన 'రాలినమొగ్గలు' ఈ నెల చతుర సమగ్ర నవల.

# రాలినమొగ్గలు

— పి. కృష్ణకుమారి

డాక్టరుగారు అడుగుతున్న ప్రశ్నలకు ఒకటి రెండు మాటల్లో ముక్తసరిగా జవాబు చెప్పడం తప్ప తనంతటతానుగా ఏమీ చెప్పడంలేదు ఉత్పల్. కాస్త ఓపిక పడితే అతనే నెమ్మదిగా మనసువిప్పి మాట్లాడతాడన్న విషయం బాగా తెలిసున్నవాడుకాబట్టి సహనమూర్తిలా ఉత్పల్ ఎదురుగా కూచుని ఉన్నాడు సైకియాట్రిస్ట్ డాక్టర్ మనస్వి.

కొడుకుని డాక్టరు దగ్గర కూచోబెట్టి బయట బెంచీమీద కూచుని వెయిట్ చేస్తున్న హరిశ్చంద్ర మాత్రం నరకం అనుభవిస్తున్నాడు. బంగారంలాంటి తన కొడుకు ఉత్పల్! చదువులోను, మిగతా ఏక్టివిటీస్‌లోను తనకుతానే సాటి అనిపించుకున్న ఉత్పల్‌ని ఇలా ఇవాళ సైకియాట్రిస్టు దగ్గరకు తీసుకురావాల్సొస్తుందని అతను కల్లోకూడా అనుకోలేదు.

రెండు నెలలక్రితం మొదలయింది ఉత్పల్ ముభావంగా, డల్‌గా ఉండడం. రెణ్ణెల్లక్రితం వరకూ ఉత్సాహంగా, చలాకీగా ఉంటున్న వాడు ఎన్నడూ లేనిది డల్‌గా ఎందులోనూ ఆసక్తి లేనట్టు ప్రవర్తిస్తున్నాడు. ఇదివరకటిలా సరదాగా కబుర్లు చెప్పడం మానేశాడు. మనసులో ఏముందో తెలీదు!

మొదట్లో ఏదోలే, టీనేజ్ కుర్రాడు కదా మూడ్సుంటాయిలే అనుకున్నారు హరిశ్చంద్ర, అతని భార్య. కానీ ఉత్పల్‌లో పెరిగిపోతున్న నిరుత్సాహం, డల్‌నెస్ రోజురోజుకీ ఎక్కువై చివరికి ఇలా సైకియాట్రిస్ట్ దాకా రావాల్సొచ్చింది. హరిశ్చంద్ర తాహతుకి ప్రైవేటు నర్సింగ్ హోములు గగనకుసుమాలు, అందుకే ఊళ్ళోని ప్రభుత్వాసుపత్రికే తీసుకొచ్చాడు.

హరిశ్చంద్ర తనచుట్టూ రకరకాల భంగిమల్లో కూచుని ఉన్న మానసిక రోగుల్ని వారికి తోడుగా వచ్చిన వారిని దిగులు చూపుల్తో చూస్తూకూచున్నాడు.

కాస్త దూరంలో నర్సు చీటీలు సద్దుతూ, ఏదో రాసుకుంటూ, "ఈ డాక్టరు సాబు మస్తు చాదస్తుడు. ఒక్కో పేషంటుతో గిట్ల అర్ధగంట అర్ధగంట ముచ్చట్లు బెడ్తా కూసుంటే మనమెప్పటికి ఇంటికెల్లాలె?" అంటోంది వార్డు బోయ్‌తో. వాడు అవునుకీ కాదుకీ మధ్యస్తంగా బుర్ర ఊపుతున్నాడు.

గది లోపల ఉత్పల్ ఏదో నిశ్చయించుకున్న వాడిలాగా తలెత్తి సూటిగా మనస్వి కళ్లల్లోకి చూశాడు.

"డాక్టరుగారూ! ఇది గవర్న్‌మెంట్ హాస్పిటల్ కదా. ఇక్కడ మీరు ట్రీట్ చేసే పేషెంట్ల దగ్గర మీరు డబ్బు తీసుకుంటారా?" అనడిగాడు.

"ఊహూ. తీసుకోను" ఖచ్చితంగా చెప్పాడు మనస్వి.

"నిజంగా?" అడిగాడు ఉత్పల్ నమ్మలేక పోతున్నట్టు చూస్తూ.

"నిజంగా" అన్నాడు మనస్వి చిన్నగా నవ్వుతూ.

ఉత్పల్ పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. "మా నాన్నగారిలాంటి నిజాయితీపరులు స్టేట్ గవర్న్‌మెంట్ ఉద్యోగాల్లో ఇంకా కొందరున్నారంటే నిజంగా చాలా సంతోషంగా ఉంది" అన్నాడు.

"నీ మాటల్లో సంతోషం నీ మొహంలో కనిపించట్లేదు. మీ నాన్నగారు కూడా నువ్వెప్పుడూ ముభావంగా విచారంగా ఉంటున్నావని చెప్పారు" అన్నాడు మనస్వి.

"నేను చాలామటుకు అవినీతి పరుల్నే చూస్తున్నాను. మా నాన్నగారు కూడా అదే చెప్తుంటారు. ఈ రోజుల్లో నూటికొక్కడు నిజాయితీపరుడుంటాడేమో. మిగతా వాళ్ళందరూ అవినీతిపరులే అని. అదే నన్ను ఎక్కువగా బాధిస్తుంటుంది. ముఖ్యంగా నా క్లోజ్ ఫ్రెండొకతనున్నాడు. వాళ్ళ నాన్న ఎంత ఘోరంగా లంచాలు పడ్తాడంటే..." చెప్పలేను అన్నట్టు తల విదిల్చాడు ఉత్పల్.

"ఆయన కరప్ట్ అయితే నీకేం నష్టం?





నువ్వు మనసు పాడుచేసుకోడం ఎందుకు? " అన్న మనస్వి మాటలకు తల అడ్డంగా తిప్పుతూ.

"దేశానికి నష్టం. దానివల్ల మా జెనరేష న్‌కీ నష్టం. నేనిలా ఎందుకంటున్నానంటే ప్రస్తుతం నాకళ్ళెదురుగా నా ఫ్రెండు పూర్తిగా దిగజారిపోతున్నాడు. తండ్రి చేసే పాడుపనులు చూడలేక వాడికి మతిపో తోంది. రాజీవ్‌గాడు డ్రగ్స్‌క్కూడా అలవాటు పడుతున్నాడేమోనని నాకూ మా మిగతా ఫ్రెండ్స్‌కీ అనుమానం వేస్తోంది" అన్నాడు ఉత్పల్.

రాజీవ్ అన్న పేరు వినగానే కుతూహలం కలిగింది మనస్వికి. తన మనసులో రేగిన కుతూహలం ముఖంలో కనిపించకుండా జాగ్రత్తపడి నిశ్చలంగా కూచుని ఉత్పల్ చెప్తున్న మాటలు శ్రద్ధగా వినసాగాడు మనస్వి.

"రాజీవ్ నా ఫ్రెండ్సందర్లోకీ నాకెంతో ఇష్టం. వాళ్ళ నాన్న, మా నాన్న ఒకే ఆఫీ సులో ఒకేరకం ఉద్యోగులు. కానీ వాళ్ళ లైఫ్ స్టైలుకీ మా లైఫ్‌స్టైలుకీ ఏనుక్కీ దోమకీ ఉన్నంత తేడా ఉంది" అన్నాడు ఉత్పల్.

"అంటే? " ప్రశ్నించాడు మనస్వి.

"వాళ్ళింట్లో లగ్జరీ వస్తువులు చాలా ఉంటాయి. ఏవేవో కొని పడేస్తుంటారు రాజీవ్ వాళ్ళ నాన్న. మా నాన్న లోన్ పెట్టి స్కూటర్ కొనడానికి ఎంతో ఆలో చించి ఆలోచించి ఇన్నేళ్ళకి కొన్నారు. కానీ రాజీవ్ వాళ్ళ నాన్న ఒక సెకండ్ హాండ్ కారు కొనేశాడెప్పుడో. అదే కాక మళ్ళీ ఆయ నకీ, రాజీవ్‌కీ ఎవరి స్కూటర్లు వాళ్ళకు న్నాయి. అవన్నీ ఆయన అవినీతిపనులు చేసే సంపాదించాడు" చెప్పాడు ఉత్పల్.

"నీ విచారానికి కారణం అదేనా? " అడి గాడు మనస్వి.

అవునన్నట్టు తలూపాడు ఉత్పల్ "ఆయన లంచగొండితనం ఆ లైఫ్‌స్టైలూ రాజీవ్‌కి అస్సలిష్టంలేదు. వాడికసలు వాళ్ళ నాన్న చేసే పనులేవీ నచ్చవు. పైగా వాళ్ళమ్మ కూడా హైక్లాసు లైఫే ఇష్టం. ఎప్పుడూ క్లబ్బులూ పార్టీలూ అంటూ పిల్లల సంగతే పట్టించుకోదు. మా ఇంట్లోలాగా వాళ్ళింట్లో అందరూ కలిసి కబుర్లు చెప్పుకో వడంలాంటిదేమీ ఉండదు. ఎవరికివారే అన్నట్టుంటారు. దానివల్లేనేమో వాడదోర కంగా తయారవుతున్నాడు. ఈమధ్య అప్పు డప్పుడూ తనకి చచ్చిపోవాలనుంది అని కూడా అంటున్నాడు" అంటూ రాజీవ్ గురించి తనకున్న దిగులంతా డాక్టరుగారికి మరో పదినిముషాలసేపు చెప్పుకున్నాడు ఉత్పల్.

"నీ స్నేహితుడికోసం నువ్వు దిగులుప డడం సమంజసమే అనుకో. అయినా ఇరవై నాలుగ్గంటలూ అదే దిగులు పెట్టుకుని నీ మనసు పాడుచేసుకోడంవల్ల ప్రయోజనం ఏ ముంది? నువ్వు సంతోషంగా లేకపోవడం చూసి మీ పేరెంట్స్ బెంగపెట్టేసుకున్నారు. నువ్వు రాజీవ్ గురించే అతిగా ఆలోచించి నీ టైము వృధా చేసుకుంటున్నావు. దీనివల్ల నీ చదువు చెడిపోతోంది. ఇలా బాధప డుతూ కూచోడంవల్ల ఇంకేం ప్రయోజనం లేదు. వీలయితే నువ్వూ నీ ఫ్రెండ్సూ కలిసి రాజీవ్ మామూలు మనిషయ్యేలా అతని మనశ్శాంతికోసం ప్రయత్నించాలి. అంతే గానీ నువ్వుకూడా బుర్రపాడుచేసుక్కూచోకూ డదు" అంటూ కొంతసేపు ఉత్పల్‌కి నచ్చజె ప్పాడు మనస్వి.

తరువాత హరిశ్చంద్రను లోపలికి పిలిచి, "మీ అబ్బాయికి మానసిక వ్యాధి ఏమీ లేదు. కాకపోతే తన స్నేహితుడి పరిస్థితికి బాగా బాధపడుతున్నాడు. అతను ముభా వంగా, డల్‌గా ఉండడానికి అదేకారణం. మీరు, మీ మిగతా కుటుంబ సభ్యులు కాస్త అతనికి మనశ్శాంతి కలిగేలా మాట్లాడడం, ప్రవర్తించడంవల్ల అతను మామూలుగా అవుతాడు" అని చెప్పాడు మనస్వి.

# సచిత్ర విచిత్రం

## అతిపెద్ద ప్రకటన



కథేమై వుండచ్చో కొద్ది క్షణాలు ఆలోచించండి. క్లాడియాస్నిఫర్ అనే న్యూజిలాండ్ సినీనటి మొహం అది. ఆక్‌లాండ్ నగరంలోని ఓ ప్రకటనల కంపెనీ 600 చ.గజాల మేర ఆమె మొహాన్ని ప్రకటనకి ఓ పెద్ద బోర్డు మీద గీసింది. అయితే పైభాగానికి సరిపడే నిచ్చెనలు లేక పోవడంతో ఆ జయింట్‌సైజ్ బోర్డు మీదికి చిత్రకారులు వేలాడే తాడు సహాయంతో వెళ్లి పనిని ముగించారు. కొన్నిచోట్ల చేత్తో గీసి, కొన్నిచోట్ల కాగితం అతికించి దీన్ని 6 రోజుల్లో పూర్తిచేయడానికి నలుగురు అవసరం అయ్యారు. ఇది ప్రపంచంలోని అతిపెద్ద ప్రకటన.

డాక్టరుగారు చెప్పినది వినగానే హరిశ్చంద్ర ముఖం వికసించింది. తలమీంచి పెద్దభారం దిగినట్టు హాయిగా నిట్టూర్చాడు. డాక్టరుగారిని వివరాలడిగి తెలుసుకుని సందేహనివృత్తి చేసుకున్నాడు.

తండ్రితోపాటు బయటకు వెళ్ళబోతున్న ఉత్పల్ కొంచెం ఆగి, "సర్! రాజీవ్ గురించి మీతో ఇంకా మాట్లాడి డిస్కస్ చెయ్యాలని ఉంది నాకు" అన్నాడు.

ఆధునిక జీవన విధానాల్లో మనసులో మాట చెప్పుకుంటే విని అర్థంచేసుకునేవారు దొరకడమే అరుదు. ఇంట్లోవాళ్ళు ఎంత సహకరించినా, డా. మనస్విలా విశ్లేషించి సమస్యను అర్థంచేసుకుని పరిష్కరించే సామర్థ్యం ఉన్నవాళ్ళుకాదు. అందుకే ఉత్పల్ కి డాక్టరుగారితో ఇంకా చర్చించాలి అన్న కోరిక కలిగింది.

"సరే మళ్ళీ శుక్రవారం రాగలుగుతావా? నీకింకా ఏవైనా సందేహాలుంటే తీర్చుకుందువుగాని" అని చెప్పి పంపేశాడు డా. మనస్వి.

★ ★ ★

నర్సింగ్ హోమ్ ముందు కారు పార్క్ చేసి మనస్వి చకచకా నడిచి ఏ.సి. రూమ్స్ వైపు వెళ్ళాడు. ఒక రూమ్ తలుపు తట్టి లోపలికి వెళ్ళాడు. "హలో రాజీవ్! హౌ ఆర్ యూ? " అన్న మనస్వి గొంతు విని మంచంమీద పడుకునున్న రాజీవ్ కళ్ళు తెరిచాడు. ఏమీ మాట్లాడకుండా మనస్వివైపు చూసి కళ్ళు తిప్పుకున్నాడు.

దగ్గరగా వెళ్ళి పల్స్ చెక్ చేసి అతని చేతిని అలాగే మృదువుగా పట్టుకుని "ఎలా ఉంది? ఇంకా నిద్రమత్తుగా ఉందా? " అనడిగాడు మనస్వి చిరునవ్వుతో. లేదన్నట్టుగా తలూపాడు రాజీవ్. అతనికి తోడుగా ఉండడానికి ఎవరూ రాలేదన్న సంగతి అర్థమైంది మనస్వికి.

"రెస్ట్ తీసుకో. పేషెంట్లని చూసేసి వస్తాను" అని చెప్పి బయటకి నడిచాడు.

బయటకొచ్చాక నర్సుతో. "ఈ పేషెంటు కోసం ఇవాళ ఎవరైనా వచ్చారా? " అనడిగాడు.

"ఒక ముసలాయనొచ్చాడు. అతని పేరు ముసలయ్యట. వాళ్ళింట్లో వంటవాడుట. మధ్యాహ్నం లంచ్ పట్టుకొచ్చాడు. సాయంత్రం ఫ్లాస్కులో కాఫీ ఉంటే నేనే తాగించాను" రిపోర్టంతా ఇచ్చింది నర్సు.

'కొడుకిలాంటి స్థితిలో ఉన్నా పొద్దున్నించీ ఇంట్లో ఎవరికీ అతని మొహం చూడ్డానికి తీరికే దొరకలేదా? ఏం మనుషులో!' మనసులో అనుకుంటూ, పైకి నర్సుతో "ఆల్ రైట్ అతని కోసం వాళ్ళవాళ్ళెవరైనా వస్తే నన్ను కలుసుకోమని చెప్పు" అన్నాడు.

తన కన్సల్టేషన్ రూమ్ ముందు తన కోసం వెయిట్ చేస్తూ కూచున్న వాళ్ళ నమస్కారాలందుకుంటూ రూమ్ లోకి వెళ్ళికూచుని మొదటి పేషెంటుని పిలిచాడు మనస్వి.

రాజీవ్ ని అంతకుముందు రోజు రాత్రి అపస్మారక స్థితిలో నర్సింగ్ హోమ్ కి తీసుకొచ్చారు. అతను స్లీపింగ్ పిల్స్ మింగేశాడు.

నర్సింగ్ హోమ్ నడుపుతున్న డాక్టర్ రామారావు రాజీవ్ కి వెంటనే స్టమక్ వాష్ ఇచ్చి ప్రాణం కాపాడాడు. రాజీవ్ తండ్రి మోహన్రావు, రామారావు బంధువులు. మామూలుగా అయితే స్లీపింగ్ పిల్స్ మింగేసి ఆత్మహత్యా ప్రయత్నం చేసిన పేషెంటుని మెడికోలీగల్ కేసవుతుందన్న భయంతో ప్రైవేటు నర్సింగ్ హోములు అడ్మిట్ చేసుకోడానికి వెనకాడతాయి. కానీ మోహన్రావుతో బంధుత్వం ఉండడంవల్లనూ, కష్టసమయంలో వాళ్ళని పొమ్మనే మనస్తత్వం లేనివాడు కావడం వల్లనూ రామారావు తన నర్సింగ్ హోమ్ లో అడ్మిట్ చేసుకుని వైద్యం చేశాడు.

రాజీవ్ ప్రమాదస్థితినుంచి బయటపడ్డాక, రామారావు గదిలో కూచున్న మోహన్రావు "ఏం పిల్లలో! పాడు పిల్లలు! సకల సౌక

ర్యాలూ సమకూర్చిపెడితే తిని కూచోలేక వెధవ్వేషాలేస్తారు" అంటూ రాజీవ్‌మీద తిట్లదండకం మొదలుపెట్టాడు.

"ఛీ ఊరుకో. అర్థంలేకుండా వాగకు" రామారావు కసిరేయడంతో మోహన్రావు, అతని పక్కనే కూచున్న భార్య లీల బిత్తర పోయి చూశారు.

"ఇంత చిన్నవయసులో వాడిలాంటి అఘాయిత్యం చేశాడంటే దానికేదో చాలా సీరియస్ కారణం ఉండే ఉంటుంది. నీ బుర్ర తక్కువ మాటలు వింటుంటే దీనికం తటికీ బాధ్యుడివి నువ్వేనేమోననిపిస్తోంది" అన్నాడు రామారావు కోపాన్ని అదుపులో పెట్టుకోడానికి తీవ్రప్రయత్నం చేస్తూ. లీల, మోహన్రావులిద్దరూ బిక్కచచ్చిపోయి నోర్మూసుక్కూచున్నారు.

"ఆల్ రైట్. జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు నీ కొడుక్కి కావలసింది నీ తిట్లూ దెబ్బలూ కాదు. సైకియాట్రిక్ కేర్. వాడి నేదో మానసిక సమస్య పీడిస్తూ ఉండి ఉండాలి. ఆత్మహత్యా ప్రయత్నం చేశాడం టేనే అది మానసిక వ్యధకీ, వ్యాధికీ సూచన. మా నర్సింగ్ హోమ్‌లోనే డాక్టర్ మనస్వి అని సైకియాట్రీ ప్రొఫెసర్ ఒకా యన ప్రాక్టీస్ పెట్టుకున్నాడు. సాయం త్రాలు చూస్తాడు. రేపు పొద్దున్న ఆయన హాస్పిటల్‌కి వెళ్ళేలోపు ఒక్కసారి మన రాజీ వ్‌ని చూసి వెళ్ళమని రిక్వెస్ట్ చేస్తాను. ఆ టైముకి మీరిక్కడే ఉండాలి" అన్నాడు రామారావు.

కానీ పొద్దున్న డా. మనస్వి రాజీవ్‌ని చూడడానికి వచ్చేటప్పటికి లీలగానీ మోహ న్రావుగానీ అక్కడలేరు. రామారావు సిగ్గుతో తల దించుకోవాల్సొచ్చింది. అప్పటికి రాజీవ్ మాట్లాడగలిగే స్థితిలో కూడా లేదు.

ఇప్పుడు సాయంత్రం కూడా రాజీవ్ ఇంట్లోవాళ్ళెవరూ అతని దగ్గరలేరు. సైకి యాట్రీ ట్రీట్‌మెంట్‌లో పేషెంట్ యొక్క కుటుంబ సభ్యుల పాత్ర ఎంతో ముఖ్యమై నది. పేషెంట్ ప్రవర్తన, అతని నిత్యజీవిత సమస్యలు మొదలైన విషయాల గురించి డాక్టరుకి వివరంగా చెప్పగలిగేది వారే. వారి తరువాత అతనితో బాగా సన్నిహి తంగా తిరిగే మిత్రులు, బంధువులు కూడా సహాయపడగలరు. ఈ విషయం మనస్వి తన వద్దకు వచ్చే రోగులతోను, వారికి సంబంధించిన వారితోను చెప్తుంటాడు. కానీ చాలామంది ఈ విషయాన్ని అంతగా పట్టించుకోరు. రోగి డాక్టరు దగ్గరకు వెడు తున్నాడు కదా మేం కూడా ఎందుకన్న నిర్లక్ష్య ధోరణితోనే చాలామంది ఉంటారు.

ప్రస్తుతం రాజీవ్ తల్లిదండ్రులది కూడా ఇదే వైఖరి. రాజీవ్ ఆస్పత్రిలోనే ఉన్నాడు కదా. వాడితో మాట్లాడి వాడి మనసులో బాధేమిటో కనుక్కుని ఆ డాక్టరు మందిచ్చేస్తే అయిపోతుంది కదా ఇంతమాత్రం దానికి మా పనులు పాడుచేసుకుని మేమంతా ఎందుకక్కడికి?' అన్నట్టుగా లీల, మోహన్రావులు ఆరోజుకి ఊరుకున్నారు. ప్రాణాపాయం తప్పింది కాబట్టి ఇంకో రెండ్రోజులు ఆస్పత్రిలోనే ఉండనిచ్చి, మూడోరోజుకి డ్రైవరుతో కారు పంపిస్తే వాడే మామూలుగా ఇంటికొచ్చేస్తాడు అని కూడా ఆలోచించాడు మోహన్రావు.

ఆరోజు రాత్రి ఎనిమిదిన్నరవుతుండగా రామారావు మోహన్రావుకి ఫోను చేశాడు. రామారావు గొంతువింటూనే మోహన్రావు కంగారుపడ్డాడు. "ఎలా ఉంది వాడికి? ఏదైనా సీరియస్సా?" అడిగాడు ఆదుర్దాగా. ఆ ఆదుర్దాకి కారణాలు అనేకం. ముఖ్యమై నది, తనిప్పుడు వెళ్ళబోతున్న డ్రింకు పార్టీ వాయిదాపడుతుందేమోనన్న భయం!

అవతలినుంచి రామారావు కసిరాడు. "వాడికి సీరియస్సైతేే తప్ప వాడి మొహం చూడవా? వచ్చి సైకియాట్రిస్టుని కలవమని చెప్పాను కదరా? ఆయనింకో అరగంటలో వెళ్ళిపోతాడు. నువ్వూ లీలా రండి" అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టుగా.

"అది కాదు..." అంటూ మోహన్రావు ఏదో చెప్పబోయేసరికి రామారావు గద్దించాడు. "నీకు నీ కొడుకు ప్రాణం ముఖ్యం కాదన్న సంగతి నాకు బాగా అర్థమయిందిలే. నువ్విలా నిర్లక్ష్యం చూపిస్తే వాడు నా నర్సింగ్ హోమ్‌లోనే ఉరేసుకోవడం ఖాయం. నా నర్సింగ్ హోమ్‌లో అలాంటిది జరగడం నాకిష్టంలేదు. నువ్వు ట్రీట్‌మెంట్ ఇప్పించదలుచుకోకపోతే నీ ఇష్టం. నీ ఇంటికి తీసుకెళ్ళిపో. వాడి బాధ్యత నా నెత్తికి చుట్టబెట్టకు. ఇంకెప్పుడూ నా సహాయం అడగకు" అని ఖచ్చితంగా చెప్పి ఫోన్ పెట్టేశాడు రామారావు.

అతనికి బాగా కోపం వచ్చిందని గ్రహించాడు మోహనరావు. అయిష్టంగానే తన ఫ్రెండుకి ఫోన్‌చేసి "సారీ గురూ! నేను కొంచెం ఆలస్యంగా వస్తాను. మీరు మొదలుపెట్టండి" అని చెప్పాడు.

"తొందరగా వచ్చెయ్ బాస్! నువ్వు లేకపోతే పార్టీ డల్లుగా ఉంటుంది" అన్నాడు ఫ్రెండ్.

విసుక్కుంటూ నర్సింగ్‌హోమ్ చేరాడు మోహనరావు. ముందుహాల్లోనే నిలబడి స్టాఫ్‌కి ఏవో ఇన్‌స్ట్రక్షన్సిస్తున్న రామారావు మోహనరావుని చూడగానే మొహం చిట్లించాడు.

"మీ ఆవిడేదీ? ఇద్దర్నీ రమ్మన్నానుకదా? నువ్వొక్కడివే తగలడ్డావేం?" అన్నాడు కోపాన్ని అణుచుకోడానికి విశ్వప్రయత్నం చేస్తూ.

"సారీ రామారావ్! మా ఆవిడ కూడా రావాలనే బయల్దేరింది కానీ మా పక్కవాళ్ళమ్మాయికి నొప్పులు మొదలయ్యాయి. ఆస్పత్రికి తీసుకెళ్ళడానికి సాయం రమ్మని పక్కింటావిడ అడిగేసరికి కాదనలేక ఆవిడతోపాటు మెటర్నిటీ హోమ్‌కి వెళ్ళింది. ఆవిడ భర్త కూడా ఊళ్ళో లేడు. ఆవిడసలు నన్ను కూడా రమ్మని గోలపెట్టింది. కానీ కుదరదని చెప్పేసి నేనిలా వచ్చేశా" పచ్చి అబద్ధం ఆడేశాడు మోహనరావు.

అతను అబద్ధం ఆడుతున్నాడని రామారావుకి తెలుసు. ఐదు నిముషాలక్రితం మోహన్రావింటికి మళ్ళీ ఫోన్ చేశాడు రామారావు. మోహనరావు కూతురు సరోజ ఫోన్ తీసింది.

"మీ అమ్మా నాన్నా బయల్దేరారా? ఇక్కడికి మీ తమ్ముణ్ణి చూడ్డానికి వస్తున్నారా?" అనడిగాడు రామారావు.

"అమ్మ క్లబ్బులో ఫంక్షనుందని ఇవాళ నాలుగింటికే వెళ్ళిపోయింది. నాన్న మరి మీ ఆస్పత్రికేనేమో ఇందాక బయల్దేరివెళ్ళాడు" అని చెప్పింది ఆ పిల్ల.

ఫోను పెట్టేసి ఇవతలకొచ్చిన రామారావుకి మెట్లెక్కుతూ మోహనరావు కనిపించాడు. 'ఎంత భయంకరంగా అబద్ధాలాడేస్తున్నాడు వెధవ! వీడింత వెధవన్న సంగతి ఇన్నాళ్ళూ గ్రహించకపోవడం నాది బుద్ధితక్కువ' అని తనని తాను తిట్టుకుంటూ డా. మనస్వి రూమ్‌వైపు నడిచాడు రామారావు.

రామారావు మొహంలో కనిపిస్తున్న క్రోధం మోహనరావుని కాస్త భయపెట్టింది. నోరు మూసేసుకుని రామారావు వెంట మేకలా నడిచాడు.

'డా. మనస్వీ సైకియాట్రిస్ట్' అని మెరుస్తున్న అక్షరాల్తో చిన్న బోర్డు తగిలించి ఉన్న రూమ్ తలుపుమీద చిన్నగా తట్టి లోపలికి అడుగుపెట్టాడు రామారావ్.

నడక స్పీడు తగ్గించి అటూ ఇటూ చూశాడు మోహనరావు. తను మానసిక వ్యాధుల వైద్యుడి దగ్గరికి వెళ్ళడం తెలిసినవాళ్ళెవరైనా చూస్తే పరువు పోతుందని అతని భయం.

తలుపు తెరిచి పట్టుకుని అతనివైపు అసహనంగా చూస్తున్నాడు రామారావు. గబగబా నడిచి మోహనరావు కూడా మనస్వి గదిలోకి ప్రవేశించాడు.

"ఇతను మోహనరావు. రాజీవ్ తండ్రి" అంటూ అతన్ని మనస్వికి పరిచయం

చేశాడు రామారావు.

"కూచోండి" అన్నాడు మనస్వి.

"నేను మిమ్మల్ని మళ్ళీ కలుస్తాను" అంటూ రామారావు వెళ్ళిపోయాడు.

'మరణంతో పోరాడి వెంట్రుక వాసిలో బతికి బయటపడ్డ కొడుకుని చూడడానికి ఇప్పటికి తీరిందా ఇతనికి? ఏం తండ్రి!' అనుకున్నాడు మనస్వి. తన మనసులో భావాలేవీ ముఖంలో ప్రతిఫలించకుండా జాగ్రత్తపడ్డాడు.

"ఏమంటున్నాడు రాజీవ్? ఈ పూట భోజనం చేశాడా? " అనడిగాడు.

మోహన్రావు తడబడ్డాడు. "ఆc... నేను నేనింకా వాడిని చూడలేదు. ఇప్పుడే వస్తున్నా. రాంగానే ఇటు తీసుకొచ్చాడు రామారావు" అంటూ సంజాయిషీ ఇచ్చు కుంటూ కుర్చీలో ఇబ్బందిగా కదిలాడు.

ఈసారి ఆశ్చర్యం దాచుకోడానికి ప్రయ త్నించలేదు మనస్వి. "ఇప్పటివరకూ మీరు రాజీవ్‌ని చూడలేదా? ఏం? ఎందుకని? "

మనస్వి ప్రశ్నకు ఈమాటు తడబడ కుండా జవాబిచ్చేశాడు మోహనరావు.

"చాలా బిజీగా ఉన్నాను సార్. మా కొలీగ్ ఒకాయనకి పొద్దున్న మాసివ్ హార్ట్ టాక్ వచ్చింది సార్. ఆయన్ని ఇంటెన్సివ్ కేర్‌లో చేర్పించడం, వాళ్ళ వాళ్ళందరికీ మెసేజ్‌లు పంపడం ఆ వ్యవహారంతోటే సాయంత్రందాకా సరిపోయింది. ఇక్కడి కొద్దామని నేనూ నా మిసెస్సూ బయల్దేరు తుంటే వాళ్ళమ్మాయికి నొప్పులొస్తున్నాయని కాస్త హెల్ప్ చెయ్యమనీ మా పక్కింటావిడ వచ్చింది. వాళ్ళాయన ఊళ్ళోలేరు. ఇరుగూ పొరుగూ అన్నాక ఆమాత్రం ఒకళ్ళకొకళ్ళు సాయం చేసుకోపోతే ఎలా? ఇక్కడి కొద్దా మని తయారైన మా మిసెస్‌నీ వాళ్ళనీ మెటర్నిటీ హాస్పిటల్ దగ్గర దింపి, వాళ్ళ క్కావలసినవి చూసి వచ్చేసరికల్లా ఇదిగో ఈ టైమయింది"



పెద్ద కథ అల్లి చెప్పేసి పరోపకారమే నా ఊపిరి అన్నట్టు మొహంపెట్టి మనస్వివైపు చూశాడు.

అతను చెప్తున్నవన్నీ పచ్చి అబద్ధాలని గ్రహించడం మనస్వికేమీ కష్టం కాలేదు. 'కొంపలార్పేసే అబద్ధాలు కన్నార్పకుండా చెప్పెయ్యగల దేవాంతకుడితను' అనుకు న్నాడు మనస్వి.

ఒకసారి అనర్గళంగా మాట్లాడేసరికి మొదట ఉన్న కాస్త మొహమాటం పోయింది మోహనరావుకి.

"రామారావు మా వాడికి ఏదో మానసిక వ్యాధి ఉండే ఉంటుందంటున్నాడు. మీరే వంటారు డాక్టరుగారూ? " రిలాక్స్‌డ్‌గా కుర్చీలో చేర్లబడి కాలూపుతూ అడిగాడు.

"మీరేమనుకుంటున్నారు? " అడిగాడు మనస్వి ఇరిటేషన్ అణచుకుంటూ.

గతుక్కుమన్నాడు మోహన్రావు. ఏంచె ప్పాలో వెంటనే తట్టలేదు. "ఊ...ఆ.... వాడికీ... వాడికి మానసిక సమస్యలూ, వ్యాధులూ ఏంఉంటాయి? కావాల్సినవన్నీ మేం సమకూర్చిపెడుతున్నాం. ఈ కుర్రాళ్లు తిని కూర్చోక వెధవ సినిమాలూ, టీవీలూ చూసి ఏదో ఒకటి నెత్తిమీదికి తెచ్చుకుం టూంటారు. అంతకన్నా ఏం ఉంటుందీ? " అన్నాడు.

మనస్వి ఏమీ మాట్లాడలేదు.

మోహనరావు ఊరికే ఉండలేక మళ్లీ మొదలెట్టాడు. "రామారావు మాత్రం మావాడిది సైకియాట్రిక్ ప్రాబ్లెమే అంటు న్నాడు. అనడం ఏమిటీ... నా బుర్ర తినే స్తున్నాడు నిన్నటినుంచీ" అన్నాడు.

మనస్వి ఏమీ మాట్లాడకుండా నిశ్చలంగా కూచున్నాడు.

మోహనరావు చాలా ఇబ్బందిగా ఫీల య్యాడు. కాళ్ల ఊపులూ, వెర్రినవ్వులూ తగ్గాయి. కుదురుగా కూర్చుని, ముందుకి వంగి "మీ అభిప్రాయం చెప్పనేలేదు డాక్టరు గారూ! పొద్దున్న రాజీవ్‌ని చూశారను కుంటా. వాడిది మానసిక వ్యాధా? "

దాదాపు ఏడుపు మొహంతో అడిగాడు.

"పొద్దున్న, ఇందాక రాజీవ్‌ని నేను చూసే టప్పటికి అతనింకా మాట్లాడే మూడ్‌లో లేడు. మీరు నేనడిగే ప్రశ్నలకి జవాబు చెబితే, కొంతవరకూ నా అభిప్రాయం చెప్ప గలను"

మనస్వి మాటలు వింటూ పోలీసు ఇంట రాగేషన్‌ని ఎదుర్కోబోయే నేరస్థుడిలా బిగు సుకుపోయి టెన్షన్‌గా కూచున్నాడు మోహన రావు.

"మీకు రాజీవ్ ఒక్కడే కొడుకా? ఇంకా పిల్లలున్నారా? "

మనస్వి ప్రశ్న వినగానే కాస్త తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు మోహనరావు. ఇలాంటి ప్రశ్నలకైతే ఎన్నిటికైనా ఈజీగా జవాబు చెప్పెయ్యొచ్చనుకున్నాడు.

"ఒక అమ్మాయి కూడా వుంది. రాజీవ్ కన్నా మూడేళ్లు పెద్దది" చెప్పాడు.

"చదువుకుంటోందా? "

"ఆ... బియ్యే"

సరోజ చెప్పుకోవడానికి బియ్యే ఫైనలియ ర్‌లోనే ఉంది. ముందరి రెండు సంవత్స రాల పరీక్షల్లోనూ ఎన్ని సబ్జెక్టులు పాస య్యిందీ, ఎన్ని ఫెయిలయిందీ అన్న ప్రశ్నకు మాత్రం మోహనరావే కాదు, ఆ పిల్ల కూడా తడుముకోకుండా వెంటనే జవాబు చెప్పలేదేమో.

"మీ పిల్లలిద్దరూ బాగా చదువుతారా? " మరో ప్రశ్న వేశాడు మనస్వి.

"ఇద్దర్లోకీ రాజీవ్ బాగా చదువుతాడు. అమ్మాయి చదువులో ఎలాగైనా డల్లే" జన్మకో శివరాత్రి అన్నట్టు ఆ ఒక్క ప్రశ్నకీ చాలా సిన్సియర్‌గా నిజం చెప్పేశాడు మోహనరావు.

"అక్కా తమ్ముళ్ల మధ్య సఖ్యత ఉందా? " అడిగాడు మనస్వి.

ఇరకాటంలో పడ్డాడు మోహనరావు.

'ఏమో! ఇద్దరూ ఏం తగలడతారో నేనే మైనా చూడొచ్చానా? ఇవేం దిక్కుమాలిన ప్రశ్నలూ'? అనుకున్నాడు మనసులో.

పైకి మాత్రం "ఆ సఖ్యంగానే ఉంటారు" అనేశాడు.

"రాజీవ్ ఇంట్లో ఎవరితో ఎక్కువ క్లోజ్‌గా ఉంటాడు? మీతోనా? మీ భార్యతోనా? "

"ఆ... అందరితోనూ ఒకలాగే ఉంటాడు" అన్నాడు మోహనరావు అటూ ఇటూ కాకుండా.

"అంటే? ఎవరితోనూ అతనికి చనువు లేదా? "

సూటిగా వచ్చిన మనస్వి ప్రశ్న పచ్చి వెల క్కాయలా మోహనరావు గొంతుకి అడ్డం పడింది.

"అది కాదు నా ఉద్దేశం. అందరితోనూ చనువుగా, క్లోజ్‌గానే వుంటాడు. మగపి ల్లాడు కాబట్టి నాతో కాస్త ఎక్కువ చనువుగా ఉంటాడు"

మోహనరావు మాటలు ఒట్టి డబాయింపు లని కనిపెట్టడానికి అవతలివాడు సైకియా ట్రిస్టు కానవసరంలేదు.

"ఊహూ... మీతో చనువుగానే ఉంటాడ న్నమాట. అయితే తనకి చచ్చిపోవాలని ఉన్నట్టుగా మీతో ఎప్పుడైనా అతను అని ఉండాలే..." అన్నాడు మనస్వి మోహన రావు మొహంలోకి నిశితంగా చూస్తూ.

"అబ్బెబ్బె... బ్బే... అలా ఎప్పుడూ అనలా వాడు నాతో" కంగారుపడిపోయాడు మోహనరావు.

"పోనీ. అతను నిద్రమాత్రలు మింగేసిన రోజున ఇంట్లో ఏదైనా గొడవ జరిగిందా? "

"గొడవా? గొడవేం జరుగుతుంది? ఏం జరగలేదు"

మోహన్రావునించి నిజం రాబట్టడం అంత సులభం కాదని మనస్వికి అర్థం అయిపోయింది.

"అసలు ఈమధ్య అతని ప్రవర్తనలో ఏదైనా మార్పు కనిపించిందా? "

"ఏంలేదు. మార్పేం కనిపించలేదు" అనే శాడు మోహన్రావు. 'ఎప్పుడూ వాడిని, వాడిలో మార్పుల్నీ గమనిస్తూ కూచోడం

తప్ప నాకింకో పనీపాటా లేదనుకుంటు న్నాడా ఏంటి ఈ డాక్టరు!' అనుకున్నాడు మనసులో.

"అతను మీతో క్లోజ్‌గానే ఉంటాడంటు న్నారు. ఈమధ్య అతని ప్రవర్తనలో మార్పు కూడా ఏమీ లేదంటున్నారు. మరి తనకే దైనా సమస్యగానీ బాధగానీ కలిగితే మీతో చెప్పుకోక ఆత్మహత్యకెందుకు ప్రయత్నిం చాడు? " అడిగాడు మనస్వి.

'బావుంది నాయనా. అది కూడా నేనే చెప్తే ఇంక సైకియాట్రిస్టులెందుకు? ' అనుకు న్నాడు మోహన్రావు విసుగ్గా.

"సర్లెండి. మీకు తెలీని సంగతులేవో జరి గుంటాయి. ఇంట్లో మిగతావాళ్లు చెప్పగలు గుతారు బహుశా. రేపు మీ భార్యనీ, అమ్మాయినీ కూడా తీసుకురండి. అంద రితోటీ మాట్లాడితేగానీ ఏ సంగతీ నిర్ణయిం చలేం" అన్నాడు మనస్వి.

ఒక్కసారి పంజరంలోంచి విడుదలైన పక్షిలా లేచి నిలబడి ఒక నమస్కారం పెట్టి తేలిగ్గా నిట్టూరుస్తూ బయటపడ్డాడు మోహ న్రావు.

డా. మనస్వి సైకియాట్రిస్టుగా తన సుదీర్ఘ అనుభవంలో ఎన్నోరకాల మను షుల్ని చూశాడు. కానీ ఎప్పటికప్పుడే కొత్తగా ఆశ్చర్యంగా ఉంటుంది. బాధగా కూడా ఉంటుంది.

మోహనరావులాంటి తండ్రుల్ని ఇంతకు ముందు కూడా చూశాడు. డబ్బు, విలాసవ స్తువులు ఉంటే ఇంకేమీ అక్కరలేదన్నట్టు ఉంటారు వాళ్ళు. మనసుకి ప్రేమ ఆదరణ కూడా అవసరమవుతాయన్న సంగతి వాళ్ళకి తట్టదు. స్వంత పిల్లల విషయంలో కూడా చాలా ఇన్సెన్సిటివ్‌గా ఏ స్పందనా లేకుండా ఉండగలుగుతారు. పేషెంట్ల తోనూ, వారి కుటుంబ సభ్యులతోనూ ఎంతో డిటాచ్‌మెంట్‌తో వ్యవహరిస్తాడు మనస్వి. అయినా ఒక్కొక్కసారి రాజీవ్ లాంటి వాళ్ళని చూస్తుంటే మనసు కాస్త బాధపడుతుంది.

దీర్ఘంగా నిట్టూర్చి కారు స్టార్ట్ చేశాడు మనస్వి. పేషెంట్ల గొడవలు ఇక్కడివిక్కడే వదలకపోతే తనకు మనశ్శాంతి ఉండదు.



డాక్టరుగారి రూమ్‌లోంచి బయటపడి టైమ్ చూసుకున్నాడు మోహనరావు. ఎవరి కంటా పడకుండా జారుకుని పార్టీకి పోదామా అనుకున్నాడు.

అప్పుడే అవతలిపక్క రూమ్‌లోంచి బయ టకు వచ్చి కారిడార్‌లో నిలబడ్డ రామారావు అతని వైపు చూశాడు. 'యములాడిలా ఇక్కడే నిలబడ్డాడేమిట్రా బాబూ వీడు!' అనుకుంటూ అటువైపుకి అడుగులేశాడు మోహనరావు.

ఇంతలో తమ ఇంటి వంటాయన ముస లయ్య చేతిలో క్యారియర్ పట్టుకుని రాజీవ్ రూమ్‌లోంచి బైటికి రావడం కనిపించింది మోహనరావుకి.

'వీడింకా ఇక్కడే తగలడ్డాడే! వీడొకడు. వాడి బుర్ర చెడగొట్టడానికి ఎప్పుడూ వాడి వెనకాలే చస్తుంటాడు' అని మనసులో విసు క్కున్నాడు.

ముసలయ్య మోహనరావుని చూడలేదు. సరాసరి రామారావు దగ్గర కెళ్ళి "ఈపూట

కూడా బాబు ఏమీ తినలేదు అయ్యగారూ!" అన్నాడు.

రామారావు తనవైపు వస్తున్న మోహనరావుకేసి చెయ్యి చూపిస్తూ "అదిగో వాళ్ళ నాన్నొస్తున్నాడు. అతనికే చెప్పు కంప్లెయింట్సన్నీ" అన్నాడు.

అప్పుడు చూశాడు ముసలయ్య మోహనరావుని.

అతను దగ్గరగా వచ్చాక, "ఏమన్నారు డాక్టరుగారు? " అనడిగాడు రామారావు.

"ఆ ఏమీ అనలేదు. రేపు మా ఆవిడ్నీ మా అమ్మాయినీ కూడా తీసుకొస్తేగానీ ఏం చెప్పలేనన్నాడు. అవునూ ఇంతకీ ఆ డాక్టరు గట్టివాడేనంటావా? " చాలా లౌక్యంగా మాట్లాడ్తున్నాననుకుంటూ అడిగాడు మోహనరావు.

కొరకొరా చూశాడు రామారావు.

తను హద్దుమీరి మాట్లాడానన్న సంగతి గ్రహించుకుని కొంచెం తగ్గాడు మోహన్రావు.

"ఇప్పటికైనా రాజీవ్ మొహం చూస్తావా? టైంలేదా? " వెటకారంగా అడిగాడు రామారావు.

"అదేవిట్రా? నేనేదో కసాయివాడ్నన్నట్టు మాట్లాడ్తావు? " అంటున్న అతన్ని మధ్యలోనే ఆపి, "చూడు, ఈ ముసలయ్య ఏదో చెప్తున్నాడు. వెళ్ళి వాడిని పలకరించి, వాడు కాస్త ఎంగిలి పడేలా చూడు. నాకు పనుంది. మళ్ళీ వస్తా" అంటూ వెళ్ళిపోయాడు రామారావు.

మోహన్రావు, ముసలయ్య రాజీవ్ గదిలోకి వెళ్ళారు. "ఏరా! ఎలా ఉన్నావ్? అన్నం తినలేదుటగా ఏమయింది? కడుపులో ఏమయినా నెప్పిగా ఉందా? చెప్పు. ఇక్కడి డాక్టర్లందరూ నా ఫ్రెండ్సే. చూపిద్దాం. ఏమయిందో చెప్పు" అన్నాడు అలవాటు ప్రకారం గప్పాలు కొడ్తూ.

లేనిపోని గొప్పలు చెప్పి కొడుకు గౌరవం పొందవచ్చునని అతని భ్రమ. చెప్పే కబుర్లనుబట్టే కాక చూపే ఆదరణ, చేసే చేతలబట్టే పిల్లలు తనని గౌరవిస్తారన్న నిజం గ్రహించడానికి బహుశా అతనికి జీవిత కాలం సరిపోదేమో!

"నెప్పేంలేదు. ఆకల్లేదు. అంతే" గొణిగాడు రాజీవ్ చేతిలో ఉన్న పుస్తకంలోకి చూస్తూ.

'వెధవ ఎంత నిర్లక్ష్యంగా మాట్లాడ్తున్నాడో. చెట్టంత తండ్రిని ఎదురుగా నుంచుంటే కళ్ళెత్తి చూడాలనైనా అనిపించట్లా వీడికి. వీడికోసం నా టైమెందుకు వేస్టు చేసుకోవాలి? ' అనుకున్నాడు రోషంగా మోహన్రావు.

పైకిమాత్రం "ఆకల్లేకపోయినా కాస్తేదయినా తినాలి. లేకపోతే నీరసం వస్తుంది. నిన్నటినుంచీ కడుపు ఖాళీగా ఉందికదా? " అన్నాడు. ఆ చెప్పడం ఏదో ఆర్డరు వేస్తున్నట్టుగా ఉంది గానీ బాధలో ఉన్న కొడుకుని తండ్రి బుజ్జగిస్తున్నట్టుగా లేనేలేదు.

రాజీవ్ ఏమీ మాట్లాడలేదు. మొహాన్ని పుస్తకంలోకి ఇంకాస్త దూర్చేశాడు.

చిర్రెత్తుకొచ్చింది మోహన్రావుకి. ముసలయ్యకి మాత్రం సంబరంగా ఉంది. తండ్రీకొడుకులమధ్య ఈ మాత్రం సంభాషణ నడవగా అతనెన్నడూ చూడలేదు. అయ్యగారు ఈమాత్రం శ్రద్ధ చూపించడం అతనికి హుషారిచ్చింది. ఉత్సాహంగా కేరియర్ తెరిచి గబగబా ఇంత మజ్జిగన్నం కలిపి చెమ్చావేసి రాజీవ్‌కందించాడు.

రాజీవ్ ఏంమాట్లాడకుండా అందుకున్నాడు. తండ్రిగా తన డ్యూటీని తను చాలా బాగా నిర్వర్తించేశాననుకున్నాడు మోహన్రావు.

దర్పంగా మొహంపెట్టి, "ఊ... అన్నం తినేసి హాయిగా పడుకో. నీకు ఆకలీ నిద్రా అన్నీ నార్మలైపోయి నీరసం తగ్గిపోతే ఇంటికి పంపేస్తాం అన్నారు డాక్టరుగారు. నువ్వు బాగా తిని బలం పట్టాలి" అన్నాడు. అక్కడికేదో రాజీవ్‌కి రోగంవచ్చి ఆస్పత్రిలో పడ్డట్టు!

రాజీవ్ మొహం చిట్లించుకున్నాడు. తను అన్నం తిన్నట్టు నటించేస్తే తండ్రి తృప్తిపడి వెళ్ళిపోతాడనుకున్నాడు. 'ఈయనగారు చెప్పినమాట విని అన్నం తింటున్నాననుకుంటున్నట్టున్నాడు. ఇంకా లెక్చర్లు దంచేలా ఉన్నాడు' మనసులో విసుక్కుంటూ చెంచాతో అన్నం కెలుకుతూ కూచున్నాడు రాజీవ్.

అతను ఊరికే చెమ్చా తిప్పుతున్నాడుకాని అన్నం తినట్లేదన్న సంగతి మోహన్రావు బుర్రకెక్కలేదు. తండ్రిగా తన కర్తవ్యం ఇప్పటికే చాలా విపరీతంగా నిర్వహించేశానన్న ఆనందంతో తల మునకలైపోతూ, "సరేరా నేవెళ్ళొస్తా. మా ఆఫీసరుగారెందుకో ఓసారి ఇంటికొచ్చి కలుసుకోమన్నారు. అటెళ్ళి ఇంటికెడతా. ఇంట్లో అక్క ఒక్కత్తే ఉంది" అంటున్న తండ్రికేసి చూస్తే అంత బాధలోనూ నవ్వొచ్చింది రాజీవ్‌కి.

'ఒక్కళ్ళం ఇంట్లో పడుండడం నాకూ, అక్కకీ అస్సలు అలవాటే లేదు పాపం' అనుకున్నాడు వ్యంగ్యంగా.

"సరే నే వెళ్తా. ముసలయ్యా! బాబు భోంచేసి పడుకోగానే నువ్వింటికెళ్లు. రేప్పొద్దున్నే మామూలుకన్నా తొందరగా రా. బాబుకి టిఫిన్ పట్రావాలి. నే వస్తారా రాజీవ్" అని వెళ్ళిపోయాడు మోహన్రావు.

రాజీవ్ చేతిలో ఉన్న గిన్నె బల్లమీద పెట్టేశాడు.

"తిను బాబూ. నాన్నగారు చెప్పారుగా. నీరసం తగ్గాలంటే తినాలి" అంటూ మళ్ళీ రాజీవ్ చేతిలో పెట్టాడు ముసలయ్య.

'నాన్నగారు చెప్పారని కాదు. నువ్వు చెప్పావని తింటున్నాను' అని మనసులో అనుకుంటూ కొంచెం తిని చెయ్యి కడిగేసుకుని పడుకున్నాడు రాజీవ్.

క్యారియర్ కడిగేసి, రూమ్‌లో పుస్తకాలు, పక్కమీది దుప్పట్లు నీటుగా సర్ది, "బాబూ!




రాత్రికి నేనిక్కడుండిపోనా? " అన్నాడు ముసలయ్య.

ముసలయ్యకి తను పనిచేస్తున్న ఇంట్లో ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడే అలవాటు లేదు. ఏదో తన పని తను చేసుకుపోయి జీతం తీసుకోవడం వరకే ఆ ఇంటితో తనకు సంబంధం అన్నట్టుండేవాడు ఇన్నాళ్ళూ. కానీ ఇప్పుడు రాజీవ్ అంత అఘాయిత్యం చేసి ప్రాణం మీదకి తెచ్చుకోవడం అతన్ని కలవరపరిచింది. 'అంత చిన్న వయసులోనే ఆ బాబుకి జీవితంమీద విరక్తి కలిగి చచ్చిపోవాలనుకున్నాడంటే ఆ బాబు మనసులో ఎంత బాధ గూడుకట్టుకుపోయిందోకదా! పిల్లాడి మనసులో ఏముందో కనుక్కుని ఆ బాధ తీర్చడానికి ఆ అమ్మకీ అయ్యకీ ఒక్కక్షణం తీరికుండదాయే. పాపం బాబు! అదృష్టంకొద్దీ బతికి బయటపడ్డాడు కానీ ఆరోజు ఆళ్ళక్క సమయానికి కనిపెట్టుండకపోతే ఉత్తపుణ్యానికి నిండుప్రాణం గాల్లో కలిసిపోయుండేది కదా' అని రోజుకి పదిసార్లయినా అనుకుంటుంటాడు ముసలయ్య.

రాజీవ్ మృత్యుముఖంలోంచి బయటపడ్డప్పటినుంచీ అతనిపట్ల సానుభూతితోపాటు తెలియని ఆపేక్ష కూడా కలిగింది ముసలయ్యకి.

రాజీవ్ ముసలయ్యకేసి చూసి చిన్నగా నవ్వాడు. "ఫర్వాలేదులే ముసలయ్యా! నాకేంకాదు. నువ్వింటికెళ్ళి హాయిగా నిద్రపో. ఇక్కడ నైట్ డ్యూటీ స్టాఫ్ మాటిమాటికీ వచ్చి నన్ను చూస్తూనే ఉంటారు" అన్నాడు.

ముసలయ్య దిగులుగా చూస్తూ వెళ్ళిపోయాడు. 'ఈ ముసలాయన చూపించినపాటి ఆపేక్ష మా అమ్మానాన్నలే చూపించి ఉంటే నేనసలు ఈ స్థితిలో ఉండేవాడినే కాదు' అనుకున్నాడు రాజీవ్.



★ ★ ★

రాజీవ్ ఒకప్పుడు తన తండ్రిలాంటి హీరో ఇంకెవ్వరూ ఉండరనుకునేవాడు. అడిగినా అడగకపోయినా కారుబొమ్మలూ, ట్రెయిన్ సెట్స్సూ, కొత్తరకం బెల్టులూ, బూట్లూ, డ్రెస్సులూ వర్షం కురిపించి కొడుకుని మురిపించేవాడు మోహన్రావు. స్కూల్లో పెద్ద క్లాసు పిల్లలతో సహా ఎవ్వరికీలేని ఖరీదైన క్రికెట్ సెట్ రాజీవ్‌కి ఉండేది. పన్నెండేళ్ళొచ్చేవరకూ 'మై డాడీ గ్రేటెస్ట్' అన్న మైకంతో బతికాడు రాజీవ్. తనతో మాట్లాడినా మాట్లాడకపోయినా ఇల్లంతా నిండిపోతున్న వస్తువులే తండ్రి ప్రేమకు ప్రతీకలనుకునేవాడు.

పన్నెండో యేట పరిచయమయింది ఉత్పల్‌తో. అతని తండ్రి కూడా మోహన్రావు చేసే ఆఫీసులోనే పనిచేస్తున్నాడని తెలుసుకున్నాక ఇద్దరి స్నేహం గట్టిపడి బాగా చేరువయ్యారు. కలిసి చదువుకోడానికో, ఆడుకోడానికో ఒకళ్ళ ఇంటికొకళ్ళు రావడం పోవడం మొదలయింది. అప్పట్లో ఉత్పల్ వాళ్ళింటికి దగ్గర్లోనే రాజీవ్ వాళ్ళిల్లు కూడా ఉండేది. తరవాత రెండేళ్ళకే మోహన్రావు ఊరికి దూరంగా ఉన్న కొత్త కాలనీలో ఇల్లు కొనేశాడు. అక్కడికి మకాం మారాక ఇళ్ళల్లో కలుసుకోవడం తగ్గినా ఉత్పల్‌తో స్నేహం స్కూలునుంచి కాలేజీవరకూ కొనసాగి విడరాని బంధమయింది.

ఉత్పల్ ఇంటికి విరివిగా రాకపోకలు సాగిస్తున్న సమయంలోనే రాజీవ్ కనువిప్పుకి ప్రారంభం జరిగింది.

తన తండ్రి, ఉత్పల్ తండ్రి ఒకే డిపార్ట్‌మెంట్‌లో ఒకేరకం ఉద్యోగులని తెలుసు కానీ తమ ఇద్దరి జీవిత విధానాల్లోనూ, ఇళ్ళలోనూ ఇంత తేడా ఎందుకు కనిపిస్తోందన్న విషయం తెలిసేదికాదు. అర్థమయ్యీ అవనట్టుండేది. ఉత్పల్ మాటలవల్ల కొంత, తన పరిశీలనవల్ల కొంత అర్థం చేసుకున్నాడు రాజీవ్.

ఉత్పల్ తండ్రి నిజాయితీ పరుడు. తన తండ్రి లంచగొండి. ఉత్పల్ తండ్రి హరిశ్చంద్రుడు. అక్రమ సంపాదన జోలికి వెళ్ళడు. అతను తెచ్చే జీతంతోనూ, ఉత్పల్ తల్లి ఇంటిదగ్గరగా ఉన్న చిన్న స్కూల్లో ఉద్యోగం చేసి తీసుకొచ్చే జీతంతోనూ వాళ్ళ ఇల్లు గడుస్తుంది. ఉత్పల్ ఒక్కడే కొడుకు. ఇంక పిల్లలు లేకపోవడంవల్ల వాళ్ళ సంపాదన వాళ్ళకి పుష్కలంగా అవసరాలకి సరిపడా అప్పుచెయ్యనక్కర్లేకుండా సరిపోతుంది. వాళ్ళకి అంతకుమించిన కోరికలూ, ఆదాయానికి మించిన అత్యాశలూ లేవు. అందువల్ల ఆ యింట్లో ఆపేక్షలూ, ఆప్యాయతలూ పెరగడానికి అవకాశం, తల్లిదండ్రులకు కొడుకుతో సమయం గడపడానికి తీరికా ఉన్నాయి.

రాజీవ్ తండ్రి మోహన్రావుకే కాదు తల్లి లీలకు కూడా విలాసవంతమైన జీవితంపట్ల మోజు అధికం. అందువల్ల మోహన్రావు అక్రమమార్గంలో సంపాదిస్తాడు. ఒట్టి జీతాన్నే నమ్ముకుంటే బతుకులో ఏ సుఖాన్నీ పొందలేం అని మోహన్రావు ప్రగాఢ విశ్వాసం. అతను సుఖాన్వేషణలో పరుగులు పెడుతూ తనతోపాటు భార్యనీ పరిగెత్తిస్తుంటాడు. ఈ భార్యాభర్తలు మోజులకోసం పెట్టే పరుగుల వేగంలో కలుసుకోలేక వెనకపడిపోయిన పిల్లలిద్దరూ ఆప్యాయత, ఆదరణా కరువై అలమటించిపోతున్నారు.

★ ★ ★

మోహన్రావు ఒక ప్రభుత్వ ఆఫీస్‌లో ఉద్యోగి. రాష్ట్రమంతటా విస్తరించుకుని ఉన్న ఆ ఆఫీస్‌లో ఉద్యోగుల ట్రాన్స్‌ఫర్లూ, ప్రమోషన్లూ, పోస్టింగులూ మొదలయినవన్నీ నిర్ణయించబడతాయి.

"జీతం తీసుకుంటాంగానీ మాకు పని చెప్పకండి. ప్రభుత్వోద్యోగాలు కావాలిగానీ బదిలీలు ఉండకూడదు" అన్న ధ్యేయాలతో

ఉద్యోగాల్లో వర్థిల్లే గవర్నమెంట్ ఉద్యోగు లకు మోహన్రావు ఆఫీస్ కల్పతరువు.

ఉద్యోగుల ప్రతి కోరికకూ, పనికీ ఇంత అని ఫిక్సెడ్ రేట్లుంటాయి. ఆ రేటు చెల్లిస్తే చాలు కోరుకున్న ట్రాన్స్ఫరో ప్రమోషనో పోస్టింగో వచ్చి చేతిలోపడుతుంది. తనకి ప్రమోషన్ రావాలన్నా తన శత్రువుకి రావా ల్సిన ప్రమోషన్ ఆగాలన్నా నిర్ణయించిన రేటు చెల్లిస్తే జరిగిపోతుంది. ఈ లావాదేవీ లన్నీ నేర్పుగా, ఎవరికీ నెప్పి తెలియకుండా నడిపించెయ్యడంలో నిపుణుడు మోహ న్రావు. సర్వాంతర్యామిలా ఆఫీసులోని సెక్ష న్లన్నీ వ్యాపించి ఆక్రమించుకున్నాడు. తన తోసహా ఎవరిచేతికీ బురద అంటుకోకుండా వ్యవహారం నడిపించి 'కిందనుంచి పైదాకా' అందర్నీ సంతృప్తిపరచగల నేర్పరి. నౌకర్లూ, అధికార్లూ అందరికీ అతను ఆప్తుడే.

మోహన్రావుకి స్వభావసిద్ధంగా ఉన్న స్థాయికి మించిన ఆశలే అతనికి అన్నిరకా లైన నైపుణ్యాలనీ, నేర్పరితనాలనీ అందిం చాయి.

మామూలు మధ్యతరగతి కుటుంబంలో ఎనిమిది మంది పిల్లల్లో ఒకడుగా పుట్టి పెరిగాడు మోహన్రావు. ఊహ తెలిసినప్పటి నుంచి ధనవంతుల వర్గాన్ని చేరుకోవాలన్న కోరికతోనే దహించుకుపోయాడు.

డిగ్రీ చేతికొచ్చి చిరుద్యోగంలో ఇరుక్కున్న ఆర్నెల్లల్లోనే అతను తన ఆశలూ కోరికలూ తీరే మార్గాన్ని కనిపెట్టాడు. దాదాపు తిండి మానుకుని కూడబెట్టి, అలా కూడబెట్టిన ధనాన్ని లంచంగా సమర్పించి కామధే నువులాంటి డిపార్ట్మెంట్కు ట్రాన్స్ఫర్ చేయించుకున్నాడు.

డిపార్ట్మెంట్లో అడుగుపెట్టింది మొదలు దీక్షపట్టిన వాడిలా శ్రమించి, లంచం పట్టేవిద్యలో ఆరితేరాడు. ఆఫీస్లో పనికి తగ్గ ధరలు నిర్ణయించి, మంచి పక డ్బందీ సిస్టమ్ రూపొందించి అది సాఫీగా అమలు జరిగే పద్ధతులన్నీ కట్టుదిట్టం చేసి నవాడు మోహన్రావే. అతగాడు తయారు చేసి అమలుచేస్తున్న 'శాస్త్రీయపద్ధతుల' వల్ల ఆఫీసులో అందరికీ ఆట్టే శ్రమ లేకుండా ముడుపులు ముడుతున్నాయి.

మోహన్రావుకి జన్మతః వచ్చిన ధన దాహం, విలాసజీవితం మీది మోజూ అత నిని అంగుడు లేకుండా మింగేసేవాడిలా తయారుచేశాయి. కుప్పలుగా వచ్చి పడు తున్న డబ్బుతోపాటు అంతస్తుకి మించిన అలవాట్లు కూడా చేరాయి. అలవాట్లు వ్యస నాలుగా రూపాంతరం చెందడానికి ఎంతో కాలం పట్టలేదు.

డబ్బుతో సభ్యత్వం దొరికే క్లబ్బులో ప్రవే శించాడు. హైక్లాస్ లైఫంటే ఇదే అనుకుని తాగుడూ మరిగాడు. తాగేటప్పుడు చుట్టూ స్నేహితులుండాలి. వాళ్ళముందు తనకి డబ్బంటే లెక్కలేదన్నట్టు ఖర్చుపెట్టాలి. అప్పుడుగానీ అసలైన కిక్కురాదు.

వచ్చిన కిక్కులో థ్రిల్లుండాలంటే తన చుట్టూ ఉన్న వందిమాగధుల్లో కనీసం ఒక డైనా తనపై అధికారి అదీ తనపైన రెండు మూడు మెట్లపై ఉండే ర్యాంకు అధికారి ఉండితీరాలి. తను చాకచక్యంగా 'కస్టమర్స్' దగ్గర్నుంచి లాగిన 'పేమెంటు' తను పంచి వ్వగా ఆఫీసర్లు పుచ్చుకుని ఆ సంతోషంలో తనతో కలిసి మందుకొట్టాలి. అప్పుడూ అసలు థ్రిల్లు! ఆ థ్రిల్లుకోసం మోహన్రావు ఏమైనా చేస్తాడు.

తన థ్రిల్లు వేటలో మోహన్రావు ఇల్లు పట్టకుండా తిరుగుతుంటాడు. 'ఇంట్లో కూచుంటే ఏమొస్తుంది. చేతికి చిప్పతప్ప!' అన్న పిలాసఫీ అతనిది.

"ఇంట్లో నీ భార్యాపిల్లలూ వాళ్ళ సంగ తులు చూసుకోవద్దా? ఎంతసేపూ నీ జల్సాలు, తిరుగుళ్ళేనా?" అని ఇంతవరకూ అతన్ని ఎవరూ అడగలేదనుకోండి. ఒకవేళ ఎవరైనా అడిగినా అతని దగ్గర సమాధానం తయారుగా ఉంది.

"నా వాళ్ళ సంగతి నేను చూడట్లేదను

కున్న వాడొట్టి దద్దమ్మ. ఇంట్లో అందరికీ సుష్టుగా వండిపెట్టడానికి వంటాయను న్నాడు. మిగతా పనులకి పనిమనుషులు న్నారు. మా ఆవిడకి వంటింటి ఖైదు తప్పించి ఆవిడ కూడా సోషల్‌గా మూవ్ అవడానికి ఎంతో ప్రోత్సహిస్తున్నాను.

ఇంక పిల్లల సంగతంటారా? నెలనెలా వేలకి వేలు ఫీజులు, డొనేషన్లూ కట్టి బెస్టు కాలేజీల్లో చదివిస్తున్నాను. ఇద్దరికీ చెరో రూమూ ఉన్నాయి. వాళ్ళు చదువుకునే కుర్చీ, బల్లా, బట్టలు పెట్టుకునే కప్ బోర్డూ అన్నీ గాడ్రెజ్‌వే. ఇంతకన్నా ఏ తండ్రైనా ఏమివ్వగలడూ? " అని ఎదురు ప్రశ్న వేస్తాడు.

తిండి, వస్తువులతోపాటు కడుపున పుట్టిన పిల్లలకి ప్రేమ, ఆదరణ కూడా ఇవ్వాలని చెపితే అతనికి అర్ధంకాదు. ఒక వయసు వచ్చాక పిల్లలకీ, తల్లిదండ్రులకీ మధ్య స్నేహం పెంపొందాలని చెప్తే బహుశా బిత్తరపోతాడేమో. చెప్పినవాళ్ళకి మతిపో యిందని కూడా అనుమానిస్తాడు.

ఇక అతని భార్య, 'వంటింటి ఖైదునుంచి విముక్తి పొందిన' లీల విషయానికి వద్దాం. ధర్మార్ధకామమోక్షాల్లో తోడుగా నిలిచే స్త్రీ ధర్మపత్ని అవుతుంది. భర్త చేసే అధర్మ కార్యాలన్నిటిలోనూ తోడుగా నిలిచి సపోర్ట్ ఇచ్చే స్త్రీని 'అధర్మపత్ని' అనవచ్చునంటే లీల ఆ బాపతే.

తన భర్తకు స్త్రీ రూపంలో నిలిచిన ప్రతి బింబం లీల. డబ్బు జబ్బు, విలాసజీవితం పట్ల అంతులేని మోజు ఆమెక్కూడా ఉన్నాయి. తనకంటే పై అంతస్తులో ఉన్న వాళ్ళతో భుజాలు రాసుకు తిరగడం ఆమెకు ఎనలేని ఆనందాన్నిస్తుంది.

భార్యాభర్తలిద్దరూ ఎవరిదారిన వారు విలాసాల వేటలో పడి తిరుగుతుంటే వారి కడుపున పుట్టిన పిల్లలు తమ ఇంట్లో తామే అన్నీ వున్న అనాధల్లా అల్లాడుతున్నారు.

* * *

ఆరోజు రాజీవ్ దగ్గర 'అక్క ఒక్కర్తీ ఉంది ఇంటిదగ్గర' అని కూతురి క్షేమం కోసం ఆరాటపడుతున్నవాడిలా బయల్దేరిన మోహనరావు సరాసరి క్లబ్బుకి వెళ్ళిపో యాడు. అక్కడ పార్టీలో తనబోటి సెక్షన్ హెడ్డులూ, గుమాస్తాలూ మరో నలుగురు కాక తమ విభాగం డైరెక్టరు గారు కూడా తమతో జాయిన్ అవుతున్నారు. ఆయన తన స్నేహితులు ఇంకో ఇద్దరు ఉన్నతాధికా రులను కూడా తీసుకు వస్తానన్నాడు. వాళ్ళను కలుసుకుని వాళ్ళతో పరిచయాలు పెంచుకోవాలని మోహన్రావు తహతహలాడి పోతున్నాడు. అలా పరిచయాలు పెంచు కుని ఇతర డిపార్ట్‌మెంటుల్లో కూడా పైర వీలు నడిపి ఇంకా గడించాలన్నది అతని బంగారు కల.

కలలు పండించుకోవాలన్న నిశ్చయంతో అతను క్లబ్బులోకి అడుగుపెట్టేసరికి కనిపిం చిన దృశ్యం అతని మనసుని మండిం చింది.

తను లేకపోతే పార్టీయే లేదన్నట్టు బాసూ పీసూ అంటూ కబుర్లుచెప్పే చెమ్చా గాళ్ళు తనకోసం ఎదురుచూడట్లేదు. పార్టీ మాంచి ఊపులో ఉండడమేకాక ఈ చెమ్చా గాళ్ళు ఆ ముగ్గురు అధికార్లతోనూ చుట్టరి కాలు కలిపేస్తున్న లెవెల్లో పూసుకుతిరుగు తున్నారు. ఈర్ష్యతో భగభగలాడిపోతూ వాళ్ల దగ్గరికి వెళ్ళాడు మెహనరావు.

"హాయ్ బాస్! ఇంతాలీసెం చేశావేంటి? చాలా చాలా మిస్సయిపోయావ్" అన్నాడు పరాంకుశం అని పిలవబడే పరాన్నభుక్కు.

"ఏం మిస్సయ్యానేమిటి? " అంటూ బల వంతపు నవ్వు ముఖాన పులుముకుని కూల బడ్డాడు మోహనరావు.

"సార్ భలే జోకులేస్తార్లే. మనం ఇన్నాళ్ళూ ఆయన వెరీ స్ట్రిక్ట్ అండ్ ఎఫిషి యెంట్ ఆఫీసరని మాత్రమే అనుకుం టున్నాం. ఆయన మాంచి హాస్యప్రియు డోయ్! అబ్బ! ఇందాకట్నించీ జోకులదరగొ





ట్టేశారనుకో' అని ఏదో గుర్తుచేసుకుంటున్న ట్టభినయించి పొట్టపట్టుకు నవ్వాడు భజన పరుడు భక్తవత్సలం.

అసలు జోకేంటో తెలియకపోయినా ఈ చెవినుంచి ఆ చెవిదాకా మూతి సాగదీసి నవ్వుతూ ఆఫీసరుగారివైపు చేతులెత్తి జోహార్ చేసి మందు సేవనం ఆరంభిం చాడు మోహనరావు.

"షార్ డైరెక్టర్ షార్! మన మోహనరావు క్కూడా రుచి చూపించండి సార్... మీ జోకుల్రుచి... హాయ్‌బాబో... హయ్‌బాబో! హేవి షెన్సాఫ్ హ్యూమర్ షార్" అని గుండెలు బాదుకుంటూ సోడా కుయ్‌మ న్నట్టు నవ్వుతున్నాడు, కొత్తగా ట్రాన్స్‌ఫరయి వచ్చి ఈ మందు మందలో ఇట్టే కలిసిపో యిన నాగరాజు. నిజానికి అతనికి మాట ముద్దగా అయిపోయి వొళ్ళెరగనంత మత్తు రాలేదు. కానీ తను చూసే సినిమాలన్నిటి లోనూ తన అభిమాన నటులందరూ తాగుడు సీన్లో అలా మాట్లాడతారు కాబట్టి తనూ అలా మాట్లాడాలనుకుంటున్నాడత గాడు.

ఆ ముగ్గురు ఉన్నతాధికారులూ కుర్చీల్లో కుదురుగా ఠీవిగా కూర్చుని ఈ చిరుద్యోగుల మూకకేసి జాలిగా, కరుణరసమొలికించే దృక్కులతో చూస్తున్నారు. వాళ్ళకి తెలుసు సీసాలో సారాకంటే వాళ్ళందరికీ తమతో సమానంగా కూచోగలగటమే ఎక్కువ మత్తు కలిగిస్తోందని.

"మన మోహనరావు మనం మూడో రౌండ్లో ఉండగా మనతో చేరాడు. మనం ఇంకా మూడోరౌండ్లోనే ఉన్నాం. అతను మాత్రం ఆల్‌రెడీ అయిదో రౌండ్లోకెళ్ళిపో యాడు" అన్నాడు 'డైరెక్టర్ సార్'

జనాలందరూ ఘొల్లుఘొల్లున నవ్వారు అదేదో ఎప్పుడూ వినని గొప్ప జోకైనట్టు. నాగరాజైతే తొడ చరుచుకుంటూ తల విదిల్చి స్పెషల్ ఎఫెక్ట్స్ కూడా ప్రదర్శిం చాడు.

"ఇంతకీ నీ ఆలస్యానికి కారణం చెప్పనే లేదు" అన్నారు డైరెక్టరుగారు మోహనరా వుతో.

"ఏవుంది సార్! ఈ పిల్లలు ఉన్నవాళ్ళున్న ట్టూరుకోరుగా! మా అబ్బాయికి టెన్త్‌లో ఉండగా కైనెటిక్ హోండా కొనిచ్చా. ఇప్పుడు ఇంటర్‌లోకొచ్చాక ఛత్! కైనెటిక్ హోండా లేడీస్ వెహికిలూ, నాకు హీరో హోండా తప్ప ఇంకేం అఖ్ఖర్లేదు అంటే అదే కొనిచ్చా. ఫ్రెండ్స్‌తో పోటీలేసుకుని స్పీడుగా పోయి పోయి పడ్డాడు. దెబ్బల్తగిలాయి. పెద్దవేం కాదులెండి. వాడిని తీసుకుపోయి నర్సింగ్‌హోమ్‌లో చూపించా. ఎందుకైనా మంచిదీ ఎడ్మిట్ చేసుకుని రెండ్రోజులు మంచి ట్రీట్‌మెంట్ ఇవ్వండని చెప్పి, ఎడ్మిట్ చేసి ఇటొచ్చా. వాళ్ళేమో ఎడ్మిషన్ అక్కర్లేదు సార్ మరేం పర్లేదు ఇంటికి తీసుకెళ్ళి పోండన్నారనుకోండి. అయినా నాలుగు డబ్బులు ఖర్చయినాసరే వాడికి ట్రీట్‌మెంటు పక్కాగా జరగాలి దెబ్బలు క్లీన్‌గా మానిపోవాలి అన్చెప్పి నర్సింగ్‌హో మ్‌లో జాయిన్ చేసి వచ్చేసరికి లేటయింది. డబ్బుదేముంది ఆరోగ్యం ముఖ్యంకదా" అంటూ ఏకబిగిని అలవాటుప్రకారం అబద్ధా లల్లి చెప్పేసి తన కల్పనా చాతుర్యానికి తనే మురిసిపోయాడు మోహనరావు.

'హోర్నీ! ఏం లెవెల్ కొడ్తున్నావురా' అను కున్నాడు డైరెక్టరుగారు.

"ఏ నర్సింగ్‌హోమ్‌లో పెట్టావోయ్?" అనడిగాడు.

నగరంలోని ప్రముఖ పంచతారా నర్సింగ్ హోమ్‌లలో ఒకదాని పేరు చెప్పేశాడు మోహనరావు.

"ఫర్వాలేదు. నాట్ బ్యాడ్. అపోలో అయితే ఇంకా బాగుండేదనుకో. అక్కడంతా మనక్కావలసినవాళ్ళే. ఇదయినా పర్లేదులే. ఏదయినా ప్రాబ్లెమ్ వస్తే చెప్పు. సార్ చేత చెప్పిద్దాం" అన్నాడు డైరెక్టరుగారు తన పక్క నున్న ఉన్నతాధికారిని చూపించి. తమకు

తమ ఆఫీసులోనే కాక పెద్దపెద్ద ఆస్పత్రు లలో కూడా ఇన్‌ఫ్లుయన్స్ ఉందన్న ఇంప్రె షన్ ఇవ్వడం వారికెంతో ఆనందాన్ని స్తుంది. ఆ పక్కన కూచున్న 'మరో ఉన్న తాధికారిగారు' గంభీరంగా తలూపారు.

ఆ ఊపుడు భావమేమిటో తెలియకపో యినా ఆయనవైపు కృతజ్ఞతగా చూసి నమ్ర తగా తన తలని ఒక పక్కగా వంచాడు మోహన్రావు.

కొంతసేపలా రకరకాలుగా అందరితోటీ ముచ్చటించి ఆ ఉన్నతాధికారులు ముగ్గురూ 'ఇక బయల్దేరతాం' అంటూ లేచి నిలబ డ్డారు. మోహనరావు ముఖంవైపు ఒకసారి పేట్రనైజింగ్‌గా చూసి, "ఆల్ రైట్ బోయ్స్! మీరు ఎంజాయ్ చేస్తుండండి. మాక్కొంచెం ఇంపార్టెంట్ వర్కుంది. వెళ్తాం" అన్నాడు డైరెక్టరుగారు.

అందరూ లేచి నిలబడి, మెలికలు తిరు గుతూ, 'తమంతటివారు మాతో ఇన్ని క్షణాలు గడపడమే పదివేలు' అని కృతజ్ఞ తలు పలికి, వంగి వంగి దణ్ణాలెట్టి వీడ్కోలు తీసుకున్నారు.

మౌనగంభీర వదనాలతో ఉన్నతాధికా రులు ముగ్గురూ నిష్క్రమించారు. 'వీరి పరి చయ భాగ్యంవల్ల మన జీవితాలు ధన్యమ య్యాయి' అన్నట్టు ముఖాలు పెట్టుకుని సంతృప్తిగా కూలబడ్డారు మోహనరావు, మిత్రులు.

పీకల్దాకా తాగి, 'స్వర్గం భూమ్మీద కాక ఇంకెక్కడో ఉందన్న వాడొట్టి చవటాయ్' అనుకుంటూ ఇల్లు చేరాడు మోహనరావు.

ఇంట్లోకి వెళ్ళగానే, డ్రాయింగ్‌రూమ్‌లో సోఫాలో ఒకమూల ముడిచిపెట్టుకుని కూచునున్న సరోజ మోహనరావు కంటబ డింది. ఒక్కసారి చిర్రెత్తుకొచ్చిందతనికి. 'ఇదొకత్తి. ఎప్పుడూ ఏదో భయపడుతు న్నట్టు బెదురు బెదురుగా కొంపలోనే పడుం టుంది. హాయిగా నలుగురు ఫ్రెండ్స్‌నేసు





కుని ఏ సినిమాకో పోకూడదా' విసుగ్గా అనుకుంటూ బెడ్‌రూమ్‌వైపు నడిచాడు.

సరోజ కూచున్న సోఫా వెనకనుంచి వెడుతూ, 'ఈ పిల్ల ఇంత రాత్రిదాకా ఏం కార్యక్రమం చూస్తోందా టీవీలో' అన్న కుతూహలంతో కొంచెం కష్టంమీద కళ్ళు ఫోకస్‌చేసి టీవీస్క్రీన్‌ని పరిశీలించాడు. బాలకార్మికుల గురించి దూరదర్శన్ వాళ్ళు ప్రసారం చేస్తున్న విషాద భరితమైన టెలీ ఫిల్మ్!

"ఓరి నాయనో! టీవీనిండా ఇన్ని ఛానె ళ్ళుంటే నీకు ఇలాంటి కడుపు దేవేసే కార్య క్రమాలు తప్ప చూడ్డానికి ఇంకేమీ దొర కలా? నువ్వీ జన్మకి బాగుపడవేబాబూ" అంటూ రెండు చేతులూ పైకెత్తి తప్పుమని ఓ నమస్కారంపెట్టి విచారంగా తల విది లుస్తూ గదిలోకెళ్ళి ధడీలని మంచంమీద పడిపోయాడు మోహనరావు.

తండ్రి ధోరణికి హడలిపోయి నిశ్శబ్దంగా టీవీ కట్టేసి తన గదిలోకి వెళ్ళిపోయింది సరోజ.

భర్త గొంతు విని బాత్‌రూమ్ తలుపు భళ్ళున తెరుచుకుని బయట కొచ్చింది లీల. చింకి చేటంత విచ్చుకుని ఆనందంతో ఉబ్బి పోతున్న భార్యముఖం చూడగానే మోహన రావుకి సంతోషం పొంగుకొచ్చింది.

"అదీ, అలా ఉండాలి. మనమేవన్నా బీద వాళ్ళమా? అసలు మనకేం తక్కువ? అన్నీ ఎక్కువే. మనం ఎప్పుడూ సంతో షంగా హైక్లాసుగా ఉండాలి" అంటూ హై లెవెల్‌లో అట్టహాసంగా నవ్వాడు.

ఆ నవ్వు విని గదిలో సరోజ దడుచుకుని మరింత ముడుచుకుని పడుకుంది.

లీలమాత్రం దడుచుకోలేదు. మంచంమ ధ్యలో మఠం వేసుక్కూచుని, "అదే, అదే నండీ నేనూ చెప్తూంట. మనం ఎంత హైక్లాసు వాళ్ళమో మా క్లబ్బుకొచ్చి నన్ను చూడండి తెలుస్తుంది. ఇవాళ మా లేడీస్ క్లబ్బుకి చీఫ్ గెస్ట్‌గా కలెక్టరుగారి భార్య వచ్చిందండీ. ఫంక్షన్ మొదలవడానికి

# రచయితలకు మనవి



* ‘చతుర’లో నవలకు వేసే చిత్రాలు, ‘చతురకతలు’, ‘చతుర ప్రపంచం’వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
* **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని ‘చతుర’కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
* **ఆవిధంగా నవలలు ‘చతుర’కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
* ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
* సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
* **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల ‘చతుర’లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**‘ఈనాడు’ కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

జూన్ చతుర నవల రాలిన మొగ్గలు ..........

సమీక్షకుని పేరు : ..........

చిరునామా : ..........

..........

..........

..........

ముందే మా క్లబ్ ప్రెసిడెంట్ నన్నావిడకి పరిచయం చేసిందండీ. నేను క్లబ్బులో వేసిన రంగుల ముగ్గులు ఆవిడెంత మెచ్చుకుందో" మబ్బుల్లో తేలిపోతున్నంత ఆనందాన్ననుభవిస్తూ చెప్పింది లీల.

క్లబ్బులో అంతమంది ఆడవాళ్ళున్నా తనూ మరో ముగ్గురు 'గుమస్తా భార్యలు' మాత్రమే నడుం విరగ్గొట్టుకుని డెకరేషనంతా ఎందుకు చెయ్యాల్సొచ్చిందో, మిగతా 'ఆఫీసర్ల భార్యలు' 'బిజినెస్ మాగ్నెట్ల భార్యలు' చీర నలక్కుండా పెత్తనాలు చెలాయిస్తూ ఫంక్షన్లో స్టార్స్‌లా ఎందుకు తిరిగారో అన్న సందేహాలు ఆ సమయంలో లీలకి రాలేదు. కలెక్టరుగారి పెళ్ళాం తన ముగ్గుల్నే పొగిడింది అన్న ఆలోచన మోహనరావు తాగిన ఆల్కహాల్‌కన్నా ఎక్కువగా మత్తెక్కిస్తోంది లీలకి.

అటు లీల, ఇటు మోహనరావు ఎవరి ఆనందం మత్తులో వాళ్ళు మునిగి నిద్రపోయారు.

సరోజకి మాత్రం నిద్రపట్టలేదు. కడుపులో ఆకలిగా ఉంది. చప్పుడు చెయ్యకుండా వెళ్ళి ఫ్రిజ్ తెరిచింది. సాయంత్రం ఎవరో మోహనరావు కోసం వచ్చి స్వీట్ ప్యాకెట్ ఇచ్చి వెళ్ళారు. దాన్ని సరోజే ఫ్రిజ్‌లో పెట్టింది. దాన్ని తీసి మూత తెరిచింది సగం ఖాళీగా ఉంది. పనిమనిషి ఆరగించి ఉంటుంది. నిట్టూరుస్తూ మిగిలిన వాటిలోంచి ఓ ముక్క తీసుకుని నోట్లో వేసుకుంది. కాసిని మంచినీళ్ళు తాగి పడుకుంది.

కళ్ళు మూసుకుంటే చాలు రాజీవ్ ముఖం కనిపిస్తోంది. 'వాడెందుకలా చేశాడు?' అనుకుంది. అనుకున్న వెంటనే నవ్వొచ్చింది. ఎందుకు చేశాడో తనకి తెలుసు. తల్లీతండ్రీ ఉన్న అనాథలు తనూ తన తమ్ముడు. బతుకంటే తనకీ ఏనాడో విరక్తి కలిగింది. చచ్చిపోవాలని ఎన్నిసార్లో అనిపించింది. దానిక్కూడా ధైర్యం చాల్లేదు తనకి.

'వాడాస్లీపింగ్ పిల్స్ ఎక్కడ సంపాదించుంటాడూ?' ఆలోచిస్తుంటే అసలు చచ్చిపోవాల్సిన అవసరం తనకున్నంతగా రాజీవ్‌కి లేదనిపించింది.

'వాడికి చక్కగా వాడంటే అభిమానం చూపించే ఫ్రెండ్సున్నారు. ముఖ్యంగా ఆ సన్నటి అబ్బాయి... అతని పేరేదో తమాషాగా ఉంటుంది. ఆ... ఉత్పల్. అతను రాజీవ్‌కోసం ప్రాణం ఇచ్చెయ్యడానికి కూడా రెడీగా ఉన్నట్టుంటాడు. ఇంట్లో దొరకని ప్రేమ వాడికి బయట దొరుకుతుంది. మరెందుకు వాడంత అఘాయిత్యం చేశాడు?'

తమ్ముడిమీద ఆలోచనలు కందిరీగల్లా ముసురుకుని సరోజని నిద్రకు దూరం చేశాయి. ఈమధ్య కొన్ని రోజులుగా ఉత్పల్ తమ ఇంటికి రావడం లేదన్న విషయం గుర్తొచ్చింది సరోజకి. ఇన్నాళ్ళూ తనావిషయం అంతగా పట్టించుకోలేదు. 'వాళ్ళిద్దరి మధ్యా ఏదయినా తగాదా వచ్చిందా?' అనుకుంది. 'బహుశా అదే అయ్యుంటుంది. అంత మంచి స్నేహితుడితో తగువుపడి ఒకరితో ఒకరు మాటాడుకోని పరిస్థితి వస్తే నిజంగా అది దుర్భరం. రాజీవ్‌కి ఆత్మహత్య చేసుకోవాలనిపించిందంటే ఆశ్చర్యంలేదు'

సరోజ కళ్ళల్లో నీళ్ళు నిండాయి. స్వంత వాళ్ళు ఇంతమందిమి తాముండీ, ఒక స్నేహితుడితో దెబ్బలాట వచ్చినందుకే ఆత్మహత్యా ప్రయత్నం చేశాడంటే బయటివాళ్ళకు బహుశా చాలా హాస్యాస్పదంగా కనిపిస్తుందేమో.

కానీ తమ ఇంటి పరిస్థితి ఇతరులకేం అర్థమవుతుంది? అవడానికి తమదీ ఒక కుటుంబం. అయితే ఏం లాభం? అమ్మతో సహా ఉన్న నలుగురూ ఎవరికివారే యమునా తీరే లాగా బతుకుతున్నారు. సరోజ ఆలోచనలు తనమీదికే మళ్ళాయి. అమ్మా నాన్నా సంగతి ఎలా ఉన్నా తనూ తమ్ముడూ ఒకరికొకరు ఎందుకు చేరువకాలేదు

కపోయారు? తమ్ముడిమీద తనకున్న ఆపే క్షని వ్యక్తం చేసి తమిద్దరి మధ్య బంధం గట్టిపడేలా తనూ ప్రయత్నం చేయలేదు.

సరోజకి తనమీద తనకే జాలికలిగింది. 'హుం ఏనాడైనా ఒకరి ఆపేక్షని పొంది ఉంటే అప్పుడు నాకూ తెలిసేది మరొకరి మీద ప్రేమ చూపించడం' అనుకుంది. 'మాకున్నలాంటి అమ్మా నాన్నలు ఇంకెవరి కైనా ఉంటారా?' అన్న సందేహం కలి గింది. ఆలోచనల్తో సతమతమవుతూనే తనకి తెలియకుండా ఎప్పుడో తెల్లవారు జామున నిద్రపోయింది సరోజ.

★ ★ ★

పొద్దున్న ముసలయ్య టిఫిను తయారు చేసి బాక్స్‌లో సర్ది రాజీవ్ దగ్గరకు బయల్దే రుతుంటే సరోజ కూడా బయల్దేరింది.

"నేనూ వస్తా ముసలయ్యా! ఆటోలో పోదాం పద" అంటున్న సరోజకేసి కొంచెం ఆశ్చర్యంగా చూశాడు అప్పుడే నిద్రలేచిన మోహనరావు.

ఎవరి స్వార్థం వారు చూసుకోవడం అత నికి సహజంగా కనిపిస్తుంది. ఇంకొకరిపట్ల శ్రద్ధ చూపించడం ప్రకృతి విరుద్ధంగా తలు స్తాడతను.

"ఆటోలో పోతారా? డబ్బుందా?" అంటూ రెండు వందనోట్లు తీసిచ్చాడు. మౌనంగా అందుకుంది సరోజ. ఆ రోజుకి కుటుంబంపట్ల తన బాధ్యత విజయవం తంగా నిర్వహించేశానని తృప్తిపడ్డాడు మోహనరావు.

ముసలయ్య వెనకే బెదురుచూపులతో గదిలోకి వస్తున్న సరోజని చూసి ఆశ్చర్యపో యాడు రాజీవ్. చాలా ఆనందించాడు కూడా.

"నేను సాయంత్రందాకా ఇక్కడే రాజీవ్‌కి తోడుగా ఉంటాను. లంచ్ తెచ్చేటప్పుడు నాక్కూడా తెచ్చెయ్ ముసలయ్యా" అంది సరోజ కుర్చీలో కూచుంటూ.





సాయంత్రందాకా సరోజ అక్కడే ఉన్నా వాళ్లిద్దరి మధ్యా సంభాషణేదీ పెద్దగా నడ వలేదు. 'నీ కోసం నేనెంతో బాధపడ్డానురా. నువ్వు బతికి బయటపడ్డందుకు సంతోషిస్తు న్నాను' అని రాజీవ్‌తో నాలుగు మాటలు చెప్పలేకపోయింది సరోజ.

'అమ్మా నాన్నా నన్నిలా ఆస్పత్రిలో పడేసి వొదిలేసినా నువ్వు నాకు తోడుగా ఉండా లని వచ్చినందుకు నాకు చాలా బాగుంది' అని సరోజతో రెండు మాటలు చెప్పలేకపో యాడు రాజీవ్.

వాళ్ళకి ఊహ తెలిశాక వాళ్ళతో ఎవరూ మనసు విప్పి మాట్లాడలేదు. అందుకే వాళ్లకీ ఎవరితోనూ మనసులో మాట చెప్పు కోవడం రాదు.

సాయంత్రం అయిదుగంటలవేళ సరోజ ఇంక ఇంటికి వెడదామా అనుకుంటుంటే ఒక నర్సు రూమ్‌లోకి తొంగిచూసి, "సరో జంటే నువ్వేనామ్మా? మీ నాన్నగారట ఫోన్ చేశారు. వెళ్లి మాట్లాడు" అని రిసె ప్షన్ డెస్క్ దగ్గరి ఫోన్ చూపించింది.

జంకుతూ ఫోన్ చేతిలోకి తీసుకుని "హలో" అన్న సరోజకి అవతలినుంచి మోహనరావు గొంతు వినిపించింది. "సరోజా! ఎలాగూ ఇంతసేపూ అక్కడ ఉన్నావు కాబట్టి ఇంకాసేపు అక్కడే ఉండు. డాక్టర్ మనస్వి అనీ రాజీవ్ కేసు చూస్తున్న సైకియాట్రిస్టు ఇంకో గంటకో అరగంటకో అక్కడికి వస్తాడు. ఆయనేదో మనవాడి విషయం మాట్లాడాలన్నాడు. నువ్వు మాట్లా డెయ్. రామారావు అంకుల్ని రాజీవ్‌నెప్పుడు డిశ్చార్జ్ చేస్తారో అడుగు. డాక్టరుగారితో మాటాడేశాక అక్కడే ఉండు. నేను క్లబ్బు నుంచి ఇంటికెళ్ళేటప్పుడు నిన్ను పికప్ చేసు కుంటాను" అని చెప్పి సరోజ జవాబుకోసం ఎదురుచూడకుండా ఫోన్ పెట్టేశాడు మోహ నరావు.

డాక్టరుగారితో మాట్లాడాల్సిన బాధ్యత తండ్రి తనమీద పెట్టేసరికి కంగారుపడిపో యింది సరోజ. 'ఒక్కరోజు తీరిక చేసుకుని

ఈ విషయంలో ఏదో చూసుకుంటే వీళ్ళకేం పోయింది? అమ్మ కూడా ఒక్కసారైనా రాజీవ్ మొహం చూడటానికి మళ్ళీ రాలేదు. పైగా ఇప్పుడేమో మొత్తం బాధ్యత నామీదకి తోసేస్తున్నారు' బాధగా అనుకుంది.

సాయంత్రం డా. మనస్వి హాస్పిటల్ లోపలికి వస్తుంటే చూసిన సరోజకు గుండె గుబగుబ లాడింది. ఆయనేం అడుగుతాడో తనేం చెప్పాలోనని ఆదుర్దా పడిపోయింది.

మనస్వి మిగతా పేషెంట్లందర్నీ చూసి పంపించాక రాజీవ్‌ని చూడ్డానికొచ్చాడు. "హలో! హౌ ఆర్ యూ? " అనగానే రాజీవ్ లేచి కూచుని బాగానే ఉన్నానన్నట్టు తలూపాడు.

బెడ్ పక్కనే ఉన్న కుర్చీలో కూచుని "నిన్న మీ పేరెంట్స్‌ని రమ్మని చెప్పాను. వస్తామన్నారు మీ ఫాదర్. వచ్చారా? " అంటూ గదంతా కలయచూసిన మనస్వికి ఒక మూల బిక్కుబిక్కుమంటూ నిలబడ్డ సరోజ కనిపించింది.

"మా అక్క" పరిచయం చేశాడు రాజీవ్. బెదురు బెదురుగా నమస్కారం చేసింది సరోజ.

"మా నాన్నగారికి ఇవాళ రావడం వీలవదుట. నన్నే మాట్లాడమన్నారు మీతో" తలొంచుకుని తప్పంతా తనదేనన్నట్టు భయపడుతూ చెప్పింది.

తన్నుకొస్తున్న విసుగునీ కోపాన్నీ కంట్రోల్ చేసుకున్నాడు మనస్వి. "నువ్వు కాసేపు బయట వెయిట్ చెయ్యమ్మా. నేను రాజీవ్‌తో మాట్లాడతాను" అన్నాడు ప్రశాంతంగా. అతని శాంతగంభీర వదనం, మృదువైన మాటలు సరోజకే కాదు రాజీవ్‌కి కూడా బెరుకుని తగ్గించి మనసుకి ఊరట కలిగించాయి. సరోజ తలుపు దగ్గరగా వేసి వెళ్ళిపోయి బయట వరండాలోని కుర్చీలో కూచుని బల్లమీద పడేసున్న పత్రికల్లో ఒకదాన్ని తీసుకుని తెరిచింది.

నేల చూపులు చూస్తూ మంచం అంచున కూచునున్నాడు రాజీవ్. "కంఫర్టబుల్‌గా కూచోవోయ్. ఇలా ఈ కుర్చీలో కూచో. లేకపోతే హాయిగా మంచంమీద రిలాక్స్‌డ్‌గా పడుకో. ఏదో లెక్కల మేస్టారెదురుగా ఉన్నట్టు అలా టెన్స్‌గా ఉండకు. రిలాక్స్" అన్నాడు మనస్వి చిన్నగా నవ్వుతూ.

రాజీవ్‌క్కూడా నవ్వొచ్చింది. నెమ్మదిగా వచ్చి మనస్వికి ఎదురుగా కుర్చీలో కూచున్నాడు.

"ఏం చదువుతున్నావు? ఇంటరా? టెన్తా? "

"ఇంటర్ ఫస్టియర్"

"ఏ కాలేజ్? "

"ఎస్. వి. ఆర్. "

"మంచి పేరున్న కాలేజ్. బాగా చెప్తారా? "

చెప్తారన్నట్టు తలూపాడు రాజీవ్.

"ఏ గ్రూప్ తీసుకున్నావ్? "

"హెచ్. ఇ. సి"

"ఈ రోజుల్లో అందరూ బై. పి. సి, ఎమ్. పి. సి. లకు ఎగబడుతుంటే నువ్వు ఈ గ్రూపెందుకు ప్రిఫర్ చేశావ్? " నవ్వుతూనే అడిగాడు మనస్వి.

"నాకు, నా ఫ్రెండ్ ఉత్పల్‌కి ఎకనామిక్స్ ఇష్టమైన సబ్జెక్ట్. అందులో రిసెర్చిచేసి అమర్త్యసేన్‌లా సామాన్య ప్రజలకి ఉపయోగపడే సిద్ధాంతాలు తయారుచేద్దాం అంటుంటాడు ఉత్పల్" తలవంచుకుని మొహమాటపడ్తూ చెప్పాడు రాజీవ్. అంతేకాదు అంత పెద్ద పెద్ద ఆశయాలు మనసులో పెంచుకోవడం ఏదైనా నేరమేమో అని జంకుతున్న వాడిలా బెదురుచూపులు చూశాడు.

"వెరీగుడ్. జీవితానికి ఒక ధ్యేయం ఉండడం చాలా ముఖ్యం. నీ ఆశయం చాలా బాగుంది" మెచ్చుకున్నాడు మనస్వి.

రాజీవ్ ముఖం ఒక్కసారి వికసించింది. ఆనందంగా, సిగ్గు సిగ్గుగా తలెత్తి డాక్టరుగారి ముఖంలోకి చూశాడు. మనస్వి మెచ్చు



కోలు మాటలవల్ల సంతోషంతోపాటు అతను తనని పరిహసించట్లేదుకదా అన్న సందేహం కూడా మనసులో ఓ మూల తలె త్తింది. పరిహాసపు ఛాయలకోసం మనస్వి ముఖంలో వెతికాడు.

ఆయన ముఖం స్వచ్ఛంగా, ఆదరంగా, ప్రోత్సాహకరమైన చిరునవ్వుతో ఆహ్లాదంగా ఉంది. వేళాకోళం చేసి ఆనందిద్దామన్న సూచనలేవీ కనపడలేదు. నిశ్చింతగా ఓ నిట్టూర్పు విడిచాడు రాజీవ్.

"నీకంత ఇష్టమైన సబ్జెక్ట్ ఎనకమిక్స్ బాగా చెప్పే లెక్చరర్లున్నారా మీకు? "

"ఆ మాసార్ బాగా చెప్తారు" ఉత్సాహంగా చెప్పాడు.

"ఆ సారంటే నీకు బాగా ఇష్టమా? "

"ఊఁ... మా అందరితోనూ ఫ్రెండ్లీగా ఉంటారాయన. మాకందరికీ ఆయనంటే ఎంత ఇష్టమో అంత గౌరవం కూడా"

రాజీవ్ బాగా రిలాక్సయి మాట్లాడే మూడ్‌లోకి వచ్చాడని గ్రహించాడు మనస్వి.

"ఇంట్లో కూడా మీ పేరెంట్సూ మీరూ అందరూ ఫ్రెండ్లీగా వుంటారా? "

రాజీవ్ ముఖంమీద నీలినీడలు ముసిరాయి. తలవంచుకుని "ఊఁహూఁ" అన్నాడు మెల్లిగా.

"ఇంట్లో ఎవరెవరుంటారు? "

"నేనూ, అక్కా, అమ్మ, నాన్నగారు"

"మీ తాతగారు, బామ్మగారులాంటి పెద్ద వాళ్ళెవరూ ఉండరా? "

"నాన్నగారి పేరెంట్సిద్దరూ పోయారు. అమ్మమ్మ, తాతగారు ఏలూరు దగ్గర పల్లెటూళ్లో ఉంటారు"

"మీ నాన్నగారు ఏం చేస్తారు? "

చెప్పాడు.

"నువ్వూ మీ నాన్నగారూ సరదాగా కబుర్లు చెప్పుకుంటారా? క్లోజ్‌గా ఉంటారా? "

ఈ ప్రశ్న చాలా వింతగా అనిపించింది రాజీవ్‌కి.

ఒక్క ఉత్పల్ కుటుంబంలో తప్ప తండ్రీ కొడుకుల మధ్య అలాంటి సఖ్యత తను చూడలేదు.

"ఊఁహూఁ" అంటూ తల విదిల్చాడు.

"మీ తాతగారంటే నీ కిష్టమేనా? "

ఏం మాట్లాడలేదు రాజీవ్. కాలేజీ కబుర్లు చెప్పినప్పుడున్న ఉత్సాహం ఇంటి విషయాలడుగుతుంటే మాయమయిపోయింది.

"మీ అమ్మగారి దగ్గర చనువుందా నీకు? "

లేదన్నట్టు తలూపాడు రాజీవ్. ఇంకేమన్నా చెప్తాడేమోనని ఎగురుచూశాడు మనస్వి. రాజీవ్ తలవంచుకుని అలా కూచున్నాడేగానీ నోరు విప్పలేదు.

"మీ అక్కా, నువ్వూ ఇష్టంగా ఉంటారా? "

"అక్కంటే ఇష్టమే. అక్క క్కూడా నేనంటే ఇష్టమేగానీ ఎక్కువ మాట్లాడుకోం" ఇంక ఇంటి విషయాలు అడగడం మానేస్తే బావుణ్ణు అనుకున్నాడు రాజీవ్.

"ఆల్ రైట్. బాగా అలిసిపోయినట్టున్నావ్. రెస్ట్ తీసుకో. ముసలయ్య ఇంకా డిన్నర్ పట్టుకురాలేదా? రాంగానే శుభ్రంగా తినేసి హాయిగా పడుకో. గుడ్‌నైట్" అంటూ లేచాడు మనస్వి.

"గుడ్‌నైట్ సర్" గౌరవంగా లేచి నిలబడ్డాడు రాజీవ్.

ఆ తర్వాత మనస్వి సరోజని కన్‌సల్టింగ్ రూమ్‌కి పిలిచి కూచోమన్నాడు. రాజీవ్‌ని అడిగినట్టే చిన్న చిన్న ప్రశ్నలు ఇంట్లోవాళ్ళ గురించి, వాళ్ళకి ఒకరితో ఒకరికున్న సంబంధాల గురించి అడిగాడు. రాజీవ్‌లాగే సరోజ కూడా చాలా తక్కువ మాట్లాడింది. వాళ్ళ తాతగారి గురించి కొంచెం ఎక్కువ సమాచారం ఇచ్చింది. ఆయన ఆ ఊరి సర్పంచ్. ఛోటామోటా రాజకీయవేత్తల కుండే దుర్గుణాలన్నీ ఆయనకున్నాయ్. మొత్తంమీద పిల్లలిద్దరికీ తాతా అమ్మమ్మల





పట్ల అభిమానం లేదు. తల్లిదండ్రులతో చనువులేదు.

"రాజీవ్ నిద్రమాత్రలు మింగేసిన రోజున ఇంట్లో ఏమయినా గొడవ జరిగిందా?" సూటిగా అడిగాడు మనస్వి.

తలవంచుకుంది సరోజ. కొంచెం ఆలోచించుకుని నెమ్మదిగా చెప్పింది.

"మా తమ్ముడికి నీరజ్ అని ఒక ఫ్రెండున్నాడు. ఆరోజు సాయంత్రం అతనొచ్చి రాజీవ్‌ని ఎక్కడికో తీసుకెళ్ళాడు. ఎప్పుడూ అర్ధరాత్రిగ్గానీ ఇంటికిరాని మా నాన్న, అమ్మ ఆరోజెందుకోగానీ పదింటికే ఇంటికొచ్చేశారు. వచ్చాక..." చెప్పనా వద్దా అన్నట్టు ఆగింది. నెమ్మదిగా మళ్ళీ చెప్పింది.

"ఇంటికొచ్చాక నాన్న తాగుతూ కూచున్నారు. అప్పుడప్పుడు ఇంట్లో తాగుతారు. అమ్మ ఏం అనదు" మనస్వి ఏమనుకుంటాడో అన్నట్టు చూసింది. అతనేం మాట్లాడలేదు.

"రాజీవ్ పన్నెండు దాటాక ఇంటికొచ్చాడు. నాన్న కేకలేశారు. అర్ధరాత్రిదాకా తిరుగుళ్ళేంటని. వాడేం జవాబు చెప్పకుండా గదిలోకి వెళ్ళిపోతుంటే కాలరు పట్టుకుని ఇవతలకి లాగారు. 'ఏరా తాగావా?' అని అరిచి తిట్టారు.

వాడప్పుడు నిజంగానే తాగున్నాడని నాకు తరవాత తెలిసింది.

నాన్న కేకలేస్తుంటే వాడింకా గట్టిగా 'నువ్వెవడివి నన్నడగడానికి? నువ్వు ఇంట్లోనే తాగగాలేనిది నేను తాగితే తప్పా?' అంటూకేకలు పెట్టి తిరగబడ్డాడు. 'అసలు నువ్వు చేసే వెధవ పనులకి నేను తలెత్తుకోలేకపోతున్నాను' అంటూ చాలా వాగాడు. వాడసలు నాతో కూడా ఎప్పుడూ గొంతు పెంచి మాట్లాడడు. అలాంటివాడు తాగడం, నాన్నమీద తిరగబడడం..." సరోజకి దుఃఖం కమ్ముకొచ్చింది.

ఆ పిల్ల కొంచెం సర్దుకుని కన్నీళ్లు తుడుచుకున్నాక అడిగాడు మనస్వి. "తరవాతేమయింది?"

"తరవాత అమ్మొచ్చి కేకలు పెట్టి వాళ్ళిద్దర్నీ ఎవరి గదుల్లోకి వాళ్ళని పంపించింది.

ఆ మర్నాడు ఆదివారం. వాడూ నేనూ ఇంట్లోనే ఉన్నాం. అమ్మావాళ్లు భోజనానికి రాం అని చెప్పి ఎక్కడికో వెళ్ళారు. వాడు ఆలస్యంగా ఏకంగా భోజనాల టైముకి నిద్ర లేచాడు. అన్నం తిని కాసేపు టీవీ చూసి మళ్ళీవెళ్ళి పడుకుండిపోయాడు. అమ్మావాళ్ళు సాయంత్రానికి కూడా రాలేదు.

రాత్రి ఎనిమిదింటికి రాజీవ్ గదిలోంచి చాలా గట్టిగా పెక్యూలియర్ సౌండ్, గురకలాంటి సౌండ్ వినిపించింది. వెళ్ళి చూస్తే వాడు గదిలో నేలమీద పడున్నాడు. గొంతులోంచి గురక గట్టిగా వినిపిస్తోంది. నాకు చాలా భయం వేసింది. నా అదృష్టంకొద్దీ ముసలయ్య ఇంకా ఇంట్లో ఉన్నాడు. ముసలయ్యా నేనూ కలిసి వాడ్ని ఆటోలో వేసి ఇక్కడికి తీసుకొచ్చాం.

ఆ తరవాత ముసలయ్యే తంటాలుపడి నాన్న కొలీగ్స్ ఇళ్ళకి ఫోన్లు చేసి మొత్తం మీద నాన్నావాళ్ళకి మెసేజ్ పంపించగలిగాడు. నాకసలు బుర్ర పనిచేయలా. రాజీవ్‌కి ఏమవుతుందో అన్న భయంతో మనసంతా మొద్దుబారిపోయింది. నాన్నా వాళ్ళు వచ్చాక, రామారావంకుల్ వాడికి ప్రాణగండం తప్పిందని చెప్పాక నా మనసు కాస్త కుదుటపడింది. తెల్లవారుజామవుతుండగా ముసలయ్యని సాయంతీసుకుని ఇంటికెళ్ళిపోయాను. తరవాత ఇంకో గంటకో గంటన్నరకో అమ్మావాళ్ళు కూడా వచ్చేశారు" అంటూ జరిగిందంతా పూసగుచ్చినట్టు చెప్పి ముగించింది సరోజ.

"అసలు ఈ సంఘటన జరగడానికి ముందునుంచే అతని ప్రవర్తనలో ఏమైనా మార్పున్నట్టు నువ్వేమయినా గమనించావా? అంటే నా ఉద్దేశం ఉన్నట్టుండి ఒక రోజు తాగొచ్చి మీ నాన్నగారిమీద తిరగబడ్డాడంటే ఆ మార్పు ఆ ఒక్కరోజే సడన్‌గా

వచ్చినదా? లేకపోతే అంతకుముందు కనీసం ఓ పదిపదిహేను రోజులబట్టీ మామూలుకంటే విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడా? ఉదాహరణకి ప్రతి విషయానికీ చిరాకుపడడం, చిన్నచిన్న దెబ్బలాటలు పెట్టుకోడం ఇలాంటి మార్పేదయినా నువ్వు గమనించడం జరిగిందా? " అడిగాడు మనస్వి.

"చిరాకు, దెబ్బలాటలూ కాదుగానీ దాదాపు రెండు నెలలబట్టీ వాడిలో ఏదో మార్పున్నట్టు అనిపించింది నాకు. అసలు ఇంట్లో కూడా మేం ఎక్కువగా మాట్లాడుకోం. అలాంటిది ఆ కాసిని మాటలూ కూడా కరువైపోయాయి. రాత్రిదాకా ఎక్కడెక్కడో తిరిగి ఆలస్యంగా ఇంటికి రావడం, చాలాసార్లు ఆకలెయ్యట్లేదని భోజనం మానెయ్యడం, ఇలాంటివి నేను గమనించాను. ఇప్పుడనిపిస్తోంది తనలోతనే ఏదో బాధపడేవాడేమోనని. అసలారోజు నాన్నతో దెబ్బలాడిన రోజు తాగాడని ఖచ్చితంగా తెలిశాక అనిపిస్తోంది. అంతకుముందు కూడా అప్పుడప్పుడు తాగి వచ్చేవాడేమోనని"

"రాజీవ్ మాటల్లో ఉత్పల్ అనే ఫ్రెండు గురించి చెప్పాడు. నువ్వారోజు నీరజ్ వచ్చి తీసుకెళ్ళాడన్నావు. ఈ నీరజ్ ఎవరు? ఉత్పల్ లాగే క్లోజ్ ఫ్రెండా? "

"ఉత్పల్ రాజీవ్‌కి స్కూల్‌డేస్‌నుంచీ ఫ్రెండు. నీరజ్ కాలేజ్‌లో చేరాకే ఫ్రెండయ్యాడు. ఉత్పల్‌తోనే ఎక్కువ క్లోజుగా ఉంటాడు కానీ ఈమధ్య జరిగిన సంగతులన్నీ ఆలోచిస్తుంటే నాకు నిన్ననే గుర్తొచ్చింది ఈమధ్య ఉత్పల్ మా ఇంటికి రావడం తగ్గించేశాడని. రాజీవ్ కూడా ఉత్పల్ ఇంటికి వెడుతున్నాననీ అదీ ఏం చెప్పట్లేదు. స్కూటరేసుకుని నీరజ్ ఎక్కువసార్లొస్తున్నాడు. మరి ఉత్పల్‌కి వెహికిల్ లేకపోవడం వల్ల వీళ్ళే అటుపోయి ఉత్పల్‌ని కలుస్తారేమో నాకు తెలీదు. కానీ ఉత్పల్‌తో ఏమైనా మాటామాటా వచ్చి మా తమ్ముడు మనసులో బాధపడుతున్నాడేమోనని కూడా నా అనుమానం" అంది సరోజ.

"డాక్టరుగారూ! పాపం మా తమ్ముడసలు మంచివాడే. చదువులో కూడా నాకంటే చాలా బెటరు. వాడెందుకిలా అయ్యాడో? ఇన్నాళ్ళూ బాగానే ఉన్నాడు. వాడు మళ్ళీ మామూలుగా అవుతాడా? " కళ్ళలో నీళ్ళు పొంగుతుంటే అడిగింది సరోజ.

"ష్యూర్... అతను తప్పకుండా మామూలుగా అవుతాడు. అయితే అతను ప్రస్తుతం పూర్తిగా రిలాక్సయి తన ప్రోబ్లెమ్స్ డిస్కస్ చేసే స్థితిలో లేడు. ఇంకోరెండు మూడు రోజులు అబ్జర్వ్ చెయ్యాలి. ఇంటికి పంపెయ్యకుండా ఇక్కడే ఉంచుదాం. ఇప్పుడప్పుడే ఇంటికి తీసుకెళ్ళడం గురించి ఆలోచించకండి. ఎనీవే అతనిది ట్రీట్ చెయ్యలేని పెద్ద మానసిక రోగం కాదనే నా అభిప్రాయం. కొంచెం సైకోథెరపీ, అవసరమైతే మందులు ఇచ్చి జాగ్రత్తలు తీసుకుంటే చాలు. హివిల్ బికమ్ నార్మల్. డోంట్ వర్రీ" ధైర్యం చెప్పాడు మనస్వి.

మనసులో బాధంతా డాక్టరుతో చెప్పేసుకుని అతనిచ్చిన భరోసా విన్నాక గుండెల మీంచి పెద్దభారం దిగిపోయిందనిపించింది సరోజకి. తేలిక పడ్డమనసుతో హాయిగా నిట్టూర్చింది.

"నేను రామారావుగారితో చెప్తాను. రాజీవ్‌ని ఇంకా కొన్నిరోజులు ఇక్కడే ఉంచుదామని. మీ పేరెంట్స్‌ని మాత్రం కనీసం రేపైనా రమ్మని చెప్పు" అంటూ లేచాడు మనస్వి. కృతజ్ఞతనిండిన మనసుతో అతనికి నమస్కారం చేసి రాజీవ్ గదిలోకి వెళ్ళిపోయింది సరోజ.

'క్లబ్బునుంచి వెళ్ళేటప్పుడు నిన్ను పికప్ చేసుకుంటా'నని చెప్పిన మోహన్రావు ఆ రాత్రికసలు సరోజకోసం రానేలేదు.

రాజీవ్‌రూమ్‌లో ఉన్న ఎటెండెంట్స్ బెడ్ మీద పడుకుని నిద్రపోయింది సరోజ.

మర్నాడు పొద్దున టిఫిన్‌కారియర్ పట్టు




కొస్తున్న ముసలయ్య వెనకాలే నడిచొస్తున్న ఉత్పల్‌ని చూసి చాలా సంతోషించింది సరోజ. రాజీవ్ మాత్రం తప్పుచేసిన వాడిలా తలొంచుకోవడం గమనించింది.

"హాయ్ ఉత్పల్! నిన్ను చూసి చాలారోజులయింది. ఈమధ్య రావడం మానేశావేం?" అంటూ మనసారా పలకరించింది సరోజ.

"పద్దామనే అనుకున్నానక్కా. నిన్న సాయంత్రం మీ ఇంటికెళ్తే రాజీవ్ ఇక్కడున్నాడని చెప్పాడు ముసలయ్య" అని ఇంకేం మాట్లాడాలో తెలియనట్టూరుకున్నాడు ఉత్పల్.

"నువ్వు కాసేపు రాజీవ్‌తో కబుర్లు చెప్తూ కూచుంటావా? నేనింటికెళ్ళి స్నానం చేసి రాజీవ్‌కి కూడా బట్టలు తీసుకొస్తా. రాజీవ్! నువ్వూ, ఉత్పల్ టిఫిన్ పెట్టుకు తినేసెయ్యండి. పద ముసలయ్యా!" అంటూ వాళ్ళిద్దర్నీ వదిలి బయటికి నడిచింది సరోజ.

గదిలో మౌనంగా కూచున్న ఇద్దరు మిత్రులకీ ఏం మాట్లాడుకోవాలో తెలియలేదు. కాసేపు నిశ్శబ్దంగా కూచున్నాక, "ఎందుకురా ఇలాంటి పని చేశావ్?" అన్నాడు ఉత్పల్ కళ్ళల్లోకి ఉబుకొస్తున్న కన్నీళ్ళని కష్టంమీద కంట్రోల్ చేసుకుంటూ.

రాజీవ్ కళ్ళల్లోంచి బొటబొటా కన్నీళ్ళు రాలాయి. చేతుల్తో మొహం కప్పుకున్నాడు.

"పోన్లేరా అయిందేదో అయిపోయింది. ఇంకెప్పుడూ ఇలా చెయ్యకు" రాజీవ్ వీపు మీద చెయ్యేసి నిమురుతూ అతన్ని ఓదార్చాలని ప్రయత్నించాడు ఉత్పల్.

రాజీవ్ లేచి చన్నీళ్ళతో మొహం కడుక్కొచ్చి సద్దుక్కూచున్నాడు. ఉత్పల్ క్యారియర్ తెరిచి ప్లేట్లలో టిఫిన్ సద్దాడు. ఇద్దరూ నిశ్శబ్దంగా తినేశారు.

"ఆ నీరజ్‌గాడితో ఎక్కువ తిరగకురా. వాడొట్టి వెధవ. వాడికన్నీ బ్యాడ్ హేబిట్స్. అందర్నీ చెడగొడతాడు" అన్నాడు ఉత్పల్.

"కాదులే. అసలారోజు నా అంతట నేనే తాగాను. వాడు తాగించలా" అన్నాడు రాజీవ్.

"ఎందుకురా? ఎందుకసలు తాగడం?"

ఉత్పల్ ప్రశ్నకి వెంటనే జవాబు చెప్పలేదు రాజీవ్.

కాసేపు మౌనంగా కూచున్నాక, "నీకర్థంకాదులే. మానాన్న లాంటి కరప్ట్‌ఫెలో నీకు లేడు. అలాంటి తండ్రి ఉండడం నాకెంత తలవంపులుగా ఉందో నీ ఊహక్కూడా అందదు" అన్నాడు.

"ఆయన కరప్షన్ ఇవాళ కొత్తగా వచ్చింది కాదుగా. ఇవాళ ఉన్నట్టుండి సడన్‌గా తెలిసిన విషయంకాదు నువ్విలా ఎక్స్‌ట్రీమ్‌గా రియాక్టయిపోడానికి" అన్నాడు ఉత్పల్.

మళ్ళీ మౌనమే సమాధానం.

'పైకి చెప్పేది కాక వీడి మనసులో ఇంకేదో ఉంది. చెప్పట్లేదు' అనుకున్నాడు. తరవాత కాలేజీలో రాజీవ్ రానిరోజుల్లో జరిగిన విశేషాలు, పాఠాలు గురించి మాటాడి, "కాలేజ్ టైమయిపోతోంది వెడతాను. మళ్ళీ కలుస్తా" అని చెప్పి వెళ్ళిపోయాడు ఉత్పల్.



రాజీవ్ తన మనసులో ఏముందో డా. మనస్వి దగ్గర నెమ్మదినెమ్మదిగా బయటపె



ట్టాడు.

నాలుగురోజులపాటు రోజూ రాత్రి డా. మనస్వి తన మిగతా పేషెంట్లని చూడడం అయిపోయాక రాజీవ్‌తో కొంతసేపు గడిపి అతన్ని మాట్లాడించేవాడు.

తన దుఃఖాన్ని, తన సమస్యలనీ వెళ్ళబో సుకుంటుంటే కొంచెం కూడా విమర్శించ కుండా, కాస్త కూడా విసుగు చూపించకుండా సహనంతో శాంతంగా తన మాటలన్నీ విని అర్థంచేసుకునే మనస్వీమీద ఎంతో నమ్మకం ఏర్పడింది రాజీవ్‌కి. తన మనసులో తలెత్తే ప్రతీ ఆలోచనా అతనికి చెప్పి అతనితో చర్చించాలనిపించేది.

"మానాన్న లంచాలు తీసుకునే అవినీతి పరుడంటే నాకెంతో అవమానం అనిపి స్తుంది డాక్టరుగారూ! నేను ఉత్పల్ వాళ్ళిం టికి అప్పుడపుడూ వెడుతూ ఉంటాను. వాళ్లని చూస్తుంటే ఉన్నంతలో వాళ్ళు బాగానే బతుకుతున్నారనిపిస్తుంది. మరి మా నాన్నకే ఇంత డబ్బు దాహం ఎందుకో నాకర్థంకాదు. పైగా ఆయనకింకా చాలా బ్యాడ్ హాబిట్స్ ఉన్నాయి. ఉత్పల్ వాళ్ళ నాన్న ఎంతో ఆదర్శవంతంగా ఉంటూం టారు. ఆయనలా ఉండడంవల్ల వాడెంతో గర్వపడుతూంటాడు. వాడికేసి ఎవరూ వేలెత్తి చూపించరు. మా నాన్న మూలాన నేనెప్పుడూ తలదించుకు బతకాల్సిందే" అన్నాడు రాజీవ్ రెండోరోజు రాత్రి మన స్వితో మాట్లాడుతూ.

"ఎందుకలా అంటున్నావ్. నిన్ను మీ కాలేజ్‌లో మిగతా పిల్లలు ఈ విషయం ఎత్తిచూపించి ఇన్సల్ట్ చెయ్యడం, వెక్కిరిం చడం లాంటివి చేస్తుంటారా? " అడిగాడు మనస్వి.

అవునన్నట్టు తలూపాడు రాజీవ్. "అంటే ఏం చేస్తారు? ఒక ఉదాహరణ చెప్పు" అడి గాడు మనస్వి.

"అలా పాయింటెడ్‌గా మా నాన్న ప్రస్తా వన తీసుకొచ్చి వేళాకోళం చెయ్యరు. ఇండై రెక్టుగా ఏదో ఒకటి అంటుంటారు"

"ఇండైరెక్ట్‌గా అంటే? "

"నేనో కొత్త షర్ట్‌గానీ షూస్‌గానీ వేసుకె ళ్ళాననుకోండి ఇంక ఎవరో సినిమా ఏక్టర్ తోటో ఎడ్వర్‌టయిజ్‌మెంట్‌లో వాడితోటో కంపేర్ చేసి ఒకటే ఆట పట్టిస్తారు"

"చూడు రాజీవ్! ఫ్రెండ్సన్నాక వాళ్ళమధ్య వేళాకోళాలు, ప్రాక్టికల్ జోక్సూ మామూలే కదా. నిన్నొక్కడ్నే అలా చేస్తారని అనుకో వడం నీ భ్రమేమోనని ఎప్పుడైనా ఆలోచిం చావా? " మనస్వి సూచించాడు.

"కాదులెండి డాక్టరుగారూ! వాళ్ళు నన్ను మాత్రం ఆ ఉద్దేశంతోనే హేళనచేస్తారు. ఒక మామూలు ఉద్యోగికి ఇవన్నీ ఎలా వచ్చాయన్న వెటకారంతో మాట్లాడతారు. నా వెనకాల కూడా ఏవేవో చెప్పుకుని నవ్వు కుంటూంటారు నా గురించి" మొహం ఎర్రగా చేసుకుంటూ చెప్పాడు రాజీవ్.

"నీ వెనకాల నీ గురించి చెప్పుకుంటారని నీకెలా తెలుసు? వాళ్ళ మాటలు విని ఎవ రైనా నీతో చెప్పారా? "

తల అడ్డంగా ఊపాడు రాజీవ్. "ఎవరూ చెప్పలా నాకే అలా అనిపిస్తూంటుంది. చాలాసార్లు వేరే క్లాసు అబ్బాయిలు నేను అటు పక్కనుంచి వెడుతుంటే వెనకనించి నవ్వుతుంటారు. నాకు బలే ఏడుపొస్తుంది"

వాళ్ళు నీ విషయమే మాట్లాడుకుని నవ్వు తున్నారనేముంది? వాళ్ళింకేవో జోక్స్ చెప్పు కుని నవ్వుకుంటున్నారేమో" సూచించాడు మనస్వి.

"కాదులెండి. ఆ మాత్రం గ్రహించగలను. సరిగ్గా నేను అక్కడ నుంచి వెడుతున్నప్పుడే జోకులు చెప్పుకుంటున్నారంటే ఆ జోకులు నామీదే అన్నట్టే కదా!"

సంభాషణ దారి మళ్ళించడానికి ప్రయ త్నించాడు మనస్వి. "పోనీ. వాళ్ళు నవ్వు కుంటే నవ్వుకోనీ. నీ వైపునుంచి నువ్వే తప్పూ చెయ్యట్లేదన్న విషయం నీకు తెలు సుగా! నీ కాన్షన్స్ క్లియర్‌గానే ఉంది కదా.





ఇంక ఎవరేమనుకున్నా లెక్కచెయ్యాల్సిన అవసరం నీకు లేదు కదా? " అన్నాడు మనస్వి.

"నా మనసులో ఎప్పుడూ ఈ బాధ ఉంటూనే ఉంటుంది. మా నాన్న లంచాలు తీసుకోడం ఒకటే కాదుగా. తాగుతాడు. ఆ తాగుడు పార్టీలు ఒక్కోసారి ఇంట్లో కూడా జరుగుతుంటాయి. అప్పుడు మా నాన్న ఫ్రెండ్సు తాగి గొడవలు చేస్తుంటారు. మా ఇంట్లో కేకలు వీధివీధంతా వినిపిస్తాయి. మా చుట్టుపక్కల ఎవరింట్లోనూ అలా జరగదు" రాజీవ్ కళ్ళలోంచి రెండు కన్నీటి చుక్కలు రాలాయి.

మనస్వి ఏమీ మాట్లాడలేదు.

కళ్ళు తుడుచుకుని సద్దుకున్నాడు రాజీవ్. "అలాంటి పార్టీలు మా ఇంట్లో జరిగిన మర్నాడు మా ఇరుగుపొరుగు ఇళ్ళవాళ్ళు నేను బయట కనపడ్డప్పుడల్లా నావైపు అదో రకంగా చూస్తారు. మా ఎదురింట్లో రెండు పోర్షన్లుంటాయి. ఆ రెండిళ్ళలోనూ మా కాలేజీలోనే చదివే అమ్మాయిలు పుష్ప, పద్మ అని ఇద్దరుంటారు. మా క్లాసు కాదనుకోండి. వాళ్ళిద్దరూ నేను కనిపిస్తే చాలు ఏదో చెవులు కొరుక్కుంటుంటారు. ఎన్నిసార్లో అలా జరిగింది"

ఏ ప్రశ్న అడిగినా ఈ ధోరణిలోనే మాట్లాడాడు రాజీవ్. మాటలమధ్యలో అన్నాడు. "మా ఫ్రెండ్ నీరజ్ కూడా మీరన్నట్టే అంటుంటాడు. మన నాన్నలెలాంటి వాళ్ళయితే మనకేంరా! మన మానాన మనం ఎంజాయ్ చేద్దాం అంటుంటాడు. వాళ్ళ నాన్న దగ్గర బాగా డబ్బు డిమాండ్ చేస్తూంటాడు అంతకంతా ఖర్చుపెడ్తుంటాడు. నన్ను కూడా ఇంట్లోంచి బాగా డబ్బు తెమ్మంటాడు. కానీ నాకు మాత్రం..." అంటూ ఊరుకున్నాడు రాజీవ్.

"నీరజ్ కూడా నీక్లాస్‌మేటా? "

అవునన్నట్టు తలూపాడు రాజీవ్.

"ఉత్పల్‌లాగే నువ్వూ నీరజ్ కూడా క్లోజ్ ఫ్రెండ్సా? "

"అంత క్లోజ్ కాదు. ఉత్పల్ నాకు స్కూల్‌డేస్‌నుంచీ ఫ్రెండ్. నీరజ్ కాలేజ్‌లో చేరాకే ఫ్రెండయ్యాడు. అందరితోనూ సరదాగా ఉంటాడు. మా ఇద్దరికీ ఎలాగో దోస్తీ కలిసిపోయింది. వాడికి ఇంట్లో విషయాలు అంతగా పట్టవు. వాడి ఖర్చుకి సరిపడా డబ్బు ఇచ్చేస్తే చాలు. మా పేరెంట్స్ చాలా మంచివాళ్ళు అనేస్తాడు"

నీరజ్ గురించి ఇంకా ఏమైనా చెప్తాడేమోనని, స్లీపింగ్ పిల్స్ మింగేసిన రోజున ఏం జరిగిందో వివరిస్తాడేమోనని చూశాడు మనస్వి. కానీ ఆ విషయాలు మాట్లాడలేదు రాజీవ్.

"నీరజ్‌ని చూసి నువ్వు కూడా అతనిలాగా కేర్‌ఫ్రీగా ఏం పట్టించుకోకుండా ఉండడం నేర్చుకోవాలని ట్రై చెయ్యలేదా? "

మనస్వి ప్రశ్నకు కొంచెంసేపు ఆలోచించుకుంటున్నట్టు ఆగి సమాధానం చెప్పాడు రాజీవ్.

"ఒక్కోసారి ఇంటి విషయం, నాన్న విషయం అన్నీ మర్చిపోయి నీరజ్‌లా ఉండాలని ప్రయత్నిస్తాను. కానీ..." అంటూ ఆగిపోయాడు రాజీవ్.

ఏం చెపుతాడోనని ఆసక్తిగా ఎదురు చూశాడు మనస్వి. ఏమీ చెప్పకుండా మౌనంగా కూచున్నాడు రాజీవ్.

"ఎందువల్ల నీరజ్‌లా ఉండలేకపోతున్నావ్? "

మనస్వి ప్రశ్నకి జవాబు చెప్పనా వద్దా అన్నట్టు తటపటాయించాడు రాజీవ్.

"ఎందుకంటే... చెప్పానుకదా! నేను మర్చిపోదామని ప్రయత్నించినా మా నాన్న పాపాల ఫలితం నాకు గుర్తుచేసే సంఘటనలు ఎప్పుడూ జరుగుతూనే వుంటాయి. అందుకే నీరజ్‌లా ఉండలేకపోతున్నాను"

"ఎలాంటి సంఘటనలు జరుగుతుంటాయి? "

"ఎలాంటివంటే... బాలు అని మా

కాలేజ్ దగ్గరున్న కాన్వెంట్‌లో చదివే చిన్న పిల్లాడొకడున్నాడు. వాళ్ల స్కూలు పిల్లలు కొందరితో కలిసి మా కాలేజ్ గ్రౌండ్‌లో ఆడుకోవడానికి వస్తూవుంటాడు. అలా వచ్చి నప్పుడు ఒకటిరెండుసార్లు నేను కనపడేసరి కల్లా ఏమన్నాడంటే... 'మీనాన్న మూలానే మానాన్నక్కూడా తాగుడు, ఇంకా చాలా బేడ్ హాబిట్స్ అలవాటయ్యాయి. మా అమ్మ చెప్పింది' అన్నాడు. వాడు చిన్నవాడు కాబట్టి వాడి మనసులో ఉన్నదేదో నా మొహంమీదే అన్నాడు. ఇంకా ఎంతమంది మానాన్న గురించి ఇంకా ఎన్ని అనుకుంటు న్నారో. తలుచుకుంటే చాలా బాధగా ఉంటుంది"

"నీరజ్‌తో ఎవరైనా అలా మాట్లాడితే ఏం సమాధానం చెప్తాడు? "

"వాడా? వాడు అవతలి వాళ్లదే తప్ప న్నట్టు హేళనచేసి అవమానించగలడు. ఒక్కోసారి వినీవిననట్టూరుకుంటాడు. అసలు వాడు దేనికీ ఎక్కువగా రియాక్ట వడు. కోపం వచ్చినా, బాధొచ్చినా తాగి మర్చిపోవచ్చనుకుంటాడు"

రాజీవ్‌ని ఇంకా మాట్లాడించడానికి మరో ఆధారం దొరికింది మనస్వికి.

"నీరజ్ నిన్ను కూడా తాగమన్నాడా ఎప్పుడైనా? "

తలూపాడు రాజీవ్.

"తాగావా? "

బాగా ఆలోచించి చెప్పాడు రాజీవ్. "రెండుమూడు సార్లు తాగాను"

"ఇంట్లో ఎవరూ ఏమీ అనలేదా? "

"ఎవరికీ ఏమీ తెలీదుగా ఏమనడాని కైనా"

"ఒక్కసారి కూడా కనిపెట్టలేదా నువ్వు అప్పుడప్పుడు తాగి వస్తున్నట్టు? "

రాజీవ్ జవాబు చెప్పలేదు.

మనస్వి మళ్లీ అడిగాడు. "నిన్ను ఈ నర్సింగ్‌హోమ్‌లో జాయిన్ చేసే ముందు రోజు నువ్వు తాగిరావడంతోనే గొడవ జరి గిందని చెప్పిందే మీ అక్క నిజమేనా? "

అవునన్నట్టు తలూపాడు రాజీవ్.

"ఆరోజు ఎప్పుడూ తాగేకంటే ఎక్కువే తాగాను" కొంచెం ఆగి మళ్లీ కోపంగా అందు కున్నాడు. "గొడవంతా మా నాన్నే మొదలె ట్టాడు. తనేదో మహా ఆదర్శపురుషుడైనట్టూ తనకి అసలు, ఏ అలవాట్లూ లేనట్టూ. నాకు బలే కోపం వచ్చింది."

"ఆరోజు మామూలుకన్న ఎక్కువ ఎందుకు తాగావు? "

"ఆరోజు మధ్యాహ్నం క్లాసుల్లేకపోతే నేను కాలేజ్‌కి వెళ్లలేదు. నీరజ్ మా ఇంటికొచ్చి కాలేజి గ్రౌండ్‌లో క్రికెట్టాడదాం, మేచ్ వేసు కుందాం రమ్మన్నాడు. నా స్కూటరు కూడా తీసికొని వెళ్లాం. అక్కడ మా మిగతా ఫ్రెండ్సు కూడా ఉన్నారు. ఆట మొదలె డదాం అనుకుంటుండగా ఉత్పల్ వచ్చి కమల్ వాళ్ల నాన్నకి ఆరోజు ఏక్సిడెంట్ అయి పెద్దాస్పత్రిలో చేర్చారని చెప్పాడు"

"కమల్ ఎవరూ? "

"కమల్ మాకు జూనియర్. స్కూల్లో మా అందరితోటీ ఆటల్లో కలిసేవాడు. ఇప్పుడు నైన్త్ చదువుతున్నాడు"

"ఊహూ. తరవాతేమయింది? "

"కమల్ వాళ్ళ నాన్న కండిషన్ చాలా సీరియస్‌గా ఉందని వాళ్ళ చుట్టాలబ్బాయి తనతో చెప్పాడన్నాడు ఉత్పల్. నేను కమ ల్‌ని కలుసుకుని కొంచెం హెల్పేమయినా కావాలా మందులేవయినా తెచ్చిపెట్టాలా అని అడగడానికి వెడుతున్నాను. నీకు స్కూటరుంది కదా నువ్వూ రారాదా సాయంగా అన్నాడు ఉత్పల్. అక్కడే ఉండి మా మాటలు వింటున్న నీరజ్, మిగతా ఫ్రెండ్సూ మేం కూడా వస్తాంపదండి అన్నారు. అందరం కలిసి కమల్ వాళ్ళింటి కెళ్ళాం. అక్కడికెళ్ళాక..."

జరిగింది తల్చుకుంటుంటే రాజీవ్‌కి దుఃఖం ముంచుకొచ్చింది. బల్లమీదకి వాలి పోయి నిశ్శబ్దంగా రోదించాడు.





అతని దుఃఖం కొంచెం తగ్గేవరకూ ఆగి మనస్వి అడిగాడు "అప్పుడేమయింది? కమల్ తండ్రికి ఏమయింది? "

"ఆయనకేమయిందో నాకు తెలీదు. ఆ తరవాత నేను... నేను... నన్ను ఇక్కడ జాయిన్ చేశారు" అనేసి ఊరుకున్నాడు రాజీవ్.

"మీ ఫ్రెండు తండ్రికి అంత సీరియస్ ఏక్సిడెంటై ప్రమాదస్థితిలో ఉన్నారన్న బాధ కొద్దీ ఆరోజు మామూలుకన్నా ఎక్కువగా తాగావా? "

కాదన్నట్టు తలూపాడు రాజీవ్. అతనే ఏదయినా మాట్లాడతాడేమో కమల్ వాళ్ళింట్లో ఏం జరిగిందో చెప్తాడేమోనని ఓపిగ్గా ఎదురుచూశాడు మనస్వి. తలవంచుకుని కూచున్న రాజీవ్ తలెత్తలేదు, ఇంక మాట్లాడలేదు. అతను ఆ రోజు జరిగిన సంగతుల గురించి మాట్లాడడానికి ఇంకా సిద్ధంగా లేడని గ్రహించాడు. ఇంక ఆ విషయాలే గుచ్చిగుచ్చి అడిగేకొద్దీ రాజీవ్ బిగుసుకుపోయి అసలేం చెప్పకుండా నోరుమూసేసుకునే అవకాశం ఉంది. అందుకని ఇంక ఆ విషయం గురించి ఆ రోజుకి మాట్లాడకూడదని నిశ్చయించుకున్నాడు మనస్వి.

"సరేలే నీకు కమల్ ఇంట్లో ఏం జరిగిందో గుర్తుతెచ్చుకుని చెప్పాలనిలేకపోతే ఇట్సాల్‌రైట్. నీకిష్టం లేకపోతే వి విల్ డ్రాప్ ది సబ్జక్ట్. చాలా అలిసిపోయినట్టు కనిపిస్తున్నావు. ఇవాళ మీ అక్క వచ్చిందా? "

"ఒచ్చింది సార్. సాయంత్రందాకా ఇక్కడే ఉంది. రేపు బహుశా రాదేమో. కాలేజ్‌లో ఇంపార్టెంట్ క్లాసులేవో ఉన్నాయంది"

టాపిక్ మారడంతో మూడ్ కూడా మారి కాస్త ఉల్లాసంగా జవాబిచ్చాడు రాజీవ్.

"ఓకే. మళ్ళీ రేపు కలుద్దాం గుడ్‌నైట్" అంటూ లేచాడు మనస్వి. గుడ్‌నైట్ చెప్పి రూమ్‌లోకొచ్చి పడుకున్నాడు రాజీవ్.



పక్కమీద పడుకున్నాడేగానీ రాజీవ్‌కి తొందరగా నిద్రపట్టలా. ఆరోజు కమల్ వాళ్ళింట్లో జరిగినదంతా సినిమాలా కళ్ళ ముందు కదుల్తూనే ఉంది.

ఆ రోజు ఉత్పల్ వచ్చి కమల్ తండ్రి కండిషన్ సీరియస్‌గా ఉందని చెప్పాక రాజీవ్, పంకజ్, శిరీష్, చంపక్ కలిసి ఉత్పల్‌తో బయల్దేరారు. "పదండి ఏ హెల్ప్ కావాల్సొచ్చినా చేద్దాం" అంటూ. కమల్‌తో పరిచయం లేకపోయినా నీరజ్ తను కూడా వస్తానని వీళ్ళతో బయల్దేరాడు.

అంతా కలిసి కమల్ వాళ్ళింటికి వెళ్ళేసరికి అక్కడ వాళ్ళ తాతగారొకరే ఉన్నారు. "మా కమల్, వాళ్ళమ్మా ఆస్పత్రికి వెళ్ళారు బాబూ. ఇంకాసేపట్లో వచ్చేస్తారు. రండి కూచోండి" అని లోపలికి పిల్చాడు.

అందరూ ఇంటిముందున్న చిన్న వరండాలో కూచున్నారు.

"మా పక్కపోర్షన్లో ఉంటున్నాయన మాక్కాస్త హెల్పుగా ఉంటున్నాడు బాబూ. ఆయన వెళ్ళి కాసేపు మావాడి బెడ్ దగ్గర సాయంగా కూచుంటే వీళ్ళిద్దరూ వచ్చి కాస్త వంటచేసి మళ్ళీ కేరియర్ పట్టుకుని అక్కడికి వెడతారు. మూడు రోజులుగా అక్కడే పడుంటున్నారు" గద్గదమైన కంఠంతో తన ధోరణిలో ఏదేదో మాట్లాడారు కమల్ తాతగారు.

"ఇప్పుడెలా ఉందండీ ఆయనకి? ఏమన్నారు డాక్టర్లు? " కమల్ తండ్రి క్షేమసమాచారాల గురించి పిల్లలందరూ తలో ప్రశ్నా వేశారు.

"ఏమో నాయనా ఇంతవరకూ స్పృహరాలేదని చెప్పింది మా కోడలు. స్పృహలోకి వస్తేగానీ ఏ సంగతీ చెప్పలేమంటున్నారట డాక్టర్లు. పాపం కమల్‌గాడే ఇంటికి పెద్ద మగాడిలా తల్లికి సాయపడుతున్నాడు. తల్లీ కొడుకూ తిండీ నిద్రా లేకుండా ఒక్కలా పడుంటున్నారా ఆస్పత్రిలో. వాడిని ఆస్పత్రిలో పెట్టాక నేనసలు చూడనే లేదు.

నేనూ రోగిష్టిముండా వాడినే. పాపం మా కోడలు నాకే సేవ చేస్తుందా మొగుడికోసం ఆస్పత్రికీ ఇంటికీ మధ్య తిరుగుతుందా. ఆ పిల్ల నలిగిపోతోంది. నాలాంటి ముసలి పీనుగువల్ల ఎవరికీ ఏ ఉపయోగమూ లేదు" కళ్ళనీండా నీళ్ళు నింపుకుని ముసలాయన తన మనసులో గూడుకట్టుకున్న బాధనంతా పిల్లలముందు వలకబోసుకుంటుండగా వచ్చారు కమల్, అతని తల్లి.

రాజీవ్‌ని చూస్తూనే కమల్ వాళ్ళమ్మ సుశీల కోపంతో ఊగిపోయింది. "ఏం నాయనా! మీ నాన్న చేసింది చాల్లేదా? నువ్వు కూడా మమ్మల్నేం పీడిద్దామని వచ్చావు? మీ తండ్రీ కొడుకులిద్దరూ కలిసి ఇంకెన్ని కుటుంబాలు నాశనం చెయ్యదల్చుకున్నారు నాయనా? " అంటూ ఇంకా ఏదేదో తిడుతూ హిస్టీరికల్‌గా కేకలు పెట్టింది.

కమల్ అయితే రాజీవ్‌మీదపడి అందిన చోటల్లా చేతికొచ్చినట్టల్లా కొట్టాడు. బిత్తరపోయిన రాజీవ్ దెబ్బలు తప్పించుకోడానికి కూడా ప్రయత్నించలేదు. కొయ్యబారిపోయినట్టు నుంచుండిపోయాడు. మిగతా వాళ్ళందరూ కూడా ఆశ్చర్యంతో చేష్టలుడిగి చూస్తూనుంచుండిపోయారు. కాసేపయాక తేరుకుని కమల్‌ని ఇవతలకి లాగడంలో వాళ్ళ తాతగారికి సాయంచేశారు.

అందరూ కలిసి కమల్‌ని ఇవతలికి లాగి మళ్ళీ రాజీవ్‌మీదకి లంఘించకుండా గట్టిగా పట్టేసుకున్నారు. కొట్టడానికి అవకాశం లేకపోయేసరికి ఏడుపు గొంతుతో కేకలు పెట్టాడు.

"మీనాన్నే. మీనాన్నే మానాన్నకి తాగుడలవాటు చేశాడు. ఆ తాగుడు మూలానే ఏక్సిడెంటై ఆస్పత్రిలో పడ్డాడు మానాన్న. మీ నాన్నను అసలు చంపెయ్యాలి. వాడు బతికుంటే ఇంకా చాలా మందిని నాశనం చేస్తాడు. వాణ్ని చంపెయ్యాలి"

గొంతు చించుకుని కమల్ పెడ్తున్న





కేకలు అర్ధమయీ అవనట్టయి రాజీవ్ అవమానంతో కుంగిపోయాడు. నీరజ్, శిరీష్ రాజీవ్‌ని చేతులు పట్టుకుని గబగబా బయటకి తీసుకొచ్చేశారు. వాళ్ళ వెనకే మిగతా మిత్రులు కూడా వచ్చేశారు.

వీధి చివరి కూల్‌డ్రింకు షాపులో కూలబడ్డారందరూ. రాజీవ్ చేతిలో కూల్‌డ్రింక్ పెట్టి "తాగరా. కాస్త కూల్‌డౌన్ కావచ్చు" అన్నాడు ఉత్పల్. అందరూ తలో కూల్‌డ్రింకూ తెచ్చుక్కూచున్నారు.

డ్రింకు తాగుతూ కమల్ తండ్రి, అతని కుటుంబ వ్యవహారం తనకి తెలిసినంతమటుకూ చెప్పాడు శిరీష్.

కమల్ తండ్రి మంగపతి గత రెండేళ్ళుగా మోహన్రావుని పూసుకు తిరుగుతున్నాడు. అతనితోబాటు తాగుడలవాటు చేసుకుని ఆ వ్యసనంలో అందర్నీ మించిపోయాడు. జీతం, పైరాబడి కూడా తాగుడుకీ తిరుగుడుకీ ఖర్చుపెట్టేశాడు. వెనకేసిందేమీ లేదు. ఇంట్లో వాళ్ళు పస్తులున్నా పట్టించుకోడం మానేశాడు. తన తాగుడుకి సరిపడా ఉంటే చాలనుకునే స్థితికొచ్చేశాడు. ఇల్లూ, ఒళ్ళూ కూడా గుల్లచేసేసుకున్నాడు.

కమల్ తాతగారు రిటైరయి ఏణ్ణర్ధం అయింది. ముట్టవలసిన 'పెర్సెంటేజీ'లు ముట్టలేదన్న కారణంతో ఆయన పెన్షన్ పేపర్లు ఎక్కడ వేసిన గొంగళీ అక్కడే అన్నట్టు పడి ఉన్నాయి. మంగపతి తీసుకొచ్చే జీతం డబ్బులే ఇల్లునడవడానికి ఆధారం.

తాగుడు మైకంలోనే స్కూటర్ డ్రైవ్‌చేసి ఏక్సిడెంటు చేశాడు కాబట్టి అతనీ ప్రమాదం నుంచి అదృష్టవశాత్తూ బతికి బయటపడితే కాంపెన్సేషన్ రాకపోగా శిక్ష కూడా పడుతుందేమోనని సుశీలని అందరూ భయపెడుతున్నారు. ఖర్మకాలి మంగపతి ప్రాణం పోతే కుటుంబం వీధిన పడుతుంది.

శిరీష్ చెప్పిన వివరాలు విని దుఃఖంతో కుంగి పోయాడు రాజీవ్. కమల్ చెప్పినట్టు తన తండ్రివల్లనే ఇదంతా జరిగిందనుకు

న్నాడు. ఇలా ఇంకెంతమందిని తన తండ్రి నాశనం చేస్తాడో అనిపించింది. కమల్ మాటలు మాటిమాటికీ గుర్తుకొచ్చి దుఃఖం పొంగింది. చేతుల్లో ముఖం కప్పుకుని గట్టిగా ఏడ్చేశాడు రాజీవ్.

షాపులో మిగతా అందరూ రాజీవ్‌కేసి వింతగా చూడడం గమనించి రాజీవ్‌ని బయటకి తీసుకొచ్చేశారు.

"ఇలాంటి మూడ్‌లో ఒక్కడివీ స్కూటర్ డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళడం మంచిదికాదురా రాజీవ్! మా ఇంటికొచ్చి కాస్త చన్నీళ్ళతో ముఖం కడుక్కుని రిలాక్సయి వెడుదువు గాని పద" అన్నాడు నీరజ్. పంకజ్ రాజీవ్ స్కూటర్ డ్రైవ్‌చేసి నీరజ్ ఇంటి దగ్గర దింపివెళ్ళాడు.

రాజీవ్‌ని మేడమీద తన గదిలోకి తీసుకెళ్ళి కూచోబెట్టాడు నీరజ్. "నిన్ను బాధల నుంచి మరిపించి రిలాక్స్ చేసే మందు ఇదొకటే" అంటూ బాటిల్ మూతతీసి గ్లాసులో పోసి అందించాడు. తనూ ఓ గ్లాసు పుచ్చుకున్నాడు.

అక్కడ కూచుని తాగుతున్నంతసేపూ కమల్ మాటలు తల్చుకుంటూనే ఉన్నాడు రాజీవ్. మందు తలకెక్కి మత్తు ఎక్కువవుతున్నకొద్దీ రాజీవ్ మనసులో ఉన్న బాధంతా మాటల్లో బయటకొచ్చింది.

తన తండ్రంటే తనలో పెరుగుతున్న అసహ్యం నీరజ్‌కి వివరించి చెప్పాడు. తల్లిదండ్రులిద్దరూ తనని ఎంత నిర్లక్ష్యంగా చూస్తారో చెప్పాడు. వాళ్ళు తనమీద శ్రద్ధ చూపించాలని తనతో ఆపేక్షగా వ్యవహరించాలని తనకెంత తపనగా ఉంటుందో వర్ణించాడు. నీరజ్ ఓదార్పు మాటలు చెప్తూనే ఇంకా తాగించాడు. ఏవేవో ప్రశ్నలు వేసి రాజీవ్ చేత ఇంకా వాగించి ఆనందించాడు.

చాలా రాత్రయ్యాక ఇంక రాజీవ్ విషాద గాథ విసుగెత్తించింది నీరజ్‌కి. "ఇంక పద భాయ్! ఇవాళ్టికింక చాలు. నువ్విపుడు నీ స్కూటర్ డ్రైవ్ చెయ్యలేవుగానీ పద. నా బైక్‌మీద తీస్కెళ్ళి దింపుతా. నీ స్కూటరు మాయింట్లో సేఫ్‌గా ఉంటుంది. రేపొద్దు న్నొచ్చి తీసుకెళ్ళచ్చులే" అని రాజీవ్‌ని లేవదీసి తన బైక్‌మీద అతన్ని ఇంటి దగ్గర దింపి వెళ్ళాడు.

రాజీవ్ ఇంట్లో అడుగుపెట్టగానే డ్రాయింగ్ రూమ్ సోఫాలో తండ్రి కనిపించాడు. ఒక్కసారి కమల్ మాటలు చెవుల్లో రింగుమని ప్రతిధ్వనించాయి.

★ ★ ★

ఆ రోజు జరిగిన సంగతంతా రాజీవ్ నుంచి పూర్తిగా రాబట్టడానికి దాదాపు మూడు రోజులు పట్టింది మనస్వికి. రాజీవ్ చెప్పిందంతా శ్రద్ధగా విన్నాడు. అతని సమస్య అర్థంచేసుకున్నాడు.

రాజీవ్ మెంటల్ బ్రేక్‌డౌన్‌కి గురయ్యాడు. తల్లిదండ్రుల అలక్ష్యం అతనిలో అసంతృప్తిని మిగిల్చింది. జ్ఞానం తెలుస్తున్న కొద్దీ తండ్రి లంచగొండితనం, వ్యసనాలు తండ్రిపట్ల అసహ్యాన్ని రగిల్చాయి.

చిన్నచిన్న నిప్పురవ్వలు రాజుకుని పెద్ద మంటైనట్టు ఇంట్లో జరిగే ప్రతి సంఘటనా నిప్పురవ్వై అతని మనసునో అగ్నిగుండంగా మార్చింది. తండ్రిదో దారైతే, తల్లిది మరో మార్గం. హైక్లాసు స్త్రీలతో తనూ సమానమనిపించుకోవాలన్న తహతహతో ఇంటినీ, పిల్లల్నీ, సంసారాన్నీ అన్నిటినీ మరిచి ఎగబడింది.

తల్లిదండ్రుల ప్రవర్తనవల్ల అతని మనసులో రగిలిన అగ్నిమీద ఇతరుల వ్యాఖ్యానాలు ఆజ్యం పోశాయి. ఏ క్షణాన బద్దలవుతుందో తెలీని అగ్నిగుండాన్ని గుండెల్లో మోస్తూ బతుకుతున్నాడు రాజీవ్ ఇన్నాళ్ళూ.

కమల్ ఇంట్లో జరిగిన సంఘటనతో అగ్నిపర్వతం ఒక్కసారిగా బద్దలయింది. ఇంక జీవితమే వ్యర్థమన్నంతగా నిరాశా నిస్పృహల అగాధంలో పడిపోయిన రాజీవ్ ఆత్మహత్యా ప్రయత్నం చేశాడు. ఆ సమ

యంలో తనకు ఆత్మహత్య తప్ప మరో మార్గం లేదనుకున్నాడు.

సమయానికి వైద్యసహాయం అందబట్టి అతని ప్రాణం నిలిచింది. విలాసాల కేరింతలలో చిందులేస్తున్న అతని తల్లిదండ్రులకి అతని హృదయాక్రందనలేవీ వినబడలేదు. అతనిలాగే అనాధలా ఆక్రోశిస్తున్న సరోజ ఆ సమయాన తల్లిలా అతన్ని కాపాడి ప్రాణం నిలబెట్టింది.

భరించలేని ఒత్తిడికి గురైన మనసు సమతౌల్యం కోల్పోయి బ్రేక్‌డౌన్‌కి గురవడం సుశిక్షితులైన మానసిక వైద్యులందరికీ తెలిసిన విషయమే. అయితే బ్యాలెన్స్ తప్పిన మనసుని సరిచేసే వైద్యం అందుబాటులోనే ఉందన్న విషయం అటువంటి బ్రేక్‌డౌన్ వచ్చినరోగి, అతనికి సంబంధించిన వ్యక్తులు తెలుసుకోవలసిఉంది.

మనోవ్యాధికి మందులేదు అన్నది పాత కాలపు మూఢనమ్మకం. మనోవ్యాధికి వైద్యమూ ఉంది. పనిచేసే మంచి మందులూ ఉన్నాయి. ముఖ్యంగా రాజీవ్‌ని కుంగదీసిన మెంటల్ బ్రేక్‌డౌన్ షార్ట్ డ్యూరేషన్‌కి పరిమితమయింది. అంటే కొద్ది కాలంపాటు మాత్రమే వేధించే సమస్య.

విషమించిన పరిస్థితుల ప్రాబల్యానికి తట్టుకోలేక మనసు విపరీతమైన ఒత్తిడికి గురవుతుంది. ఆ సమయంలో పేషెంట్ అఘాయిత్యానికి పూనుకుంటాడు. అప్పుడు అతన్ని నిరోధించగలిగితే, ఆ విషమస్థితి దాటిపోయాక అతనికి సైకోథెరపీ ఇచ్చి, అవసరమైన మందులు వాడి రోగిని మామూలు స్థితికి తీసుకురావచ్చు అయితే ఈ మానసిక వైద్యానికి రోగి కుటుంబ సభ్యుల సహకారం ఎంతైనా అవసరం.

మోహనరావు రాజీవ్ గురించి అనుకున్నట్టుగా 'ఇవన్నీ తిన్నదరక్క, ఒళ్ళు కొవ్వెక్కి వేసే వేషాలు' అన్న అభిప్రాయంతో కుటుంబంలోనివారే ఈసడించుకుని, దండించడమే సరైన వైద్యం అనుకుంటే బ్రేక్‌డౌన్ పాలయిన వ్యక్తి ఎప్పటికీ బాగుపడకపోవచ్చు.

అతన్ని బ్రేక్‌డౌన్‌కి దారితీసిన పరిస్థితులు మళ్ళీ కలగకుండా చూసుకుంటూ డాక్టరు సలహా తు.చ. తప్పకుండా పాటిస్తే, రాజీవ్‌లాంటివాళ్ళు కోలుకుని మానసిక స్థైర్యం పొందగలుగుతారు. మెంటల్ బ్రేక్‌డౌన్ అనేది శాశ్వతంగా ఉండిపోయే జబ్బు కాదు. సైకోథెరపీ వల్ల, సరైన మందులు వాడడంవల్ల నయమవుతుంది. కాకపోతే ఇంట్లోవాళ్ళ సహకారం, సానుభూతి లేకపోతే మాత్రం మళ్ళీ మళ్ళీ బ్రేక్‌డౌన్ రావడం, ఆత్మహత్యా ప్రయత్నాల్లాంటివి చెయ్యడం జరుగుతూనే వుంటుంది.

★ ★ ★

రాజీవ్ నర్సింగ్ హోంలో చేరి నాలుగురోజులు గడిచిపోయినా మోహనరావు, లీల మళ్ళీ రాలేదు. సరోజ చెప్పగా చెప్పగా అయిదోరోజున ఎంతో అయిష్టంగా వచ్చాడు మోహనరావు.

బిక్కుబిక్కుమంటూ వస్తున్న సరోజ వెనకాల విసుగ్గా మొహం పెట్టుకుని పొగరుగా నడుచుకుంటూ మనస్వి రూంలోకి వచ్చి విష్‌చేసి కూచున్నాడు మోహనరావు.

"మీ మిసెస్ రాలేదా?" అడిగాడు మనస్వి.

లేదన్నట్టు నిర్లక్ష్యంగా తలూపాడు మోహనరావు.

"మీ ఇద్దరూ కలిసి రావాలని చెప్పాను కదా. మీ ఇద్దరితోనూ మాట్లాడితేగానీ ట్రీట్‌మెంట్ మొదలుపెట్టడం కుదరదు" మర్యాదగానే దృఢంగా చెప్పాడు మనస్వి.

సర్రున కోపం వచ్చింది మోహనరావుకి. 'ఇదేం బోడి వైద్యం! రోగిని నీ దగ్గరే పెట్టుకుని మా ఆవిడతో మాటాడితేగానీ వైద్యం చెయ్యలేనంటావ్' అని ఒంటికాలిమీద లేచి కేకలు పెట్టాలనిపించిందతనికి.

కానీ గంభీరవదనంతో ప్రశాంతంగా కూచుని నిశ్చలంగా చూస్తున్న మనస్వికేసి చూస్తే నోటమాట రాలేదు.





"కొంచెం బిజీగా ఉంది మా ఆవిడ. మా పక్కింటివాళ్ళకి కొంచెం ఏదో ఇబ్బందీ..." గొణుక్కుంటూ బుర్ర గోక్కున్నాడు. కిందటి మాటు వచ్చినపుడు ఏ కారణం చెప్పాడో చటుక్కున గుర్తుకొచ్చి చావలేదు.

"ఫర్వాలేదు, ప్రాబ్లెమ్సన్నీ పూర్తిగా సాల్వ్ అయి మీ ఆవిడకి తీరిక చిక్కాకే తీసుకు రండి. ప్రస్తుతానికి రాజీవ్ ఆరోగ్య అవసరాలు డా. రామారావ్ చాలా బాగా చూసుకుంటున్నారు. హి ఈజ్ ఇన్ గుడ్ హాండ్స్. మీరిద్దరూ సావకాశంగా రండి" చిరునవ్వుతో శాంతంగా చెప్పాడు మనస్వి.

చేసేదేమీలేక ఓ నమస్కారం పెట్టి మాడిన మొహంతో బయటపడ్డాడు మోహనరావు. అతనివెనకే సరోజ కూడా మేకపిల్లలా నడిచివెళ్ళింది.

రాజీవ్ గదిలోకి వెళ్ళారు మోహనరావు, సరోజ. చదువుతున్న వారపత్రికలోంచి కళ్ళు పైకెత్తి, మళ్ళీ పుస్తకంలో మొహం దాచేశాడు రాజీవ్. ఓ మూల కుర్చీలో కూలబడింది సరోజ.

చూపులు కూడా కలుసుకోని ఆ తండ్రీపిల్లల మధ్య మాటలు మాత్రం ఏం కలుస్తాయ్? నిశ్శబ్దం వెర్రిగంతులేసింది ఆ గదిలో.

ఓ నాలుగు నిమిషాలలా మౌనంగా గడిచాక, "నేనోసారి రామారావుని కలిసొస్తా. సరోజా నీ దగ్గర డబ్బులున్నాయా? ఎప్పుడు కావాలంటే అప్పుడు ఆటోలో ఇంటికెళ్ళగలవుగా?" అంటూ సరోజ జవాబు కోసం కూడా ఆగకుండా వెళ్లిపోయాడు మోహనరావు.

'అంటే ఆయన వెళ్ళేటప్పుడు నన్ను కూడా తీసుకెళ్ళడన్నమాట! నా మానాన నేను ఆటోలో పడిపోవాల్సిందే కాబోలు! ఎప్పుడూ ఉన్నదేగా ఇవాళ ప్రత్యేకంగా బాధపడాల్సిందేముంది?' అనుకుని ఓ నిట్టూర్పు విడిచింది సరోజ.

తన బ్యాగ్‌లోంచి టిఫిన్ బాక్స్ బైటకి తీసి, "ఒరేయ్ రాజీవ్! ఇవాళ ముసలయ్య చెప్పుంటే కాజూపకోడీ నేనే చేశాను. రుచి చూసి చెప్పు బాగున్నాయో లేవో" కాసిని పకోడీలు చిన్న ప్లేట్‌లో వేసి రాజీవ్‌కిచ్చి తనూ కొన్ని తీసుకుంది. 'వంటింటి ఖైదు నుండి విముక్తి పొందిన లీల' కూతురు సరోజ వండి, మరొకరికి పెట్టడంలో ఉన్న ఆనందం మొదటిసారి రుచి చూసింది.

ప్లేటందుకుంటూ అక్క ముఖంలోకి చిత్రంగా చూశాడు రాజీవ్. ఎప్పుడూ బితుకుబితుకు మంటూ బతుకుభయంతో ఇంట్లో నిశ్శబ్దంగా ఒక నీడలాగా తిరుగుతుండే అక్క చొరవచేసి వంటింట్లోకి వెళ్ళి తనకోసం ఏదైనా చేసి పట్టుకురావడానికి ఆమె ఎంత ధైర్యం చేసిందో, ఆ ధైర్యం కూడగట్టుకోడానికి ఆమె మానసికంగా ఎంత శ్రమించి ఉంటుందో ఊహించుకోగలడతను.

ఎదిగిన ఆడపిల్ల ఆమాత్రం వంటింటి పనులు చెయ్యడం చాలా ఇళ్ళల్లో అతి సహజమైన విషయం. కానీ సరోజ అటువంటి పనులు చెయ్యగలిగిదంటే ఆ ఇంట్లో అదొక సాహసకృత్యం.

రాజీవ్‌కి బాగా గుర్తుండిపోయిన బాల్యస్మృతుల్లో అదొకటి. ఒకరోజు ముసలయ్య చిప్స్ చెయ్యడంకోసం బంగాళాదుంపలు తరుగుతుంటే సరోజ కుతూహలంగా అతని దగ్గర చేరింది. సన్నటి చిప్స్ అతను యంత్రంలా తరుగుతుంటే, నేనూ తరుగుతానంటూ ఉత్సాహంగా అతని చేతుల్లోంచి చిప్స్ తరిగే రేకుని తీసుకుని తరగడానికి ప్రయత్నించింది.

ఆ దృశ్యం లీల కంటపడింది. అంతే... లీలకి ఎక్కడలేని హిస్టీరియా వచ్చేసింది.

"ఛీ... ఛీ... పనివాళ్ళతో చేరి లోక్లాసు పనులు తప్ప మరో కాలక్షేపం లేదేవిటే నీకు? నీకంతగా తోచకపోతే ఆ జడ్జీగారమ్మాయిలాగా బ్రేక్‌డాన్స్ క్లాసుల్లో చేరు. అంతేగానీ ఇలాంటి పనులు చేస్తూ మళ్ళీ

నా కంటపడ్డావా కాళ్ళిరగ్గొడతా. అసల్నీవన్నీ లోక్లాసు పనులే. నూనె జిడ్డోడుకుంటూ తోకల్లాగా ఇంతింత జడలల్లుకుంటూ, కూలీ వాడి కూతుర్లాగా తిరుగుతావెందుకు? నీ తోటిపిల్లల్ని చూడు బ్యూటీ పార్లర్లకెళ్ళి ఎన్ని రకాల హెయిర్ స్టైల్సు చేసుకుంటారో. నిన్ను వొదిలే కొద్దీ అన్నీ ముసలమ్మ బుద్ధులు నేర్చుకుంటున్నావు. పద, నాతో పాటు నిన్నూ బ్యూటీపార్లర్‌కి తీసుకెడ తాను. లేకపోతే నువ్వసలు బాగుపడవు" అని పెద్దగొడవ చేసేసి అప్పటికప్పుడు సరో జని బ్యూటీపార్లర్‌కి ఈడ్చుకుపోయింది.

'కొందరు 'హైక్లాసు'వాళ్ళు 'వంట', 'ఇంటి అలంకరణ'లాంటి విషయాలను హాబీలుగా నేర్చుకుంటారని, అవి నేర్చుకోడంకోసం బోలెడు డబ్బు ఖర్చుపెట్టి క్లాసులక్కూడా ఎటెండవుతారనీ తెలుసుకునేటంత పరి జ్ఞానం ఆవిడకి లేదు పాపం!

ఆ దెబ్బతో అసలే ముభావంగా ఉండే సరోజ ఇంకా మూగదైపోయింది. తన కుతూహలాలూ, ఆసక్తులూ, అభిరుచులూ అన్నీ తనలోనే మగ్గబెట్టేసుకుంది. ఏం మాట్లాడితే తల్లితో ఏ గొడవొస్తుందో అన్న భయంతో ఇంట్లో ఉందా లేదా అన్నట్టు బతకడం అలవాటు చేసేసుకుంది.

అలాంటి సరోజ ఇవాళ తనకోసం టిఫిన్ తయారుచేసుకొచ్చిందంటే ఈ అక్క కొత్త అక్క. తమ్ముడిపట్ల ఆపేక్ష హృదయంలో కొత్తగా నిద్రలేచి ఆమెచేత ఈ చిన్నిసా హసం చేయించింది.

"ఒరేయ్! ఈ టైమ్‌కి టీవీలో ఒక మంచి ప్రోగ్రాం వస్తుంది. కామన్‌హాల్‌కి వెళ్ళివ ద్దామా?" అడిగింది 'కొత్త అక్క'

రూమ్‌తలుపు దగ్గరగా వేసి ఇద్దరూ కామన్‌హాల్‌వైపు నడిచారు.

నర్సింగ్‌హోమ్‌లో చేరాక తన గది, డా. మనస్వి గదివైపు వెళ్ళే కారిడార్, ఆయన గది తప్ప ఆ నర్సింగ్‌హోమ్‌లో ఇంకేమీ చూడలేదు రాజీవ్. చుట్టూ కుతూహలంగా చూస్తూ, అక్క వెనకే నడిచి కామన్‌హాల్లోకి వెళ్ళి కూచున్నాడు. "నీ రూమ్‌కి అవతలి రూమ్‌లో ఒక చిన్న అమ్మాయి చేరింది. పాపం! ఆ అమ్మాయికి రేపు ఆపరేషనట. పిల్లల డాక్టర్లొచ్చి చేస్తార్ట" అంటూ రాజీవ్ పక్కన కూచుని ఆ పిల్లకి వచ్చిన జబ్బు గురించి చెప్పింది సరోజ.

రాజీవ్‌కిది కొత్త అనుభవం! తమ్ముడితో కూడా పిరికిపిరికిగా ఉండే సరోజ ఇన్నిమా టలు మాట్లాడడం, ఆస్పత్రిలో ఇంత ఫ్రీగా తిరుగుతూ మిగతావాళ్ళతో పరిచయాలు చేసుకోడం ఇదంతా చూస్తుంటే, అనకూడదు గానీ తను చేసిన ఆత్మహత్యా ప్రయత్నం వల్లనే ఈ మార్పు కలిగిందా అనిపిస్తోంది. 'ఈ సంఘటన అక్కనీ, నన్నూ దగ్గర చేసింది. అలాగే అమ్మానాన్నల్లో కూడా మార్పొస్తే బాగుండును' అనుకున్నాడు.

★ ★ ★

'రామారావు లేకపోతే బాగుండును' అను కుంటూ అతని రూమ్‌వైపు నడుస్తున్న మోహనరావుకి వెనకనుంచి రామారావు పిలుపు వినిపించింది. "హలో... ఇటురా ఇక్కడ కూచుందాం" అంటూ ఓ గదిలోకి దారితీశాడు రామారావు. అతని వెనకే ఆ గదిలోకి వెళ్ళి బల్లదగ్గర కుర్చీలో కూచు న్నాడు మోహనరావు. "మనస్విని మీట య్యావా? ఏవన్నాడు? ఎలా ఉన్నాడు రాజీవ్?" సొరుగు తెరిచి ఫైల్స్ కొన్ని బయటకి తీస్తూ అడిగాడు రామారావు.

గోడవారన పెట్టి ఉన్న ఏవేవో ఎక్విప్ మెంటు వైపు కుతూహలంగా చూస్తున్న మోహనరావుకి రామారావు కాస్త ఫ్రెండ్లీ మూడ్‌లో ఉన్నట్టనిపించింది. ఇదే అదను వీడి నెత్తినెక్కి రాజీవ్‌ని 'విడుదల' చేయిం చుకుని ఇంక ఈ డాక్టర్ల 'దాక్షిణ్యం'నుంచి తప్పించుకోవాలనుకున్నాడు.

"ఆయనేవిట్రా బాబూ! ఎప్పుడొచ్చినా మీ ఇంట్లోవాళ్ళందరూ కలిసిరండి అందరితోటీ మాటాడాలంటాడు. మాకు టైముండొద్దూ?




అయినా పేషెంటు నెదురుగుండా పెట్టుకుని మమ్మల్నిరమ్మని బుర్ర తినేస్తే ఎలా?" అన్నాడు.

రామారావుకి ఒళ్ళు మండిపోయింది. కోపం, ఇరిటేషన్ కంట్రోల్ చేసుకునే ప్రయత్నంలో కబ్బోర్డ్ తలుపు తెరిచి అటుతిరిగి ఏదో వెదుకుతున్నట్లు నుంచున్నాడు. చాలా మంది పేషెంట్లలోను, వాళ్ళ తాలూకువాళ్ళ లోను 'డాక్టర్లకేకాదు మాకూ కొంత తెలుసు' అన్న అహం ఉంటుందని రామారావుకి తెలుసు. డాక్టర్లు పేషెంట్ మంచికోసం కాక తమ గొప్ప చూపించుకోడానికి ఏదేదో అధికారం చలాయిస్తూ ఉంటారన్న అపోహ వాళ్ళల్లో ఉంటుంది. వ్యాపార దృష్టితో వైద్య వృత్తి చేసే డాక్టర్ల సంగతి ఏమోగానీ డాక్ట ర్లందరిపట్లా ఈ అపోహ ఉండడం సమంజసం కాదు. ఇటువంటి అపోహకు మూర్ఖత్వం తోడైతే మోహనరావులాగే మాట్లాడతారు.

మోహనరావులాగా మాట తూలే వ్యక్తులతో కొందరు డాక్టర్లు సహనం కోల్పోయి వాళ్ళమీద కోపంగా కేకలు వేయడం రామారావుకి తెలుసు. ఇతరులముందు కోపం ప్రదర్శించడం, పరుషంగా మాట్లాడడం రామారావుకి ఇష్టం ఉండదు.

కాస్త కోపం అదుపు చేసుకున్నాక కుర్చీలో కూచుని "ఊరికే అర్థం లేకుండా మాట్లాడకు మోహన్. నీకు మనస్వి వైద్యం అనవసరం అనిపిస్తే రాజీవ్‌ని ఇక్కడుంచాల్సిన అగత్యం లేదు. కానీ ఒక్కటి మాత్రం గుర్తు పెట్టుకో. ఈ నాలుగైదు రోజుల్లోనే రాజీవ్‌లో చాలా మార్పు కనిపిస్తోంది. మందులు వాడకుండానే మనస్వి ఇస్తున్న సైకోథెరపీవల్లే ఆ మార్పు సాధ్యపడింది. ఇంక నేనేం చెప్పదలచుకోలేదు. టేక్ యువర్ ఓన్ డెసిషన్" అనేసి ఫైల్లోకి చూస్తూ కూచున్నాడు రామారావు.

తను అనవసరంగా నోరు పారేసుకున్నా నన్న విషయం ఆలస్యంగా గ్రహించాడు మోహనరావు. ఆలోచిస్తే రామారావు మాటలు నిజమే అనిపించాయి. గత రెండు మూడు నెలలుగా రాజీవ్‌లో కనపడని నీట్‌నెస్ ఇవాళ కనపడింది. మొహం తేటగా ఉంది. చూపుల్లో చురుకుదనం వచ్చినట్టుగా కూడా అనిపించింది.

ఇందాక చూసిన నాలుగు నిముషాల్లోనే మోహనరావు ఇవన్నీ గ్రహించాడు. ఇంకొక్క పావుగంట అక్కడ కూచునుంటే అతనిలో కూడా మార్పొచ్చేదేమో. రాజీవ్ దురదృష్టమో, మోహనరావు దురదృష్టమో అతనికి ఆ మాత్రం పది నిమిషాలు తన పిల్లలతో గడపాలని ఎప్పుడూ అనిపించ లేదు.

★ ★ ★

మెడికల్ కాలేజ్‌కి ఎటాచ్ చేయబడ్డ ఆ గవర్నమెంట్ జనరల్ హాస్పిటల్ ఆ టైమ్‌కి సాధారణంగా జనంతో కిటకిటలాడుతూ ఉంటుంది. కానీ ఆరోజు జిల్లాబంద్ జరుగుతుండడంవల్ల చుట్టుపక్కల పల్లెటూళ్ళనుంచి వచ్చే పేషెంట్లు రాలేదు. బంద్ పిలుపుని విఫలం చెయ్యాలన్న పంతంతో ప్రభుత్వం బస్సులు నడిపినా, పై ఊళ్ళవాళ్ళేకాక ఊళ్ళోవాళ్ళు కూడా ఇళ్లు కదలడానికి ధైర్యం చెయ్యడంలేదు. అందుకే హాస్పిటల్లో జనం పల్చగా ఉన్నారు.

చాలారోజుల తరవాత ఒ.పి. ఖాళీగా ఉంది. పేషెంట్ల ఒత్తిడి లేకపోవడంతో డా. మనస్వి రూమ్‌లో తీరిగ్గా కూచుని మెడికల్ జర్నల్స్ తిరగేస్తున్నాడు. అడుగుల చప్పుడు వినబడి తలెత్తిన మనస్వికి "నమస్తే సర్" అంటున్న ఉత్పల్ కనిపించాడు.

అతని వెనకే హరిశ్చంద్ర కూడా వచ్చి విష్ చేశాడు. "హల్లో రండి. కూచోండి" అన్నాడు మనస్వి.

"ఇక్కడ మెడికల్ వార్డులో నా ఫ్రెండొకాయన ఎడ్మిట్ అయ్యాడు సార్. నేనాయన్ని చూసొస్తాను. ఉత్పల్ మీతో మాట్లాడ్తానని

పట్టుపట్టాడు. ఇలా బందురోజున వాడినొక్కడ్నీ రోడ్డుమీదకి పంపడం అంత సేఫ్ కాదనిపించి, సరే మా ఫ్రెండుని చూసినట్టూ ఉంటుందని వాడిని తీసుకొచ్చాను. పది నిముషాల్లో వస్తానండి. ఉత్పల్ నువ్వేం మాట్లాడదల్చుకున్నావో డాక్టరుగారితో మాట్లాడుత్తాండు" అని చెప్పి వెళ్ళాడు హరిశ్చంద్ర.

"సార్! ఈ బంద్‌లు చేసేవాళ్ళు ఎవరండీ? నేనిదివరకేదో మేగజైన్‌లో చదివాను. చిన్నప్పుడు ఎవరూ సరిగా పట్టించుకోక, రకరకాల కష్టాలకి గురైనవాళ్ళు క్రిమినల్స్‌గానూ, టెర్రరిస్టులుగానూ తయావుర తారట. మరి అలాంటివాళ్ళకి మీలాంటి సైకియాట్రిస్టులు సైకోథెరపీ ఇచ్చి వాళ్ళ మనసు మార్చి వాళ్ళని మనందరిలాగా మామూలు మనుషులుగా చేసెయ్యచ్చుకదా సార్? "

ఉత్పల్ అమాయకపు మాటలు వింటే నవ్వొచ్చింది మనస్వికి. ఎవరైనా అంతే. ఏదైనా కొత్త విషయం తెలిస్తే దాన్ని చాలా సింపుల్‌గా ప్రతి సమస్యకీ దాన్నే పరిష్కారంగా ఊహించుకుంటుంటారు.

చిన్నగా నవ్వేసి, "అది అంత తేలిగ్గా తేలిపోయే సమస్య కాదులే. అందులో రాజకీయాలు, సాంఘిక సమస్యలు చాలా ఉంటాయి. సరే నీ సంగతి చెప్పు. ఏం మాట్లాడాలని బందురోజు కూడా పంతం పట్టి వచ్చావ్? " అన్నాడు మనస్వి.

"సార్ మా రాజీవ్‌ని మీరు ట్రీట్ చేస్తున్నార్టకదా? "

మనస్వి ఏమీ మాట్లాడలేదు. "నేను కిందటిమాటు మీ దగ్గర కొచ్చేటప్పటికే అక్కడ ప్రైవేట్ నర్సింగ్‌హోమ్‌లో రాజీవ్‌ని జాయిన్ చేశార్టకదా. మరి నేను రాజీవ్ గురించి మీతో మాట్లాడినప్పుడు వాడు మీకు తెలుసునని నాతో ఎందుకు అనలేదు సార్? " అడిగాడు ఉత్పల్.

"మేం ట్రీట్ చేస్తున్న పేషెంట్స్ గురించి ఇతరులతో మాట్లాడం. అతను తనంత తాను తన ప్రాబ్లెమ్ గురించీ వైద్యం గురించి ఎవరితోనైనా చెప్పుకుంటే అది వేరే విషయం. మేం మాత్రం పేషెంట్ల గురించి ఎవరి దగ్గరా చెప్పం. అలా అని మేం మెడికల్ డిగ్రీలు తీసుకునే సమయంలోనే ప్రమాణం చేస్తాం" అన్నాడు మనస్వి.

"డాక్టర్లందరూ ఆ ప్రమాణానికి కట్టుబడి ఉంటారా? " కుతూహలంగా అడిగాడు ఉత్పల్.

"అలా ఉంటారనే నేను విశ్వసిస్తున్నాను. సరే రాజీవ్‌ని కలుసుకున్నావా? " అడిగాడు మనస్వి.

"రెండ్రోజుల క్రితం నర్సింగ్‌హోమ్‌కి వెళ్ళి చూశాను. కానీ వాడు నాతో ఏమీ ఎక్కువగా మాట్లాడలేదు. నాకు చాలా బాధనిపించింది. ఆ బాధంతా మీతో చెప్పుకోవాలనిపించి వచ్చాను" కొంతసేపు తనకి రాజీవ్ గురించి కలిగిన భయాలు, అనుమానాలు అన్నీ చెప్పుకున్నాడు. ఆ తర్వాత ఉత్పల్ తమ ఇంటి విషయాలు కూడా కొద్దిగా చెప్పుకున్నాడు. పెద్ద సమస్యలు ఏవీ అతనికి లేకపోయినా ఎదిగీ ఎదగని వయసులో కుర్రాళ్ళందరికీ కలిగినట్లే పెద్దవాళ్ళ అధికారానికి ఎదురుతిరగాలని అప్పుడప్పుడు అనిపించడంలాంటి చిన్న చిన్న సమస్యలు మనస్వికి చెప్పుకున్నాడు. మనసులోని సందేహాలన్నీ తీర్చుకుని కొంత భారం దించుకుని తండ్రితో కలిసి వెళ్ళిపోయాడు ఉత్పల్.

★ ★ ★

"డాక్టరుగారు నిన్ను కూడా తీసుకువస్తే గానీ ట్రీట్‌మెంట్ కుదరదంటున్నాడు అని మోహనరావు చెప్పగానే ఒంటికాలిమీద లేచింది లీల.

"కుదరకపోతే మానెయ్యమనండి. శుభ్రంగా ఇంటికి తీసుకొచ్చేద్దాం. అసలేం ట్రీట్‌మెంట్ ఇస్తాడట? వాడికేం రోగమనీ? ఏదో ఓసారి నిద్రమాత్రలు మింగి




నంత మాత్రాన ఇంక వాడికేదో రోగం, మానసికవ్యాధి పట్టుకుందని గొడవ చేసేసి మన ప్రాణాల్తీసేస్తున్నారీ డాక్టర్లంతా కలిసి. మీ చుట్టం అని చెప్పి ఆ రామారావుగారి ఆస్పత్రిలో పెట్టారు. ఇంక జలగల్లా పట్టు కున్నారు వాళ్ళందరూ కలిసి. డబ్బు లాగ డానికి ప్లానులివన్నీ. వాణ్ణి తీసుకొచ్చె య్యండి. ఎన్.ఆర్.ఐ.లందరూ కలిసి పెట్టారే పెద్ద హాస్పిటల్. ఆ హాస్పిటల్లో చేర్పిద్దాం. వాళ్ళయితే డబ్బు పడేస్తే చాలు మనని వేధించకుండా వైద్యం చేసి పంపే స్తారు. ఈ చిన్న చిన్న డాక్టర్లయితే ఇంతే. రోగం ఏంటో తెలీక 'వీళ్ళతో మాట్లాడాలి వాళ్ళతో మాట్లాడాలి' అంటూ నానుస్తారు. అసలు వాడికి రోగం ఉంటేగా? ఎన్నారై డాక్టర్లయితే నిమిషాలమీద అటో ఇటో తేల్చి పారేస్తారు" ఈ ధోరణిలో సాగింది లీల వాక్ప్రవాహం.

"పోన్లేవే. ఈసారి కెళ్ళొచ్చేద్దాం. ఆ సైకి యాట్రిస్టు మాటెలాగున్నా, మనవాడు రామారావుతో గొడవెందుకులే అని చూస్తున్నా. చిన్నా, పెద్దా అవసరాలకి మన వాడన్నవాడు ఒకడు మన చేతిలో ఉండడం ఎప్పటికైనా మనకే మంచిది. అదే నేనాలో చిస్తున్నా. ఓసారి నువ్వు కూడా మాట్లాడొ చ్చాక వాళ్ళేం చెపుతారో చూద్దాం. అంతగా నచ్చకపోతే అప్పుడింక నువ్వన్నట్టే కాని ద్దాంలే" నచ్చచెప్పాడు మోహనరావు.

"ఇంకో నాలుగైదురోజుల్లో ఉమన్స్ వెల్ ఫేర్ మినిస్టర్ గారొస్తారు మా క్లబ్బుకి. మా ప్రెసిడెంటు నన్ను జాయింట్ సెక్రట రీగా చేసింది. క్లబ్బు డెకరేషన్ బాధ్యతంతా నామీద వేసిందావిడ. ఇవాళ అటొస్తే బోలెడు టైము వేస్టు. రంగు కాయితాలు, చెమ్కీలు కొనాలి. బోలెడు షాపింగు చెయ్యాలి" అని విసుక్కుంటూనే తయారై బయల్దేరింది మోహనరావు వెంట లీల.

వెడుతున్నంతసేపూ, "ఏం పిల్లలో! వాళ్ళ మానాన్న వాళ్ళు బతకరు మనని బతకని య్యరు. నీకేవమ్మా మీ పిల్లలు పెద్దవాళ్ళ య్యారు. వాళ్ళకేమన్నా అన్నాలు తినిపిం చాలా, మూతులు కడగాలా నువ్వో ఫ్రీబ ర్డ్‌వి. అంటూంటారు మా క్లబ్బులో అందరూ. ఏం ఫ్రీడమ్మో, నా బొంద ఫ్రీడమ్మ. ఇన్నేళ్ళొచ్చాయి ఇంకా ఇలా పిల్ల లకోసమని డాక్టర్ల చుట్టూ తిరుగుతూనే ఉన్నాం" ఇలా ఏదేదో తిట్టుకుంటూనే ఉంది లీల.

డా. మనస్వి ఎదురుగా ఇద్దరూ ఇబ్బం దిగా కూచున్నారు. అంతకు కొంచెంసేపు ముందుగా లీలతోనూ, మోహనరావుతోనూ విడివిడిగా మాట్లాడాడు మనస్వి.

'ఇంట్లో ఏం గొడవలు జరగలేదు. రాజీవ్ అందరితోనూ చనువుగానే ఉంటాడు. అత నికి ఏ సమస్యలూ లేవు. అతనికి తల్లిదం డ్రులపట్ల అసంతృప్తి ఉందని తమకేనాడూ అనిపించలేదు' ఇదీ వాళ్ళిద్దరూ మనస్వి ప్రశ్నలకు విడివిడిగానూ, జాయింటుగానూ చెప్పిన సమాధానాల సారాంశం.

ఇద్దరికీ రాజీవ్ మానసికస్థితి ఎంత ప్రమాదంగా ఉందో తెలియటంలేదన్న సంగతి గ్రహించాడు మనస్వి. తెలిసినా వాళ్ళు దానికి అంత ప్రాధాన్యం ఇవ్వరని కూడా గ్రహించాడు. అందుకే వాళ్ళు అబ ద్ధాలల్లి చెప్పేసి నిజం చూడడానికి నిరాకరి స్తున్నారు. ఉన్న సంగతి చెప్పవలసిన బాధ్యత తనపైన ఉంది. తను చెప్పవల సింది చెప్పాడు మనస్వి.

"మీరు గ్రహించారో లేదోగానీ రాజీవ్ బ్రేక్‌డౌన్‌కి గురయ్యాడు. అతని పట్ల మీరు శ్రద్ధ చూపించడం లేదన్న అసంతప్తి అతని కుంది. మీ ఇద్దరి ప్రవర్తనలోనూ అతనికి నచ్చని అంశాలు చాలా ఉన్నాయి. మీరత నితో శాంతంగా మాట్లాడి మీకేమైనా ఇబ్బం దులుంటే వివరించవలసిన అవసరం ఉంది. పిల్లలతో రోజూ కొంతసేపైనా గడ పడం, వారితో ఫ్రాంక్‌గా మాట్లాడడం ఆరో గ్యకరమైన అలవాటు.

ఏదిఏమైనా రాజీవ్ చాలా జటిలమైన క్రైసిస్‌లో ఉన్నాడు. అతనికి ఇంట్లో కాస్త అనుకూల వాతావరణం ఉంటే బాగుంటుంది. దానితోపాటు నేను రాసిచ్చే మందులు చెప్పిన ప్రకారం వాడాలి. వారం రోజులకి సరిపడా మందులు రాస్తున్నాను. ఇవి వాడి వారం తర్వాత మళ్ళీ రాజీవ్‌ని తీసుకురండి. ప్రోగ్రెస్ ఎలా ఉందో చూద్దాం. ముఖ్యంగా అతనికి మానసిక ఒత్తిడి కలిగించే సంఘటన లేవీ జరక్కుండా చూడాలి. జాగ్రత్తగా ఉండండి. రేపు రాజీవ్‌ని ఇంటికి తీసుకువెళ్ళవచ్చు"

మనస్వి చెప్పుకుపోతుంటే చెవులప్పగించి విన్నారు. అన్నిటికీ బుర్ర ఊపారు. చెప్పవలసిందంతా అయిపోయాక, "ఇంక మీరు వెళ్ళవచ్చు" అన్న మనస్వి మాటలు వాళ్ళకి మధుర సంగీతంలాగా వినిపించాయి. చెంగున లేచి నమస్కారం పెట్టి బయటపడ్డారు.

మోహనరావు బిల్ సెటిల్ చెయ్యడానికి రామారావుని వెతుక్కుంటూ వెళ్ళాడు. లీల రాజీవ్ గదిలోకి వెళ్ళింది. "నిన్ను రేపు డిశ్చార్జ్ చేస్తారుటరా. పొద్దున్నే కారు పంపిస్తాం. వచ్చెయ్. నాన్న ఇప్పుడే నర్సింగ్‌హోమ్ బిల్లు సెటిల్ చేసేస్తానని వెళ్ళారు. వాళ్ళది వాళ్ళ మొహాన పారేస్తే మన దారిన మనం పోవచ్చు" దర్పంగా మాట్లాడుతున్న లీలకేసి మౌనంగా చూశాడు రాజీవ్.

కుర్చీలో కూలబడి ఓసారి వాచీ చూసుకుని, "మీ నాన్న ఇంకా రాలేదే! ఎంతసేపు రాస్తారో ఇంతోటి బిల్లు" అసహనంగా కాళ్ళూపుతూ, బల్లమీది పుస్తకం తీసి ఊరికే పేజీలు తిప్పింది.

కాసేపీవిడ మాట్లాడకుండా కూచుంటే బాగుండుననిపించింది రాజీవ్‌కి.

"ఎంతేస్తారో ఏవిఁటో ఈ బిల్లు! ఈ డాక్టర్లేదోరకంగా డబ్బు లాగాలని చూస్తారు. చుట్టాలనైనా చూడరు. మళ్ళీ వారంరోజులకి వచ్చి చూపించుకోవాల్ట. అప్పుడు మళ్ళీ ఫీజు లాగాలని కాబోలు" సాగిపోతున్న లీల వాగ్ధాటికి అడ్డుపడ్డాడు రాజీవ్.

"రామారావుగారిని, మనస్విగారిని ఒక్క మాటన్నా నేనూరుకోనమ్మా! వాళ్ళు నన్నెంతో బాగా చూశారు. వాళ్ళెవరూ డబ్బే ప్రధానం అనుకునే మనుషులు కారు"

విస్తుపోయి చూసింది లీల. "ఆహాఁ అలాగా పాపం! డబ్బు కోసం కాక నీమీది ప్రేమకొద్దీ నీకు సేవలు చేశారు కాబోలు" వెటకారం వలకబోసింది.

"వారం రోజులు తీరిగ్గా పడుకునేసరికి ఇంత డబ్బు ఖర్చుచేసి నిన్నిక్కడ చేర్పించిన మేం చేదయిపోయాం. వాళ్ళందరూ ఆత్మీయులైపోయారేం? "

లీల కేకలు పెడ్తుంటే రాజీవ్ మొహం ముడుచుకున్నాడు. రాజీవ్ ఇంటికొచ్చిన రోజు సాయంత్రం ఉత్పల్ వచ్చాడు. కాసేపు కబుర్లుచెప్పి వెళ్లాడు. మనసుకి ఎంతో ఉల్లాసంగా అనిపించింది. కానీ రాజీవ్‌కి అప్పుడే కాలేజీకి వెళ్ళాలనిపించలేదు. సైకోథెరపీ ఇస్తున్నప్పుడు కాలేజీకి వెళ్ళమనే చెప్పారు డాక్టరుగారు. కానీ వెళ్ళాలని లేకపోతే మటుకు బలవంతాన వెళ్ళనవసరంలేదని కూడా చెప్పారు.

ఒంటరిగా కూచుని డిప్రెషన్ కలిగించే ఆలోచనలు చెయ్యకూడదన్నాడు మనస్వి. అంటే వీలయినంతమటుకు నలుగురిలోనూ ఉంటూ స్నేహితులతోనో, ఇంట్లోవాళ్ళతోనో ఉల్లాసంగా కాలక్షేపం చేస్తుండాలి.

కానీ అప్పుడే కాలేజీకి వెళ్ళాలంటే సంకోచంగా ఉంది రాజీవ్‌కి. 'తను ఆత్మహత్యకు ప్రయత్నించినట్టు ఈపాటికి ఎంతమందికి తెలిసిపోయిందో! ఏదైనా కామెంటు చేస్తే తను భరించగలడా? కానీ మనసు గట్టి చేసుకోవాలి. నలుగురూ నాలుగు రకాలుగా అనుకుంటారు, అంటారు. అది లోకసహజం. తను అవేవీ పట్టించుకోకూడదు, అని మనసుకు నచ్చజెప్పుకుంటూ వారంరోజులపాటు ఇంట్లోనే గడిపాడు.





ఇంట్లో ఉన్నన్ని రోజులూ రాజీవ్ ఖాళీగా కూచోలేదు. తను మిస్సయిపోయిన క్లాసు లకి సంబంధించిన పాఠాలు చదువుకుని నోట్సు ప్రిపేర్ చేసుకున్నాడు. సరోజక్కూడా చదువంటే కాస్త శ్రద్ధ పెరిగింది.

రాజీవ్‌కి తన పుస్తకాలు బోరుకొట్టిన ప్పుడు సరోజ బియ్యే ఎకనామిక్స్ పుస్తకాలు అర్థమైనంతమటుకు చదివాడు. ఆసక్తి ఎంతో పెరిగింది. పుస్తకాల్లో విషయాలు అక్కాతమ్ముళ్ళు చర్చించుకోవడం, సరదాగా కబుర్లు చెప్పుకోవడంతో ఆ వారంరోజులు కాస్తోకూస్తో ఉల్లాసంగానే గడిచిపోయింది.

అంతక్రితం ఇంట్లో వాళ్ళందరూ ఎవరి లోకంలో వాళ్ళుగా గడుపుతుంటే ఇప్పుడు ఆ కొంపలో కనీసం ఇద్దరైనా మామూలుగా మాట్లాడుకుంటూ స్నేహంగా ఉండడం చూస్తే వంటాయన ముసలయ్యకు సంబ రంగా ఉంది. అతను కూడా వాళ్ళ కబు ర్లలో కల్పించుకుని కాలక్షేపం చేస్తూ కాస్తో కూస్తో పిల్లలిద్దరిపట్లా ఆపేక్ష పెంచుకు న్నాడు.

ఇంట్లో గడిపిన వారంరోజులు రాజీవ్‌కి బాగానే గడిచిపోయాయి. మోహన్‌రావు, లీల మాత్రం తమ ధోరణి మార్చుకోలేదు. వాళ్ళ ప్రవర్తన మనసులో ఓ మూల ముల్లు గుచ్చుతూనే ఉన్నా దాన్ని మరిచి పోయి మనసుని మళ్ళించుకోగలిగాడు.

అతను మందులు వేసుకుంటున్నాడా లేదా అన్న విషయం కూడా పట్టించుకో లేదు లీలగానీ, మోహన్రావుగానీ. ముస లయ్య, సరోజ శ్రద్ధగా టైముకి అతనికి మందుల విషయం గుర్తుచేసేవారు. స్తబ్ధుగా గడిచిపోతున్న సరోజ జీవితంలో తమ్ముడిపట్ల శ్రద్ధ తీసుకోవడం ఒక కొత్త చైతన్యం తీసుకొచ్చింది. చదువు, ఇతర విష యాలమీద ఆసక్తి పెరిగింది.

వారం రోజులకోసం మనస్వి రాసిన మందులు అయిపోవచ్చాయి. రాజీవ్‌కి తను ఆ మర్నాడు మనస్వి దగ్గరకు వెళ్ళి చూపించుకోవాలని గుర్తుకొచ్చింది. ఆయన ఎంతో చెప్పారు "మళ్ళీ వారం తర్వాత రావాలి. మీ పేరెంట్స్ కూడా నీతో రావడం ముఖ్యం. అందరితోనూ మాట్లా డాక మందులు మార్చడమో తగ్గించడమో నిర్ణయం తీసుకోవాలి" అని చెప్పి పంపాడా యన. రాజీవ్‌కి ముందురోజునుంచీ టెన్షన్ మొదలయింది. అమ్మా నాన్నా తనతో వస్తారా అన్న అనుమానం బుర్రని తినే సింది.

తన ఆందోళన అక్క దగ్గర బయటపె ట్టాడు. "అడుగు. రేపు సాయంత్రం మనస్వి దగ్గరకి కన్సల్టేషన్‌కి వెళ్ళాలి వేరే ప్రోగ్రామ్ ఏదీ పెట్టుకోకండి అని చెప్పు" అంది సరోజ. అంత ఈజీగా వాళ్ళు ఒప్పు కోరని సరోజక్కూడా తెలుసు. అయితే పిల్లి మెడలో గంటకట్టడానికి ఆ అమ్మాయి కూడా సిద్ధంగా లేదు. తమ్ముడికి శ్రద్ధగా మందులు వేసి సేవలు చెయ్యగలదుగానీ అమ్మానాన్నల ఎదుటపడి వాడిని డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళండి అని చెప్పే ధైర్యం మాత్రంలేదు. చిన్నిమేకపిల్ల వెళ్ళి కొండని ఢీకొట్టినట్టవుతుందని భయం.

లీల ఎందుకు ఎప్పుడు గయ్‌మని ఒంటి కాలిమీద లేస్తుందో పిల్లలిద్దరికీ అర్థంకాదు. ఆమెని ఏదడగడానికైనా ధైర్యం లేదు ఇద్ద రికీ. మోహన్‌రావైతే అరిచి కేకలుపెట్టి అద రగొట్టకపోవచ్చు కానీ అనవసరంగా అబ ద్ధాలాడతాడు. లేనిపోని గొప్పలు చెప్పి పిల్లల దగ్గరకూడా గప్పాలు కొట్టడానికి సిగ్గుపడడు. అదో అసహ్యం!

తప్పదు కాబట్టి గుర్తుచేశాడు రాజీవ్ మోహన్రావుకి. "సరే దాన్దేముంది? వెడదాం. అయిదింటికేగా? రెడీగా ఉండు" అన్నాడు. రాజీవ్ ఆశ్చర్యంతో ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు.

లీల మాత్రం అనుకున్నట్టుగానే ఎందుకు గొడవ చేస్తోందో ఎవరికీ అర్థంకాకుండా పెద్ద రభస చేసింది. "ఇంక పనీపాటా

లేనట్టు ఎప్పుడూ వీడ్నేసుకుని ఆ డాక్టర్ల చుట్టూ తిరగడమేనా?" అంటూ మొదలెట్టిన దండకం పావుగంటపాటు సాగుతూనే ఉంది.

"ఈవిడ చేసే అంత ముఖ్యమైన పనులేమిటో తెలుసుకోవడానికి ఈ జీవితకాలం సరిపోదేమో" అనుకున్నారు సరోజ, రాజీవ్ ఎవరి మనసులో వారు.

"అసలు అప్పుడే చెప్పాను. మీకు శుభ్రంగా ఆ ఎన్నారైలు పెట్టిన పెద్ద కార్పొరేట్ హాస్పిటల్‌లో వాడ్ని చూపించమని" అని మోహన్‌రావుని సాధిస్తూనే ఉంది.

"సరే అలాగే చేద్దాం" అని గంగిరెద్దులా తలకాయ ఉపాడు మోహన్‌రావు.

"నేనిప్పుడు ఇంకో హాస్పిటల్‌కి రాను. రామారావంకుల్, మనస్వి డాక్టర్‌గారూ నన్ను చాలా బాగా చూసుకుంటున్నారు. నేనింకో డాక్టరు దగ్గరికి రాను. మీరు తీసుకెళ్ళినా నేను కొత్త వాళ్ళతో చచ్చినా మాట్లాడను" ధైర్యం చేసి ఖచ్చితంగా చెప్పేశాడు రాజీవ్. తల్లి సతాయింపులకు తలొగ్గి నిజంగానే తండ్రి తనను వేరే కొత్త డాక్టరుకి చూపిస్తాడేమోనని భయంవేసిందతనికి. మనసు విప్పి కొత్త వాళ్ళతో మాట్లాడడం ఎంత కష్టమైన పనో అతనికి తెలుసు.

"సరే. వాడంత పట్టు పడుతుంటే ఈసారికిలాపోనియ్" అన్నాడు మోహన్రావు.

"ఇప్పుడు కొత్త డాక్టరు దగ్గరకి మనం తీసుకెళ్ళినా తీరా వాడు నోరిప్పకపోతే మనకి తిరుగుడు తప్ప లాభం ఏం ఉండదు. ఇవాళ్టికి వాడి మాట ప్రకారమే కానిద్దాం" అని లీలకి నచ్చచెప్పాడు.

మోహన్రావుకి లీల మాటిమాటికీ పెద్ద పెద్ద ఖరీదైన హాస్పిటల్స్ పేరెత్తుతుంటే పచ్చి వెలక్కాయ గొంతుకడ్డంపడ్డట్టవుతోంది.

అతని 'పై సంపాదన' ప్రస్తుతం కాస్త తక్కువగా ఉంటోంది. ఎన్నికలు పూర్తయి కొత్త ప్రభుత్వం ఏర్పాటయి పూర్తిగా రెండు నెలలు కూడా కాలేదు. కొత్త మంత్రులు, కొత్తకొత్త ఎమ్.ఎల్.ఎ.లు చాలా దూకుడుగా ఉన్నారు. తమది 'క్లీన్' ప్రభుత్వం అన్న ఇంప్రెషన్ ప్రజల్లో కలిగించాలని తీవ్ర ప్రయత్నం చేస్తున్నారు.

ఆ ప్రయత్నాల్లో భాగంగా ఆఫీసులమీద సర్ప్రైజ్ ఇన్స్పెక్షన్లు గట్రా జరుపుతున్నారు. కంప్లెయింట్లందితే ఎవరో ఒకళ్ళని బలిపెట్టి, సస్పెన్షన్లలో ఇరికించి పేరు ప్రఖ్యాతులు గడించాలని మినిస్టర్లందరూ తెగ ఉబలాటపడుతున్న రోజులవి.

ఎ.సి.బి.వాళ్ళు కూడా అప్రమత్తంగా ఉండి అవినీతి పరులని పట్టాలని హడావిడి చేస్తున్నారు. కొన్ని రోజులు చేతులు ముడుచుకుని మడికట్టుక్కూచుంటే ఈ కొత్త బిచ్చగాళ్ళందరి ఉబలాటాలూ తీరి సద్దుమణుగుతుంది. ఇంక అప్పుడు ఎప్పట్లాగే విజృంభించచ్చు అనుకున్నారు మోహన్‌రావు బృందం. అప్పుడు ఈ రెండు మూడు నెలల నష్టం పూడేలా వడ్డీతోసహా లాగచ్చు అనుకున్నారు. అందుకే ఇప్పుడు లీలని ఖరీదైన హాస్పిటల్ మోజునించి మరిపించే ప్రయత్నం చేశాడు. రాజీవ్ మాట ప్రకారం పోతే అనవసరపు ఖర్చులు తగ్గుతాయని ఆలోచించి రాజీవ్ మాటలని సపోర్ట్ చేశాడే కానీ అతనితో కలిసి డాక్టరు దగ్గరకెళ్ళే ఉద్దేశం లేదు.

మధ్యాహ్నం మూడింటినించీ పత్తాలేకుండా ఎటో పోయాడు మోహన్‌రావు. అతను నాలుగున్నర క్కూడా రాకపోయేసరికి "ఇంక నేనొక్కత్తినీ మాత్రం నీతో ఎందుకు రావడం? మీ డాక్టరు 'ఇద్దరూ రావాలని చెప్పాకదా' అంటూ నిష్ఠూరాలాడుతాడు బాబూ. నేను రాను" అనేసి సింగారించుకుని ఎటో వెళ్ళిపోయింది లీల.

తమ్ముడి పట్ల తల్లిదండ్రుల నిర్లక్ష్య ధోరణి చూస్తుంటే సరోజకి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. చిన్నమొహం చేసుక్కూచున్న రాజీవ్‌తో,"వీళ్ళకిది కొత్త కాదుగా. వీళ్ళ గురించి




బాధపడడం అనవసరం. పద మనిద్దరం వెడదాం" అంటూ అతన్ని బయల్దేరదీసింది.



**లో**పలికి వస్తున్న రాజీవ్, సరోజలను చూడగానే గ్రహించాడు మనస్వి లీల, మోహన్‌రావు రాలేదని. విష్‌చేసి కూచున్న రాజీవ్ గుండె దడదడలాడింది ఆయన మీపేరెంట్స్ రాలేదేం? అని అడిగితే ఏం చెప్పాలా అన్న భయంతో. పరిస్థితి అర్థంచేసుకున్న మనస్వి రాజీవ్‌ని మామూలుగా పలకరించి ఎప్పట్లాగే చిరునవ్వుతో మాట్లాడడంతో రాజీవ్ మనసు కుదుటపడింది.

రాజీవ్‌ని కాసేపు బయట వెయిట్‌చెయ్యమని చెప్పి సరోజతో మాట్లాడాడు మనస్వి.

"ఈ వారం రోజులూ రాజీవ్ ఎలా ఉన్నాడు? ఇంతకు ముందు మీద ఏమైనా ఇంప్రూవ్‌మెంటుందా? " అన్న ప్రశ్నలకు సరోజ వివరంగా జవాబు చెప్పింది. చాలా రోజుల తరవాత రాజీవ్ ఉత్సాహంగా ఉన్నాడని చెప్పింది. అతను కాలేజ్‌కి వెళ్ళకపోయినా శ్రద్ధగా చదువుకోవడం, తన టెక్స్ట్‌బుక్స్‌లో కూడా ఆసక్తి చూపించడం అన్నీ చెప్పింది.

"ఇవాళ మీ నాన్నగారుగానీ అమ్మగారు గానీ ఎందుకు రాలేదు మీతో? " అన్న ప్రశ్నకి మాత్రం తడబడిపోయింది.

నెమ్మదిగా మాటలు కూడదీసుకుంటూ మధ్యాహ్నం ఇంట్లో జరిగిన సంగతి చెప్పింది. రాజీవ్‌పట్ల తల్లిదండ్రులు ఇద్దరూ నిర్లక్ష్యంగా వ్యవహరిస్తూ తమ స్వార్థం వదులుకోవట్లేదని రూఢిగా తెలుసుకున్నాడు మనస్వి.

"మరి వాళ్ళు ఎప్పట్లాగే రాజీవ్‌మీద పెద్ద శ్రద్ధేమీ చూపించట్లేదుకదా ఈ వారంరోజులూ అతను టాబ్లెట్స్ సరిగా వేసుకున్నాడో లేదో ఎవరు చూశారు? నువ్వా? " అనడిగాడు.

ఔనన్నట్టు తలూపింది సరోజ. "నేనే చూసుకుంటుండేదాన్ని. అసలు రాజీవ్ కూడా మర్చిపోకుండా శ్రద్ధగానే వేసుకునేవాడు" అంది.

సరోజని పంపించి రాజీవ్‌ని లోపలికి పిలిచాడు మనస్వి. తనకి ఇదివరకటిలాగా నిరాశని కలిగించే ఆలోచనలు అంతగా రావట్లేదని చెప్పాడు రాజీవ్. కానీ ఆరోజు తల్లీ, తండ్రీ తనతోపాటు రావడానికి ఒప్పుకున్నట్టే ఒప్పుకుని చివరికి ఎవరిదారిన వారు పోవడంవల్ల కలిగిన బాధ చెప్పుకున్నాడు.

"అసలు మొదట వస్తానని చెప్పడమెందుకు? రాదల్చుకోలేదని ఫ్రాంక్‌గా చెప్పెయ్యచ్చు కదా? ముఖ్యంగా మా నాన్న. ఆయన అనవసరంగా అంతంత అబద్ధాలెందుకు చెప్తాడో అర్థంకాదు" అంటూ బాధపడ్తున్న రాజీవ్‌ని చూస్తే జాలేసింది మనస్వికి.

"ప్రపంచంలో ఎన్నో రకాల మనుషులు, అనేక రకాల స్వభావాలుంటాయి. వీళ్ళు ఇలా ఎందుకున్నారు? వాళ్ళు అలా ఎందుకున్నారు? అని బాధపడుతూ పోతే మనకి మనశ్శాంతి ఉండదు" అని మనస్వి చెప్తుంటే మౌనంగా విన్నాడు రాజీవ్.

"మీ నాన్నగారి స్వభావం ఇవాళ కొత్తగా

తెలుసుకున్నది కాదుకదా? నీకు తెలిసినప్పటినుంచీ ఆయన అలాగే ఉన్నారు. ఆయన్ని నువ్వు మార్చలేవని నీకీపాటికి తెలిసే ఉంటుంది. ఆయనొక్కడే కాదు ప్రపంచంలో నీకు నచ్చనివారు, అవినీతిపరులు, అబద్ధాలకోరులు ఇంకా చాలా మంది ఉంటారు. మంచీ చెడు రెండూ ఉంటాయి లోకంలో. మనకి నచ్చని వారితో సద్దుకుపోయి మన మార్గంలో మనం ముందుకు సాగడం అలవాటు చేసుకోవాలి" మనస్వి వివరించాడు.

రాజీవ్‌కి డా. మనస్వి మాటలు వింటున్నంతసేపూ ఆయన చెప్పినట్టు నడుచుకోవడం ఎంతో తేలికయిన విషయం అనిపిస్తుంది. ఇంటికొచ్చాక తన బాధలూ తన మనోవ్యథలు కందిరీగల్లారేగి మనసుని చిందరవందర చేస్తాయి. మనస్వి చెప్పినవన్నీ పాఠంలా గుర్తుచేసుకుని మనసునదుపులో పెట్టుకోడానికి ప్రయత్నం చేశాడు రాజీవ్.

'డాక్టరుగారు చెప్పినట్టు ఇంక మామూలుగా ఉండటం అలవాటు చేసుకోవాలి. ప్రపంచంలో పిల్లల్ని నిర్లక్ష్యం చేసేవాళ్ళు, డబ్బే సర్వస్వం అనుకునేవాళ్ళు ఇంకా ఎందరో ఉండే ఉంటారు' అనుకుని మనసుకు నచ్చజెప్పుకున్నాడు. 'కానీ మరి అటువంటి వారెవరూ ఇంతవరకూ నాకు కనబడలేదే? ' అన్న ప్రశ్న మనసులో ఓ మూల తలెత్తి వేధించుతూనే వుంది.

'ఇంకరేపట్నుంచీ కాలేజ్‌కి వెళ్ళిపోవాలి. క్లాసులు, ఫ్రెండ్సూ, చదువు అంటూ ఒక రొటీన్‌లో పడితే ఈ ఆలోచనలు అంతగా బాధపెట్టవేమో' అనుకున్నాడు.

★ ★ ★

వారం రోజుల తరవాత ఎంతో సంకోచిస్తూ కాలేజ్‌లో అగుడుపెట్టాడు రాజీవ్. అక్కడందరూ తనని వింతగా చూస్తారనీ, ఎవరూ తనతో ఇదివరకటిలాగా స్నేహంగా ఉండరనీ ఊహించుకున్నాడు. అయితే అతననుకున్నట్టుగా ఏం జరగలేదు.

ఉత్పల్ ముందుగానే స్నేహితులందర్నీ హెచ్చరించి ఉంచాడు. రాజీవ్‌ని అనవసరమైన ప్రశ్నలు వేసి ఎవరూ బాధపెట్టకుండా కట్టుదిట్టం చేశాడు. రాజీవ్ ఆత్మహత్యా ప్రయత్నం క్లాసులో చాలా కొద్దిమందికే తెలుసు. దాని గురించి తెలియనివాళ్ళెవరైనా, 'ఇన్ని రోజులూ కాలేజ్ ఎందుకు మానేశావు? ' లాంటి ఇబ్బందికరమైన ప్రశ్నలు వేస్తే ఒంట్లో బాగాలేదనో, జ్వరం వచ్చిందనో తమలోనే ఎవరో ఒకరు జవాబు చెప్పి రాజీవ్‌ని కవర్ చేసెయ్యాలని నిశ్చయించుకున్నారు అందరూ కలిసి.

కాలేజ్‌లో ఫ్రెండ్సందరూ తనతో మామూలుగా ఏ తేడాలేకుండా ఎప్పట్లాగే ఉండడం రాజీవ్‌కి ఎంతో రిలీఫ్‌నిచ్చింది. క్లోజ్‌ఫ్రెండ్స్ కాకుండా క్లాసులో మిగతా పరిచయస్తులు ఇన్ని రోజులు కాలేజీ ఎందుకు మానేశావు? అని అడిగితే ఏం చెప్పాలా అని భయపడ్డాడు. కానీ ఇబ్బందిని కలిగించే సంఘటన ఏదీ జరగకపోవడం అతనికి ఎంతో ఆనందాన్నిచ్చింది.

అలా ఓ మూణ్నాలుగురోజులు ప్రశాంతంగా గడిచిపోయాయి. తరవాతనించి రాజీవ్‌కి లోలోపల సన్నని మనోవ్యథ మొదలయింది మళ్ళీ.

తన ఫ్రెండ్స్ ఉత్పల్, నీరజ్, శిరీష్ మొదలైన వాళ్ళ ప్రవర్తనలో ఏదో తేడా ఉన్నట్టుగా అనిపించింది రాజీవ్‌కి. వాళ్ళు తనతో చాలా మామూలుగా ఏం జరగనట్టుగానే ఉంటున్నారు. కానీ ఆ ప్రయత్నం కొంచెం 'అతి'గా చేస్తున్నారనిపిస్తోందతనికి. ఎందుకో తనపట్ల ఇదివరకటికన్నా ఎక్కువగా శ్రద్ధచూపిస్తున్నట్టు, తనను జాగ్రత్తగా కాపాడుతున్న ధోరణిలో చూస్తున్నట్టు అనిపించింది.

అందరూ కలిసి తనని ఏమీ తెలియని పసిపిల్లాడిని కాపాడినట్టు మరీ శ్రద్ధగా చూస్తున్నారనుకున్నాడు రాజీవ్. 'వీళ్లు మరీ





బొత్తిగా ఓవర్ ప్రొటెక్టివ్‌గా చంటి కుర్రాడిని చూసినట్టు చూస్తున్నారు నన్ను' అని తనలో తాను చాలాసార్లు అనుకున్నాడు.

నలుగురూ కలిసి మాట్లాడుకుంటూ వుండగా తనక్కడికి వెడితే మాటలాపేస్తున్నట్టుగా అనుమానం వేసింది రెండు మూడుసార్లు. మళ్లీ అంతలోనే తనే అనవసరంగా లేనిపోనివి ఊహించుకుంటున్నాడేమోనని ఆత్మవిమర్శ చేసుకునేవాడు.

తను చేసిన ఆత్మహత్యా ప్రయత్నం తనలో ఏదో తప్పు చేసిన భావం రేపింది. నిజానికి తనే ఎవరి మొహంలోకీ సూటిగా చూసి రిలాక్స్‌డ్‌గా మాట్లాడలేకపోతున్నాడింకా. డాక్టరుగారు చెప్పిన మాటలు మాటిమాటికీ గుర్తు చేసుకుని ఆత్మ విశ్వాసం పెంచుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడతను. తను అందరిలా మామూలుగా వుండాలి. పాత కాంప్లెక్సులన్నీ పోవాలి అంటే ఎంతో ప్రయత్నం చెయ్యాలని తెలుసు. డాక్టరుగారి సైకోథెరపీ, మానకుండా మందులు వాడడం, వీటికి తోడు తనంతతాను విశ్వాసంతో ప్రయత్నం చేసి మామూలుగా అవడానికి టైమ్ పడుతుందనీ తెలుసు. ఈ లోపల అనుమానాలూ, భయాలతో వేధించే మనసుని అదుపులో పెట్టుకోవాలనీ తెలుసు.

అందుకే స్నేహితులు అప్పుడప్పుడు తనని చూసి మాటలు మానేసినట్టూ, టాపిక్ మార్చినట్టూ అనిపించినా అంతా భ్రమ అని సరిపెట్టుకునేవాడు. పాపం వాళ్లెంతో సదుద్దేశంతో తన మనసు నొచ్చుకోకూడదని జాగ్రత్తగా ప్రవర్తిస్తుంటే తనే వాళ్లని అపార్థం చేసుకుని అనుమానాలు పెంచుకుంటున్నాడేమోనని బాధపడేవాడు. ఇలాంటి ఊగిసలాటలోనే రాజీవ్ కాలేజికి వెడుతున్నాడు, వస్తున్నాడు.

అయితే నాలుగోరోజు జరిగిన సంఘటన అతనిలో రేగిన అనుమానాలు కొద్దిగా బలపడేలా చేసింది.

కాలేజికి ఓ అరగంట ముందుగా చేరి కాసేపు కబుర్లు చెప్పుకోవడం రాజీవ్ బృందానికి అలవాటు. ఆరోజు రాజీవ్ కాస్త ఆలశ్యంగా వెళ్లాడు. క్లాస్‌రూమ్‌లో ఓ బెంచీ దగ్గర గుంపుగా నిలబడి మాట్లాడుకుంటున్నవాళ్లు రాజీవ్ రావడం చూడలేదు. వాళ్ల మాటలు రాజీవ్ చెవిన పడ్డాయి.

"ఎప్పటికైనా తెలియక తప్పదుకదా! అదేదో ఇప్పుడే చెబితే తప్పేమిటీ? తరవాతెప్పుడో తెలిస్తే ఇంకా షాకింగ్‌గా ఉంటుంది. మనం చెప్పెయ్యడమే నయం" అంటున్నాడు చంపక్. ఆ మాటలు వింటూ వాళ్ళని సమీపించాడు రాజీవ్.

"ఏంట్రా? ఎవరికి ఏం చెప్పాలి?" అని రాజీవ్ అడగగానే అతన్ని అప్పుడే చూసిన అక్కడివాళ్ళందరూ ఒక్కసారి గప్‌చుప్ అయిపోవడం గమనించాడు రాజీవ్. అంతేకాకుండా ఒక్క అరక్షణంపాటు వాళ్ళల్లో వాళ్లు కళ్లతో సైగలు చేసుకోవడం కూడా అతని దృష్టిలో పడింది.

ఆశ్చర్యంనుంచి మొదట తేరుకున్న ఉత్పల్, "ఏమీ లేదురా. ఇంగ్లీష్ సార్‌తో చెప్పాలనుకుంటున్నాం. సిలబస్ చాలా స్లోగా నడుస్తోంది. చాలా క్లాసులు క్యాన్సిల్ చేస్తున్నారు. అలా చెయ్యకుండా కాస్త తొందరగా సిలబస్ కంప్లీట్ చెయ్యండని చెప్దామనుకుంటున్నాం. ఈ వీక్ కూడా ఆయన ధోరణి అబ్జర్వ్ చేసి నెక్స్ట్‌వీక్ చెప్దామని నేనంటున్నా" రాజీవ్‌తో మాట్లాడుతూనే చంపక్‌కేసి చూసి 'వద్దు' అన్నట్టు తలూపుతున్నాడు ఉత్పల్.

ఇంతలో లెక్చరర్ క్లాసులోకి రావడంతో మాటలు మానేసి ఎవరి సీట్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

మళ్ళీ ఆ మర్నాడు మరో సంఘటన జరిగింది. కాలేజ్ బాస్కెట్‌బాల్ టీమ్ సెలక్షన్స్ అవుతాయని ఇంట్రెస్ట్ ఉన్నవాళ్ళం దర్నీ క్లాసెస్ అయిపోయాక ప్లేగ్రౌండ్‌లోకి రమ్మన్నారు పి.డి.సార్. రాజీవ్ స్నేహి

తుల్లో పంకజ్, శిరీష్‌లు ఆటల్లో ఆసక్తి ఉన్నవాళ్లు. వాళ్ళు వెడుతుంటే మిగతా మిత్రులు కూడా వాళ్ళకి తోడుగా గ్రౌండ్‌లోకి వెళ్ళారు. కోర్టులో ఆడుతున్న వాళ్ళని చూస్తూ కబుర్లు చెప్పుకుంటూ నిలబడ్డారు రాజీవ్, ఉత్పల్, చంపక్, ఇంకా ఇద్దరు ముగ్గురబ్బాయిలు.

ఫుట్‌బాల్ ఆడుతున్న సీనియర్ స్టూడెంటొకతను వీళ్ళని చూసి పరిగెత్తుకుంటూ వీళ్ళ దగ్గర కొచ్చాడు. "ఇదుగో ఉత్పల్! మా చుట్టాలాయనొకాయనకి ఏక్సిడెంటైందని చెప్పానే! ఆయన మీక్కూడా తెలుసన్నావు ఆయనా..." అంటూ వొస్తున్న అతనికి అడ్డుపడి ఉత్పల్ "అవును రమేష్! నీ దగ్గర ఎకనమిక్స్ క్వశ్చన్ పేపర్సున్నాయన్నావు. లాస్టియర్ గైడ్స్ కూడా నాకిస్తానన్నావు. మర్చిపోయావా?" అంటూ అతని భుజంమీద చెయ్యివేసి కొంచెం దూరంగా తీసుకుపోయాడు.

ఆ కుర్రాడు కొంచెం ఆశ్చర్యపోవడం రాజీవ్ స్పష్టంగా చూశాడు. ఈసారి మాత్రం తనది భ్రమ కాదనుకున్నాడు. 'డెఫినిట్‌గా ఉత్పల్ నానుంచి ఏదో దాస్తున్నాడు. ఒక్కోసారి మాట మార్చెయ్యడానికి చాలా తొందరపడుతున్నాడు' అనుకున్నాడు, దూరంగా నుంచుని అతనితో ఏదో మాట్లాడ్తున్న ఉత్పల్‌కేసి చూస్తూ.

ఆరోజు రాత్రి పడుకుని ఆలోచిస్తుంటే ఉత్పల్ ప్రవర్తనలో ఒక అర్థం చూడగలిగాడు రాజీవ్.

'ఆ రమేష్ ఏమన్నాడూ? వాళ్ళ చుట్టాలాయనకెవరికో ఏక్సిడెంటయిందనికదూ? ఆc అదీ. కమల్ తండ్రి ఏక్సిడెంటు విషయంలో జరిగిన గొడవ తరవాతేకదా నేను మనసు పాడైపోయి సూయిసైడ్ ప్రయత్నం చేశాను. నా దగ్గర మాటిమాటికీ ఏక్సిడెంట్ల విషయాలు మాట్లాడితే నేను మళ్ళీ మనసు పాడుచేసేసుకుని బాధపడిపోతానేమో అనుకుని ఉంటాడు ఉత్పల్. అందుకే ఆ కుర్రాడి మాటల్ని మధ్యలోనే కట్ చేసేశాడు' అనుకుని తృప్తిపడడానికి ప్రయత్నించాడు. కానీ అతని మనసులో ఏదో మూల ఏవేవో అనుమానాలు రేగి అశాంతిని కలుగజేస్తూనే ఉన్నాయ్.

★ ★ ★

రాజీవ్ శాంతి, అశాంతుల మధ్య డోలాయమానచిత్తంతో గడిపిన వారం రోజులూ మోహనరావు జీవితంలో కూడా పరమగడ్డు రోజులుగా పరిణమించాయి. అయితే అతని కారణాలు వేరు.

ఏ మినిస్టరు ఏ క్షణాన టీవీ కెమేరాలతో సహా వచ్చిపడతాడో తెలీదు. అందుకని ఆఫీసులో అందరూ చచ్చినట్టు చేతులు బల్లకింద కెళ్లకుండా గట్టిగా ముడుచుకు కూచోవాల్సొస్తోంది. ఓ వారం పదిరోజులు మడికట్టుక్కూచోవడం ఏమంత కష్టమైన విషయం కాదుగానీ అసలు ఒరిజినల్ ప్లాన్ ప్రకారం ఇద్దరు మ్యూచువల్ ట్రాన్స్‌ఫర్లవాళ్ళు, ఒక ప్రమోషన్‌వాడు ఈ వారంలోనే డబ్బు తీసుకొచ్చి ఇచ్చి తమ పనులు చేయించుకునేందుకు ఒప్పందం రెణ్ణెల్ల క్రితమే జరిగింది. ఇప్పుడా పనులు ఎప్పుడవుతాయో తెలీని సందిగ్ధ పరిస్థితి ఏర్పడింది.

అది కూడా అంత క్లిష్ట సమస్య కాదు. రెణ్ణెల్లు వెయిట్ చేసినవాళ్ళు ఇంకో రెండు మూడు నెలలు ఎదురు చూడమన్నా ఉండి, ఇవ్వవలసినది ఇచ్చి తమ పనులు చేయించుకుపోతారు. తమకు రావలసిన డబ్బు ఇప్పుడు కాకపోతే ఇంకొన్నాళ్ళకైనా అందుతుంది. ట్రాన్స్‌ఫర్ల వాళ్ళిద్దరికీ 'ఈ కొత్త ప్రభుత్వం హడావిడి తగ్గేవరకూ మా ఆఫీసు చుట్టుపక్కలకైనా రాకండి' అని కబుర్లు వెళ్ళాయి. కాబట్టి వాళ్ళతో గొడవ లేదు.

వచ్చిన గొడవల్లా ప్రమోషన్ 'కేండిడేట్' తోనే. వాడిని కాంటాక్ట్ చేద్దామంటే దొరకలేదు. సెలవు పెట్టుకుని ఎక్కడకి వెళ్లాడో




వాళ్ళ ఆఫీసు వాళ్ళు కూడా చెప్పలేకపోతు న్నారు. ఏ అత్తారింటినుంచో డబ్బు తీసు కుని ఏ క్షణాన్నైనా ఈ ఆఫీసులో వాలచ్చు వాడికి ఈ వారంలోనే డేట్ ఫిక్స్ చేసినవాడు భక్తవత్సలం. ఆ 'కేండిడేట్' నిజంగా వచ్చినా మరీ భయపడిపోనక్క ర్లేదు. గేటు దగ్గర వాడిని అక్కడ్నుంచే వెనక్కి పంపెయ్యచ్చు.

అసలు చిక్కంతా ఎక్కడుందంటే- డేట్ ఫిక్సయిన 'కేండిడేట్'కంటే సీనియర్ కేండి డేట్ ఇంకొకడున్నాడు. ఆ సీనియర్ కేండి డేట్‌కి 'నీకు ప్రమోషన్ డ్యూ. ఫిక్స్‌డ్ రేట్ చెల్లిస్తే నీ పేపర్లన్నీ టైముకి సిద్ధం చేసి నీ ప్రమోషన్ ఏ ఆలస్యం కాకుండా వచ్చేలా పనిచేసిపెడ్తాం' అని ఫీలర్లు పంపడం ఇది వరకోసారి జరిగింది. కాకపోతే అతను మహాపతివ్రతలాగా "నేనిన్నాళ్ల సర్వీసులో పైసా లంచం తీసుకోలేదు. ఇవ్వలేదు. ఇప్పుడివ్వను. నాకు న్యాయప్రకారం, సర్వీసు రూల్స్ ప్రకారం రావాల్సిన ప్రమో షన్ రాకుండా ఎవరు ఎలా అడ్డుకుంటారో నేనూ చూస్తాను" అని పేలాడట.

ఆ సంగతి తెలిసిన భక్తవత్సలం ఏకంగా అతని సర్వీస్ రిజిస్టర్నే మాయం చేసి కూచున్నాడు. ఏదో లూప్‌హోల్ పట్టుకుని చిన్న చిన్న గోల్‌మాల్ చేసి డబ్బు ఇస్తా నన్న మొదటి కేండిడేట్‌కి ప్రమోషన్ వచ్చేలా ఫైలు తయారుచేశారు భక్తవ త్సలం, మోహనరావు కలిసి.

అయితే, ఆ 'పతివ్రతగాడు' కొత్త మినిస్ట ర్లలో ఎవరికో దగ్గరి చుట్టమో కావల్సిన వాడో ఏదోనన్న వార్త సుడిగాల్లో తేలు కుంటూ వచ్చి పిడుగులా పడింది మోహన రావు బృందంమీద. ఆ 'పతివ్రతుడు', ఈ నూతన మంత్రిగారు కలిసి ఎ.సి.బి. సహా యంతో ఈ ఆఫీసులో పురుగులని ఏరె య్యాలని కంకణం కట్టుక్కూచున్నారన్న గాలివార్తలు కూడా చేరాయి.

డబ్బులసంచీ ఊపుకుంటూ ఏ క్షణాన ప్రమోషన్‌గాడు ప్రత్యక్షమవుతాడో ఆ క్షణాన్నే టైంబాంబు పేల్తుందని ఆఫీసులో కాస్తో కూస్తో బుర్రున్న వాళ్ళందరూ ఊహించారు. ఇలాంటి విషయాలు ఊహ కందని బుర్ర ఒకటుంది ఆ ఆఫీసులో. ఆ బుర్ర గలవాడి పేరు గణపతి.

గణపతి ఆ ఆఫీసులోనూ, లంచాలు పట్ట డంలోనూ దాదాపు కొత్త బిచ్చగాడని చెప్పచ్చు.

ప్రభుత్వోద్యోగాలకి దరఖాస్తు పెట్టడానికి ఇంకోనెల్లో ఏజ్‌బారైపోతుందనగా అతనికి ప్రభుత్వోద్యోగం వచ్చింది. ఉద్యోగంలో చేరిన రెండు మూడేళ్లలోనూ మోహనరావు పాదాల దగ్గర శిష్యరికం చేసి అవినీతి పాఠాలు నేర్చుకున్నాడు. అయితే అతనికి తన 'శిక్షణ' ఇంకా పూర్తి కాలేదన్న సంగతి గ్రహింపుకు రాలేదు. సగం నాలెడ్జితోనే మోహనరావుని మించిపోవాలని ఉత్సాహప డుతున్నాడు. ఆఫీసులో ఏర్పడ్డ ఉద్రిక్త పరి స్థితిని అమాయకత్వంవల్ల గ్రహించలేకపో యాడు.

'ప్రమోషన్ కేండిడేటు' ఎప్పుడు వస్తాడా అని ఆత్రంగా ఎదురుచూస్తున్నాడు గణపతి పరమ అమాయక చక్రవర్తిలా.

★ ★ ★

వారాంతానికొచ్చేసరికల్లా రాజీవ్‌కి స్నేహి తుల ప్రవర్తన మొహం మొత్తినట్టయింది. స్నేహంలో తీపి మరీ ఎక్కువయిపోయింద నిపించింది. ఇదివరకటిలాగా కొందరు తనని అదోరకంగా చూసి చెవులు కొరుక్కు నేంత ఫ్రీగా ఉంటేనే బాగుంటుందనిపిం చింది.

శనివారం కాలేజ్‌కి హాఫ్‌డే. పైగా చివరి రెండు క్లాసులూ కాన్సిలయి చాలా తీరిక దొరికింది. ఉత్పల్‌తో కలిసి గ్రౌండ్‌లో కూచుని కబుర్లు చెప్తున్నప్పుడు ఇంక ఉండ బట్టలేక అడిగేశాడు.

"ఏంట్రా! మీరందరూ నన్ను బాగా చంటి పిల్లాడిలాగా చూస్తున్నారు? కొంచెం కూడా

సీరియస్‌గా మాట్లాడరు. ఎప్పుడూ ఏదో పైపైన నన్ను నవ్వించడమే ధ్యేయం అన్నట్టు జోకులూ పుస్తకాల్లో కథలూ తప్ప ఇదివరకటిలా మీరెవరూ నాతో మాట్లాడట్లేదు. అంతా సూపర్ ఫిషియల్‌గా, ఆర్టిఫిషియల్‌గా అనిపిస్తోంది. సారీ... నిన్ను హర్ట్ చెయ్యడం నా ఉద్దేశం కాదు" అన్నాడు.

ఉత్పల్ రాజీవ్ చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. "నిన్ను హర్ట్ చెయ్యాలన్నది మా ఉద్దేశం కూడా కాదురా. నిన్ను జాగ్రత్తగా నీ మనసుకి ఏ బాధా కలగకుండా చూడాలన్నదే మా ప్రయత్నం. అపార్థం చేసుకోకు" అన్నాడు.

"నన్ను హుషారుగా ఉంచాలని మీరందరూ ప్రయత్నిస్తున్నారని నాకూ అర్థమయింది. కానీ నేనూ నిన్ను అబ్జర్వ్ చేస్తున్నాను. అసలు నువ్వే ఏమంత హుషారుగా ఉండట్లేదనిపిస్తోంది. నీకూ ఏవైనా వర్రీస్ ఉన్నాయా?"

"ఎందుకుండవురా? నీదో రకం సమస్యయితే, నీ కున్నంత క్లిష్ట సమస్య కాకపోయినా నాదోరకం సమస్యుంది"

ఉత్పల్ మాటలకు ఆశ్చర్యపోయాడు రాజీవ్. "నిజంగానా? ఏవిట్రా నీ సమస్య? నిన్ను మీ అమ్మా నాన్నా చాలా బాగా చూసుకుంటారు. మీ ఇంట్లో అందరూ చాలా మంచివాళ్లు. నువ్వెంతో హాయిగా ఉన్నావని నేననుకుంటుంటానే" అన్నాడు.

ఉత్పల్ నవ్వాడు. "నా సమస్య వింటే ఇదీ ఓ సమస్యేనా అని నువ్వు నవ్వుతావేమో. నువ్వన్నట్టు మా ఇంట్లో అందరూ మంచివాళ్ళే. కానీ ప్రపంచంలో మా కుటుంబం ఒక్కటే మంచి కుటుంబం కాదు గదా"

"అంటే? నువ్వంటున్నది నాకు సరిగ్గా





అర్థం కావట్లేదు" ఉత్పల్ వైపు కుతూహలంగా చూస్తూ అన్నాడు రాజీవ్.

"మా నాన్న ఉద్దేశం మాత్రం అదే. ప్రపంచంలో తనొక్కడే మంచివాడు, నీతిపరుడు అన్నట్టు మాట్లాడతాడు. నేనాయన మాటలు మనస్ఫూర్తిగా నమ్మేవాడిని. కానీ ఈమధ్య కాస్త ప్రపంచం చూస్తున్నాను. మా నాన్న పనిచేసేదొకటే కాదు ఆఫీసు. ఇంకా చాలా ఆఫీసులున్నాయి. ఇంకా చాలామంది నీతిపరులైన ఉద్యోగులూ ఉన్నారు. నన్ను బాధించే సమస్యేమిటో చెప్పనా? నేనే మంచివాడిని. నేనొక్కడ్నే ఆనెస్ట్‌ఫెలోని అని గర్వంతో విర్రవీగిపోవడం మంచితనం ఎలా అవుతుంది? ఏవిటేవిటో మాట్లాడేస్తున్నాను. నా ప్రాబ్లెమ్ నీకర్థమవుతోందో లేదో? " ఉత్పల్ ఆగాడు.

రాజీవ్‌కి నిజంగానే నవ్వొచ్చింది. "నేను మా నాన్న అవినీతిపరుడని ఇన్నాళ్ళూ బాధపడుతుంటే, నువ్వేమో మీ నాన్న నిజాయితీపరుడేగానీ ఆ విషయంలో చాలా గర్వంగా ఉంటాడని బాధపడుతున్నావు. భలే ఉందిరా మనిద్దరి పరిస్థితి"

ఉత్పల్ కూడా మనసారా నవ్వాడు. తరువాత ఉత్పల్ ఇంకా చాలా విషయాలు చెప్పాడు. గత రెండు మూడు నెలలుగా రాజీవ్ డిప్రెస్‌డ్‌గా ఉంటూండటం తనని చాలా బాధించిందని చెప్పాడు. అతని పరిస్థితి చూసి తనెంతగా మనసు పాడుచేసేసుకున్నాడో వివరించాడు.

"నువ్వెప్పుడూ నిరాశగా డిప్రెస్‌డ్‌గా ఉంటూండడం చూస్తే నా బుర్రంతా చెడిపోయేదిరా. పైగా నువ్వేమో ఆ నీరజ్‌గాడి చక్కర్‌లో పడి డ్రింక్స్ కూడా అలవాటు చేసుకున్నావు. నిన్ను ఎలా దారిలోకి తీసుకురావాలో తెలీక బుర్ర బద్దలు కొట్టుకోవాలనిపించేది. పంకజ్‌గాడొకరోజు నువ్వూ,

నీరజ్ డ్రగ్స్ కూడా తీసుకుంటున్నట్టు అనుమానంగా ఉందని చెప్పాడు. నువ్వెలా బాగుపడతావో అన్న దిగులుతో నాకు డిప్రెషన్ ఒచ్చేసేది" అన్నాడు.

రాజీవ్‌కి కళ్లల్లో నీళ్లు తిరిగాయి. తన కోసం ఇంతగా మథన పడే స్నేహితుడిని చూస్తుంటే గుండెలో కృతజ్ఞత పొంగింది.

ఉత్పల్ మళ్ళీ చెప్పాడు. "నేను డిప్రెషన్‌తో చాలా డల్‌గా ఉంటుండడం చూసి మా పేరెంట్స్ హడిలిపోయారు. వాళ్ళకి నా బాధ ఎలా చెప్పాలో తెలిసేదికాదు. చివరికి మా నాన్నగారు నన్ను సైకియాట్రీ ప్రొఫెసర్ డా. మనస్వి దగ్గరకి తీసుకెళ్ళి చూపించారు"

రాజీవ్ ఆశ్చర్యపోయాడు. "మనస్విగారే నన్నూ ట్రీట్ చేస్తున్నారు నీకు తెలుసు కదా. ఆయన దగ్గర ఎలాంటి బాధనైనా హాయిగా వివరంగా మాట్లాడచ్చు మన ఇంట్లోవాళ్ళలాగా ఆయన విసుక్కోరు. వేళాకోళం చెయ్యరు. ఆయనతో మాట్లాడ్డంవల్ల నీకేమైనా బెనిఫిట్ కలిగిందా?" అంటూ కుతూహలంగా అడిగాడు.

ఔనన్నట్టు తలూపాడు ఉత్పల్ "డాక్టరు గారితో మాట్లాడాక నేను కొంచెం మారాను. కళ్ళు తెరుచుకుని కాస్త చుట్టూ ఉన్న ప్రపంచాన్ని అబ్జర్వ్ చేస్తున్నాను. మా నాన్న మరీ అంత గర్వపడక్కర్లేదనిపిస్తోంది" అని మళ్ళీ నవ్వాడు.

"ఇప్పుడు ఆయన గర్వం గురించి ఆలోచించి ఆలోచించి డిప్రెషన్ వచ్చేలా ఉంది" అన్నాడు.

"ఛీ ఊరుకోరా. ఆయన తన ఆనెస్టీ గురించి ఆ మాత్రం గర్వంగా ఉండడంలో తప్పేంలేదు. కానీ దాని గురించి నువ్వు దిగులుపడడం మాత్రం మోస్ట్ అన్‌రీజనబుల్" కాస్త మందలింపుగా అన్నాడు రాజీవ్?

ఉత్పల్ మనసులో కొంచెం ఆశ్చర్యపోయాడు. 'నా విషయంలో ఇది రీజనబుల్ ఇది కాదు అని ఆలోచించ గలుగుతున్నాడు. కానీ తన సొంత విషయంలో ఈ మాత్రం రీజనింగ్ పని చెయ్యలేదు వీడికి. ఏకంగా బతుకే వ్యర్థమయిపోయిందనుకుని ప్రాణం తీసుకోబోయాడు' అనుకున్నాడు.

★ ★ ★

కాలేజ్ నుంచి వచ్చాక ఆరోజు మళ్ళీ డాక్టరుగారి దగ్గరకు వెళ్ళవలసిన రోజని గుర్తొచ్చింది రాజీవ్‌కి. ఎలాగూ తల్లీతండ్రీ తనతో రారు. వాళ్ళనింక అడగదలుచుకోలేదు. సరోజనే అడిగాడు. ఇద్దరూ కలిసి మనస్వి క్లినిక్‌కి వెళ్ళారు.

ముందుగా సరోజని పిలిచి రాజీవ్ ప్రవర్తన ఎలా ఉందని అడిగాడు మనస్వి.

"చాలా ఇంప్రూవ్‌మెంటుందండీ డాక్టరుగారూ. ముఖ్యంగా మానకుండా కాలేజ్‌కి వెళ్ళాడు. ఇదివరకయితే వారంలో రెండు సార్లయినా మానేసేవాడు. ముఖ్యంగా గత రెండుమూడు నెలలుగా ఉన్న బద్ధకం అదీ వదిలి పెర్సనల్ హైజీన్‌పట్ల శ్రద్ధవహిస్తున్నాడు. నీటుగా తయారవుతున్నాడు" అంటూ సంతోషంగా రాజీవ్ గురించి వివరంగా చెప్పింది సరోజ.

తరవాత రాజీవ్‌ని లోపలకి పిలిచి అతనితో ఒంటరిగా మాట్లాడాడు మనస్వి.

కాలేజ్‌లో తన ఫ్రెండ్సందరూ తనని ఎంతో జాగ్రత్తగా సున్నితంగా చూసుకోవడం గురించి వర్ణించి చెప్పాడు రాజీవ్. అంతా చెప్పాక చిన్నగా గొంతు తగ్గించి, "మా పేరెంట్స్ నన్నెంత నిర్లక్ష్యంగా చూస్తున్నారో మా అక్క, మా ఫ్రెండ్సు నన్నంత అతిశ్రద్ధగా చూస్తున్నారు. వాళ్ళ నిర్లక్ష్యం భరించడం ఎంత కష్టమో వీళ్ళ అతి ప్రేమ భరించడం కూడా అంతే కష్టం అనిపిస్తోంది" అన్నాడు.

"నువ్వు మళ్ళీ డిస్టార్టెడ్‌గా, వంకరగా ఆలోచించడం మొదలుపెట్టావు. అది కంట్రోల్ చేసుకోవాలి. మీ పేరెంట్స్ చూపించే నిర్లక్ష్యవైఖరి ఎప్పుడూ ఉన్నదే.





నువ్వెంతో ప్రమాదం నుంచి బయట పడ్డావు కాబట్టి నిన్ను అభిమానించే వాళ్ళందరూ నిన్నెంతో డెలికేట్‌గా చూసుకోవడం సహజం. అది నువ్వు సరిగ్గా అర్థం చేసుకోవాలి. వాళ్ళ ఫీలింగ్స్ నువ్వు అర్థం చేసుకుంటే నీకు ఇరిటేషన్, డిప్రెషన్ లాంటివి కలగకుండా ఉంటాయి" అని వివరించి నచ్చచెప్పాడు మనస్వి.

రాజీవ్‌కి ఆయన చెప్పింది సమంజసంగానే కనబడింది. తనే అన్నిటికీ ఓవర్‌గా రియాక్టయి అస్తవ్యస్తంగా ఆలోచిస్తున్నాడనుకున్నాడు.

రాజీవ్ వాడుతున్న మందుల డోసుల్లో చిన్నచిన్న మార్పులు చేసి, మళ్ళీ వారానికి వచ్చి చూపించుకోమని చెప్పి పంపేశాడు మనస్వి.

★ ★ ★

ఉదయం ఠంచనుగా పదింటికల్లా మోహన్రావు ఆఫీసులో రొటీను మొదలయింది. సర్‌ప్రైజ్ చెక్‌లూ, ఇన్‌స్పెక్షన్‌లూ భయానికి ఆఫీసులో ఫుల్ ఎటెండెన్స్ ఉంటోంది.

మోహన్‌రావు, భక్తవత్సలం కలిసి ఆలోచించి, 'ప్రమోషన్‌గాడి' పనికి తమ చేతులకి బురద అంటుకోకుండా గణపతిని బలి పెట్టాలని నిశ్చయించుకున్నారు.

క్రితంరోజు గణపతిని పిలిచి "ఈ ప్రమోషన్ వ్యవహారం పూర్తిగా నీకే వదుల్తున్నాం. నీకిది ట్రెయినింగ్‌లో ప్రాక్టికల్ టెస్టులాంటిదన్నమాట. వాడి దగ్గర క్యాష్ తీసుకుని దాచి, సాయంత్రం క్లబ్బులో డిస్ట్రిబ్యూషన్ పార్టీ పెట్టాలి. ఈ పని నీట్‌గా సక్సెస్‌ఫుల్‌గా చేశావో, నువ్వు నాఅంతటి వాడివైనట్టే" అన్నాడు మోహన్రావు. ఆఫీసు సంగతుల నాలెడ్జీ, జనరల్ నాలెడ్జీ రెండూ అంతంతమాత్రంగానే ఉన్న గణపతి మోహన్రావు మాటలకు ఉబ్బిపోయాడు.

ఆరోజు మధ్యాహ్నం లంచ్ అవర్ అయి మళ్ళీ అందరూ సీట్లలో సెటిలవుతుండగా ఒక నడివయసు మనిషి మోహన్‌రావు సీటు దగ్గరకొచ్చాడు.

"నా పేరు జ్ఞానానందం. ఫలానా ఆఫీసు నుంచి వచ్చాను. నా సీనియారిటీ పక్కన పెట్టి, నా జూనియర్ నాకు రావాల్సిన ప్రమోషన్ కొట్టెయ్యాలని ప్రయత్నం చేస్తున్నట్టు రీసెంట్‌గా తెలిసింది. నేనెంతైనా ఖర్చుపెట్టడానికి సిద్ధంగా ఉన్నాను. నాకు ప్రమోషన్ వచ్చేలా చూడండి" అంటూ నేర్పుగా చేతుల మధ్య నోట్లకట్ట చూపించాడు.

మోహన్రావు ఆశ్చర్యపోయాడు 'ప్రమోషన్‌గాడొస్తాడనుకుంటే ఈ పతివ్రతగాడే దిగొచ్చాడే! వీడు నిజంగా మడికట్టుకున్న వాడు కాదన్నమాట' అనుకున్నాడు.

"నాకిది ప్రెస్టేజ్ కొశ్చన్ సార్. మీకు తెలీందేముంది. అయామ్ వెరీ కీన్ ఆన్ దిస్ ప్రమోషన్" అన్నాడు జ్ఞానానందం అభ్యర్థిస్తున్నట్టుగా మొహం పెట్టి.

అతను క్షణంసేపు మెరిపించిన నోట్లకట్ట కళ్ళని తళుక్కుమనిపించేసరికి మోహన్‌రావు ఆశగా చెయ్యి జాపబోయాడు. కానీ ఇలాంటి వ్యవహారాల్లో ఏళ్ళతరబడీ మునిగి తేలిన అనుభవంవల్ల ఏదో అనుమానం ముసిరింది మనసులో.

"ఆ పేపర్లు నేను చూడట్లేదుసార్. ఫైలంతా ఆ టేబుల్ దగ్గరుంటుంది" అని గణపతి సీటువైపు చూపించాడు. జ్ఞానానందం గణపతివైపు నడుస్తుంటే, తను కూడా లేచి రూమ్‌లోంచి బయటికి నడిచి కారిడార్‌లో ఓ మూలనుంచున్నాడు. అతనికి గణపతి టేబుల్ దగ్గర జరుగుతున్నదంతా కనిపిస్తోంది.

జ్ఞానానందం గణపతి దగ్గరకెళ్ళి మోహన్‌రావుతో చెప్పినట్టే చెప్పాడు. మొదట మోహన్‌రావులాగే గణపతి కూడా కొంచెం ఆశ్చర్యపోయాడు. డబ్బు కట్టు చూడగానే పేరాశ అతనిలో ఉన్న ఆకాస్త విచక్షణనీ మింగేసింది. ఆత్రంగా రెండు చేతులతో డబ్బుకట్టనందుకున్నాడు.



ఆ తరువాత నిముషాలమీద జరిగిపోయిన డ్రామా చూస్తుంటే దూరంగా నిలబడ్డ మోహన్రావుకి ముచ్చెమటలు పట్టాయి.

గణపతి డబ్బందుకుని సొరుగులో పెట్టగానే జ్ఞానానందం "ఇప్పుడేవస్తా" అంటూ ఎంట్రెన్స్ దగ్గరకెళ్ళి నిలబడి ఎవరికో సైగ చెయ్యడం మోహన్రావు స్పష్టంగా చూశాడు. వెంటనే నలుగురు వ్యక్తులు చకచకా లోపలికొచ్చి గణపతి టేబుల్ చుట్టూ మూగారు. వాళ్ళు గణపతి చేతులమీద ఏదో ద్రావకం రాసి నోట్లకట్టనీ చేతుల్నీ పరీక్షించి చూశారు. ఆ తరువాత గణపతిని బయటకి తీసుకెళ్ళి జీపెక్కించెయ్యడం ఆఫీసులో అందరూ నోళ్ళు తెరుచుకు చూశారు.

జ్ఞానానందం అందించిన నోట్లకట్ట బహుశ కెమికల్లీ ట్రీటెడ్ నోట్లయ్యుంటాయి. అదే కెమికల్ గణపతి చేతులమీద అంటుకుని అతను లంచం పట్టిన సంగతి స్పష్టం చేసింది.

లంచంపట్టిన నేరానికి ఎసిబి వాళ్ళు గణపతిని అరెస్ట్ చేశారన్న వార్త ఆఫీసులో అన్ని సెక్షన్లకీ అరక్షణంలో పాకిపోయింది.

తన సీట్లో బిక్కచచ్చిపోయి ముడుచుక్కూచున్న భక్తవత్సలానికి భయంతో పట్టిన చెమటలు బట్టలని తడిపేశాయి.

బుర్రలేని వెర్రిగొర్రెలా పాలిపోయిన ముఖంతో వెడుతున్న గణపతి రాజీవ్ కాలేజీకి పక్కనున్న స్కూల్లో చదువుతున్న బాలుకి తండ్రి. రాజీవ్‌కి బాలు తెలుసుకానీ గణపతి తెలీదు.

★ ★ ★

మోహన్రావు మూడు రోజులపాటు సాయంత్రాలు ఎటూ వెళ్ళకుండా ఇంట్లోనే కూచోడం సరోజ, రాజీవ్‌లకు వింతగా ఉంది. 'మీరు మరీ విస్తుపోనక్కర్లేదు. నేను పూర్తిగా మారిపోలేదు' అని చాటించడానికన్నట్టు ఇంట్లోనే ఉన్నా సీసాలు తోడుగా తెచ్చుకున్నాడు. ఇంట్లో తాగుతూ కూచునేవాడు.

ఆ మూడు రోజులూ ఆఫీసునుంచి ఇంటికొచ్చిన దగ్గరనుంచీ ఎవరెవరికో ఫోన్లు చెయ్యడం, ఫోన్లో చిన్న గొంతుతో గుసగుసగా మాట్లాడడం అదే కాలక్షేపంగా పెట్టుకున్నాడు మోహన్రావు. ఒక చేతిలో మందు గ్లాసు, మరో చేతిలో ఫోనుతో రోజులు గడిపేశాడు మోహన్రావు.

లీల మోహన్రావెత్తిన ఈ కొత్త అవతారాన్ని అంతగా పట్టించుకోలేదు. తన 'కష్టా'ల్లో తను మునిగిపోయింది. మినిస్టరుగారొస్తారని రెక్కలు ముక్కలు చేసుకుని కొంత సొంత డబ్బు ఖర్చుపెట్టి మరీ క్లబ్బు బిల్డింగుని కళ్యాణ మండపంకన్నా అందంగా తీర్చిదిద్దింది. తీరా మంత్రిణిగారొచ్చేసరికి ఆవిడ చుట్టూ పెద్ద పెద్ద ప్రముఖుల సతీమణులూ, బిజినెస్ మాగ్నెట్ల భార్యారత్నాలు తదితర విఐపిలు మూగిపోయారు. మినిస్టర్‌గారికి పరిచయం చేస్తానని ప్రామిస్ చేసిన ప్రెసిడెంటు వర్ధనమ్మ ఒకటి రెండు సార్లు లీల పేరు గట్టిగా పిలిచి తన కర్తవ్యం తను నిర్వర్తించింది. అందర్నీ తోసుకుంటూ, తోయబడ్డవాళ్ళ తిట్లూ, శాపనార్థాలూ వింటూ లీల మంత్రిణిగారికి కాస్తంత దగ్గరగా వెళ్ళగలిగింది కూడా. కానీ సరిగ్గా అదే సమయానికి మంత్రిణిగారు తిరిగి వెళ్ళిపోయే క్షణాలొచ్చేశాయి.

మినిస్టరుగారు పదినిముషాల్లో క్లబ్బు కొత్త స్పోర్ట్స్ రూమ్ రిబ్బను కత్తిరించడం, లాంఛనంగా కూల్‌డ్రింక్ తీసుకుని టీపార్టీ ప్రారంభించడంలాంటి అతి ముఖ్యమైన విధులు నిర్వహిస్తూ బొంగరంలా క్లబ్బంతా తిరుగుతూనే ఉంది. ఆవిడ చుట్టూ దట్టంగా దడికట్టిన విఐపి లేడీస్ ఒక్కరు కూడా లీలకి దారినివ్వలేదు. పరిచయం కాదుకదా మంత్రిణి లీలవైపు చూడనైనా చూడలేదు.

ఒళ్ళు మండిపోయింది లీలకి. ఆ




మర్నాడు ప్రెసిడెంటు వర్ధనమ్మగార్ని నిల దీసి అడిగింది. ఆవిడ చాలా పెద్ద వ్యాపారస్థుడి భార్య. అయినా కొంచెం మెతక మనిషి. ఆవిడ భర్తవల్ల భారీగా విరాళాలొచ్చిపడతాయి కాబట్టి మిగతా మహిళలందరూ కలిసి ప్రెసిడెంటుగిరీ కట్టబెట్టారావిడకి. ఆవిడని వొదిలిపెట్టేస్తే పూజలూ భజన్లూ చేసుకుంటూ క్రిష్ణారామా అనుకుంటూ గడిపే రకంలాగా కనిపిస్తుంది.

గుడ్లల్లో నీళ్ళు కుక్కుకుంటూ లీల ఉక్రోషంగా అడుగుతుంటే ఆవిడక్కాస్త జాలేసింది. "నిన్ను పిలిచానమ్మా లీలా! మంత్రిగారికి పరిచయం చేద్దామని. నువ్వప్పుడక్కడ లేవు మరి" అంది. ఆవిడ ఆ మాత్రం తగ్గి మాటాడేసరికి లీలకి ఆవేశం పెరిగిపోయింది.

"నేనక్కడే ఉన్నాను మేడమ్! కానీ మిసెస్ మల్‌హోత్రా, మిసెస్ చౌదరీ వీళ్ళంతా మూగిపోయి నన్ను అసలా చాయలకే రానివ్వలేదు. నేను పడ్డ కష్టానికిదేనా ఫలితం?" అంది గొంతు పెంచేసి.

అక్కడే కూచుని వీళ్ళ మాటల్ని వింటున్న సెక్రటరీ మిసెస్ సహానీ గయ్‌మని లేచింది. "వాట్ లీలా! నీకు జాయింట్ సెక్రటరీషిప్ రావడమే గ్రేట్. నువ్వందుకు గ్రేట్‌ఫుల్‌గా పడుండాలిగానీ ప్రెసిడెంట్ మేడమ్‌నే కొశ్చన్ చేస్తావా?" అంటూ ఏమాత్రం సానుభూతి లేకుండా నోరు పారేసుకుంది.

లీల ఊరుకోకుండా తిరగబడింది. మాటామాటా పెరిగి పెద్ద గొడవయింది. మిగతా వాళ్ళు కల్పించుకుని ఆరోజుకి సద్దేశారు. కానీ రెండ్రోజుల్లో ఈ విషయం అందరినోళ్ళల్లోనూ నలిగి చిలికి చిలికి గాలివానైంది. హైయర్ స్టేటస్ వాళ్ళందరూ కూడారు. డబ్బుకట్టారు కదా అని చిన్న ఉద్యోగస్తుల పెళ్ళాలకి మెంబర్‌షిప్ ఇవ్వడంవల్లనే ఇలాంటి గొడవలువస్తాయని తీర్మానించారు. లీల మెంబర్‌షిప్ క్యాన్సిల్ చెయ్యాలనీ, ఇక ముందు ఇలాంటి వాళ్ళకి సభ్యత్వం ఇవ్వకూడదనీ వాదించారు.

అయితే క్లబ్బులో సెక్రటరీ సహానీ అంటే పడని వాళ్ళంతా ఏకమైకూడారు. ఆ వర్గం మహిళలు లీలకి సపోర్టిచ్చి గొడవ మొదలెట్టారు. వాళ్ళకి లీల సభ్యత్వం నిలబెట్టడం కన్నా మిసెస్ సహానీని అల్లరిపెట్టడమే ముఖ్యోద్దేశం.

మిసెస్ సహానీ సెక్రటరీగా ఉన్నప్పుడే క్లబ్బులో గొడవలు జరుగుతున్నాయని నిరూపించి ఆవిడని పదవి నుంచి దించెయ్యడానికి లీల ఇస్యూని కారణంగా వాడుకోవాలని వాళ్ళ ప్రణాళిక.

సంఘంలో ప్రముఖులైన ఇంతమంది వనితలు తనకు సపోర్టు రావడం లీలని చాలా ఆనందపరిచింది. వాళ్ళు రమ్మని పిలిచినపుడల్లా వాళ్ళ ఇళ్ళకి వెళ్ళి హాజరవుతూ పొద్దున్నించీ రాత్రిదాకా ఒకటే బిజీగా ఉంది మూడురోజులపాటు. మోహన్‌రావు బయటకెళ్ళకుండా ఇంట్లోనే ఎందుకుంటున్నాడో ఫోనులో ఏ గూడుపుఠాణీలు జరుపుతున్నాడో తెలుసుకోవాలన్న కోరిక, అసలు తీరికా లేకుండా పోయాయి లీలకి.

భార్యాభర్తలిద్దరూ ఎవరి గొడవల్లోవారు ఎవరి లోకంలోవారు మరో ధ్యాసలేకుండా పూర్తిగా నాలుగు రోజులు గడిపేశారు.

★ ★ ★

తల్లి ఓ పక్కన ఇల్లు పట్టకుండా తిరుగుతుంటే, మరో పక్కన తండ్రి ఇల్లు వదలకుండా మందు సేవనంలో మునిగి తేలుతుండడం ఇదంతా చివరికి ఎందులోకి దింపుతుందో, ఏ తుపానొచ్చి పడుతుందో అని భయపడ్డారు సరోజ, రాజీవ్. ఏదైనా గొడవ జరిగితే అసలు రాజీవ్ మనఃస్థితి మళ్ళీ మొదటికొస్తుందేమోనని హడలిపోయింది సరోజ.

పిల్లలిద్దరూ భయపడ్డట్టే అయిదోరోజు పొద్దున్నకల్లా లీల తండ్రి అప్పలనర్సయ్య రూపంలో వచ్చిపడింది ఇంట్లో తుపాను.



పొద్దున్న ఎనిమిదిన్నరకల్లా ఇంటిముందు దిగారు అప్పలనర్సయ్యా, భార్య మణెమ్మ.

అప్పటికే స్నానాలు చేసి టిఫిన్ తింటూ డైనింగ్‌టేబుల్ దగ్గర కూచున్న సరోజ, రాజీవ్‌లిద్దరూ బిగుసుకుపోయారు లోపలి కొస్తున్న అమ్మమ్మ, తాతలని చూడగానే.

"ఏరా బాగున్నారా? ఏంట్రా నువ్వేదో పెద్ద సాహసం చేసి ప్రాణాల్తో బయటపడ్డా వని మొన్న ఫోన్లో మీయమ్మ చెప్పిందే" అని మొరటుగా అడిగి అదేదో పెద్ద హాస్యం అన్నట్టు గట్టిగా అట్టహాసంగా నర్సయ్య నవ్వుతుంటే ఎర్రబడ్డ మొహంతో రాజీవ్ ముడుచుకుపోయాడు. సరోజ తాత వైపు కోపంగా చూసింది. అలా మాటాడవ ద్దని అనడానికి మాత్రం ఆ పిల్లకి ధైర్యం చాలలేదు.

నర్సయ్య గొంతువిని మేలుకున్నారు కాబోలు, పాచిమొహంతో లీల, ఉబ్బి ఎర్రగా భీకరంగా కనిపిస్తున్న కళ్ళతో మోహనరావు గదిలోంచి బయటకొచ్చారు.

"ఏంటల్లుడూ నన్ను రమ్మని నువ్వింకా నిద్రపోతున్నావ్? అసలింతకీ ఇప్పుడు కార మ్మేయాల్సిన అవసరం ఏమొచ్చింది?" అన్నాడు పెద్ద గొంతుతో నర్సయ్య.

"ఏవిటీ? కారమ్మేస్తున్నారా? ఎందుకూ?" కీచుగొంతుతో కేకపెట్టింది లీల.

"కంగారుపడకు. అంతా చెప్తాలే. నువ్వెళ్ళి మొహం కడుక్కో. మావయ్యా, అత్తయ్యా, మీరూ స్నానాలూ గట్రా కాని వ్వండి. టిఫిన్ చేస్తూ మాటాడుకోవచ్చు" అన్నాడు మోహనరావు. లీల, మణెమ్మ లోపలికెళ్ళారు.

"టిఫిన్ తినడానికి స్నానం ఎందుక ల్లుడూ? నువ్వు కానిచ్చుకురా. నేను రైల్లోనే పళ్ళు తోమేశాలే. ముసలయ్యా ఏం టిఫిను చేశావీరోజు? మనకో ప్లేటట్టుకురా" అని కేకలు పెడ్తూ డైనింగ్ టేబుల్ దగ్గరకొచ్చి కూచున్నాడు నర్సయ్య.

రాజీవ్, సరోజ టక్కున లేచి చేతులు కడి గేసుకున్నారు. గట్టిగా అరిచి మాటాడుతూ, ప్రపంచంలో వ్యవహారాలన్నీ తనే నడిపిస్తు న్నానన్నట్టు గప్పాలు కొడుతూ అల్లుడికి తగ్గ మామలా హడావిడి చేసే తాతంటే అక్కాతమ్ముళ్ళిద్దరికీ ఇష్టంలేదు.

"పులికడుపున పిల్లిపిల్లలు పుట్టినట్టు ఇలాంటి ముంగిపిల్లల్ని కన్నావేంట ల్లుడూ?" అంటుంటాడు నర్సయ్య పెద్దల్ని తప్పించుకు తిరుగుతూ ముభావంగా ఉండే మనవల్నిద్దర్నీ చూస్తూ.

అతని మాటలంటే రాజీవ్‌కి అస్సలు పడదు. 'ఒకళ్ళకొకళ్ళు ఇంతలా మ్యాచ్ అయిపోయే మామాఅల్లుళ్ళు వీళ్ళు తప్ప ఇంకెవరూ ఉండరు' అనుకుంటుంటాడు మనసులో.

సరోజ గదిలోకి వెళ్ళి "నాకివాళ ఫస్ట్ పీరి యడ్ ఖాళీ. నిన్ను మీ కాలేజ్ దగ్గర డ్రాప్ చేసి వెళ్తాను. వస్తావా?" అన్నాడు రాజీవ్. అతనికి వీలయినంత తొందరగా ఇంట్లోంచి బయటపడాలనుంది. సరోజని ఇదివరకె ప్పుడూ కాలేజ్ దగ్గర దింపుతాననలేద తను. అతని డ్రైవింగ్‌లో స్కూటరెప్పుడూ ఎక్కలేదు సరోజ. 'ఎలా డ్రైవ్ చేస్తాడో'నన్న భయం మనసులో పీకుతున్నా, "సరేపద" అంటూ బయల్దేరింది.

'ఇన్నాళ్ళకి నార్మల్ అక్కాతమ్ముళ్ళలాగా ఒకరి సంగతులొకరం పట్టించుకుంటూ ఒక ళ్ళకొకళ్ళం హెల్ప్ చేసుకుంటున్నాం. అమ్మానాన్నల్లో కూడా కాస్త మార్పొస్తే బాగుండును. ఆ కారేదో అమ్మేస్తానంటు న్నాడుగా. కారు లేకపోతే అమ్మ తిరుగుళ్ళు తగ్గుతాయేమో. కాస్త ఇంటిపట్టున ఉంటే అమ్మలో మార్పొస్తుంది' అని ఆలోచించింది సరోజ స్కూటర్ మీద వెడుతున్నంతసేపూ.

రాజీవ్ ఆలోచనలు కూడా ఇంచుమిం చుగా అదే ధోరణిలో సాగాయి. 'ఇప్పుడీ సర్పంచ్ తాత ఎందుకొచ్చినట్టు? మామాఅ ల్లుడూ కలసి చెయ్యబోతున్న రాజకీయం ఏమిటో?' అన్న ప్రశ్నలు అతన్ని వేధిం

చాయి.

స్కూటర్ దిగి 'బై' చెప్పేసి కాలేజ్‌లోకి వెడుతున్న సరోజని చూస్తుంటే జాలేసింది రాజీవ్‌కి. మిగతా అమ్మాయిలకీ, సరోజకీ ఎంతో తేడా ఉన్నట్టనిపించింది రాజీవ్‌కి. 'వాళ్ళందరూ ఉన్నంత ఫ్రీగా ఎప్పటికీ ఉండలేదేమో అక్క. నేను కూడా ఇన్నాళ్ళూ అక్కని సరిగ్గా పట్టించుకోకుండా తప్పుచేశానేమో' అనుకున్నాడు.

తను నర్సింగ్‌హోమ్‌లో ఉన్నన్నాళ్ళూ తనకోసం రోజూ సరోజ రావడం గుర్తొచ్చింది. ఇద్దరూ ఎక్కువగా మాటాడుకోకపోయినా తను ఒంటరితనం ఫీలవకుండా కంపెనీ ఇచ్చింది. తల్లిదండ్రులకన్నా ఎక్కువగా తనమీద శ్రద్ధ తీసుకుంది. ఇన్నాళ్ళూ అక్క మనసు తెలుసుకోకుండా తను చాలా తప్పుచేశానని మళ్ళీ అనుకున్నాడు. ఇప్పుడైనా తను ఆత్మహత్యా ప్రయత్నం చెయ్యక పోతే ఇద్దరూ ఎప్పటికీ దగ్గరయ్యేవారు కాదేమోనన్న ఆలోచన కూడా వచ్చింది.

'ఏమిటో. జీవితం మొత్తం ఆత్మహత్యకు ముందూ, ఆత్మహత్య తరువాత అన్న రెండు భాగాలుగా కనిపిస్తోంది. అన్ని విషయాల్లోనూ తేడా కనిపిస్తోంది. కానీ అమ్మానాన్నల్లో మాత్రం ఆత్మహత్యలూ, హత్యలూ ఎన్ని జరిగినా మార్పురాదు' అనుకుని నిట్టూరుస్తూ తన కాలేజ్‌వైపు స్కూటర్ మళ్ళించాడు రాజీవ్.

★ ★ ★

కాలేజీ గేటుముందు స్కూటరు దిగి తలొంచుకుని క్లాసురూమ్‌వైపు నడుస్తున్న సరోజకు చుట్టుపక్కల గుంపులు గుంపులుగా నిలబడి కబుర్లు చెప్పుకుంటున్న అమ్మాయిలు తనవైపు వింతగా చూస్తున్నట్టనిపించింది. అసలు సరోజకి ఎప్పుడూ అలాగే అనిపిస్తుంది. కాలేజ్‌లో కడుగుపెట్టినప్పుడల్లా ఎవరితోనూ ఎప్పుడూ తలెత్తి మాట్లాడదు. సరదాగా కబుర్లు చెప్పుకునేంత స్నేహం ఎవ్వరితోనూ లేదు.

ఇంటి దగ్గర తల్లి పెట్టే చివాట్లూ, తన మెతకదనం పట్ల ఆవిడ ప్రదర్శించే విసుగూ సరోజనెప్పుడూ వెంటాడుతూనే ఉంటాయి. దానివల్లనే తను తన సాటివారికన్నా ఎంతో తక్కువదానినన్న న్యూనతా భావం. సరోజలోని ఒంటరితనం, పిరికితనం నలుగురిలోకి వచ్చినప్పుడు ఎక్కువవుతూ ఉంటుంది. కాలేజ్‌లో ఎవరైనా అమ్మాయిలు సరోజని పలకరించి, మాటల్లో పెట్టడానికి ప్రయత్నించినా ఏం మాట్లాడాలో తెలీక తత్తరపాటుగా సమాధానాలిచ్చి నవ్వుల పాలవుతూండడం కూడా సరోజకి పరిపాటే. తలెత్తి ఎవరి ముఖంలోకైనా చూస్తే వాళ్ళేం అడుగుతారో ఏం మాట్లాడాలో అన్న భయంతో తలొంచుకుని ఎవరివంకా చూడకుండా క్లాసులోకిపోయి కూచోవడం అలవాటు చేసేసుకుంది సరోజ.

తను మాట్లాడకపోయినా ఇతరులు మాట్లాడేమాటలు చెవిని పడుతూనే ఉంటాయి. అలాగే క్లాసులో సిసింద్రీలా ఎగిరిపడుతూండే శీలా మాటలు చెవిని పడ్డాయి.

"మన బి.బి. ఇవాళ ఎవడో బోయ్ ఫ్రెండు స్కూటరుమీద కాలేజీకి వేంచేసిందేవ్. నోట్లో నాలుకలేదుగానీ బుర్ర మహాగట్టిది" అంటోంది శీలా.

సరోజకి 'బి.బి.' అనేది శీలాలాంటి గడుగ్గాయిలంతా కలిసి తనకి పెట్టిన నిక్‌నేమ్ అని తెలుసు. 'బి.బి.' అంటే 'బితుకు బితుకు' అని అర్థం. తనెప్పుడూ పిరికిగా బితుకు బితుకుమంటూ బతుకుతూంటుందని వాళ్ళు గ్రహించి ఆ పేరు పెట్టారనీ తెలుసు. తనకి తెలియదనుకుని ఆ నిక్‌నేమ్ ఉపయోగించి తన గురించి తనకి వినపడేలాగానే ఇష్టం వచ్చినట్టు వాళ్ళు మాట్లాడడం చాలాసార్లు గ్రహించింది సరోజ. కానీ ఎప్పుడూ వాళ్ళకి తగ్గ సమాధానం చెప్పి నోరు మూయించాలన్న ఊహ

కూడా సరోజకి రాలేదు. కానీ ఇవాళ ఊర్కోలేకపోయింది.

గిరుక్కున వెనక్కి తిరిగి, "నేనొచ్చింది బోయ్‌ఫ్రెండ్ స్కూటర్ మీద కాదు. మా తమ్ముడి స్కూటర్‌మీద" అంది. ఇంకా ఏమేమో అని శీలాని నిలువునా కడిగెయ్యాలనిపించింది కానీ ఏమీ అనలేకపోయింది.

సరోజ ఆమాత్రం మాట్లాడ్తుందని ఎక్స్‌పెక్ట్ చెయ్యని శీలా కొంచెం షాక్ తింది. ఆమె పక్కనున్న బీనా మాత్రం "సారీ సరోజా. శీలా తెలీక ఏదో వాగుతుందిలే పట్టించుకోకు. వెరీ సారీ" అంది.

బీనాకేసి చిన్నగా నవ్వుతూ చూసి తనదారిన తను పోతున్న సరోజకి మళ్ళీ శీలా గొంతు వినిపించింది.

"హమ్మో. ముంగిలా ఉంటుందిగానీ నెరజాణ. ఏమో అనుకున్నా" అంటోంది శీలా.

సరోజ ఆగి వెనక్కి తిరిగింది. రెండడుగులు వేసి శీలా పక్కన నిలబడింది. బిత్తరపోతూ శీలా రెండడుగులు వెనక్కి వేసింది.

"నువ్వెన్నాళ్ళూ అనుకుంటున్నట్టు నేను ముంగినవడం నిజమే. మా తమ్ముణ్ణి తమ్ముడు అని ఖచ్చితంగా చెప్పినంత మాత్రాన నేనొక నెరజాణనని డిసైడ్ చేసెయ్యడం అన్యాయం శీలా. అబ్బాయితో కలిసి స్కూటరెక్కినంత మాత్రాన వాడ్ని బోయ్‌ఫ్రెండుగా ఊహించుకున్నావంటే మాత్రం నువ్వు చాలా అమాయకురాలివని పిస్తోంది. ఏదో నెరజాణలా అల్లరిచేసి కాలేజీనంతా అదరగొడ్తావుగానీ నువ్వు నిజంగా మనసులో ముంగివోయ్ శీలా!" అంది సరోజ చిరునవ్వు చెదరకుండా. అనేశాక తనేనా ఇన్ని మాటలు మాట్లాడింది అని మనసులో ఆశ్చర్యపోయింది కూడా.

అవాక్కయిపోయి సరోజ మాటలు విన్న శీలా ఉక్రోషంతో బుంగమూతి పెట్టుకు నిలబడిపోయింది. బీనా మాత్రం పకపకా నవ్వేసింది. "అయిందా పెళ్ళి? అసలు సిసలు ముంగివీ, బీబీవీ నువ్వేనని ప్రూవ్ చేసేసింది సరోజ. బలే చెప్పావు సరోజా! అసలు నువ్వింత చక్కగా మాటకి మాట చెప్పగలవని ఇన్నాళ్ళూ మాకెవరికీ తెలీనే తెలీదు. అందుకే ఈ శీలమ్మలాంటివాళ్ళు రెచ్చిపోతున్నారు" అంది.

"ఇన్నాళ్ళూ నేనీ మాత్రం మాట్లాడగలనని నాకూ తెలీదులే" అంది సరోజ మనసారా నవ్వేస్తూ.

తను ఒక్కసారిగా ఈ రకంగా రిలాక్స్ అయి మిగతా పిల్లలతో సమానంగా కాకపోయినా కొంతైనా ధైర్యంగా నలుగురితోనూ ఈరోజు మాట్లాడగలగడానికి కారణం సరోజకి మనసులో అంతర్గతంగా అవగతమవుతూనే ఉంది.

రాజీవ్ ఆత్మహత్యా ప్రయత్నం తన మామూలు అనామకపు జీవితాన్ని ఒక్క కుదుపు కుదిపింది. వాడు అపస్మారకస్థితిలో పడున్నప్పుడు ఆస్పత్రికి తనే తీసుకువెళ్ళి చేర్పించడం, తల్లిదండ్రులు తప్పించుకు తిరిగినా డాక్టరుగారితో వాడి గురించి మాట్లాడి, మందులు వెయ్యడం వంటి బాధ్యతలు నిర్వర్తిస్తుంటే సరోజకి బెరుకు, పిరికితనం మాయమయి వాటిస్థానే ఆత్మవిశ్వాసం కొద్దికొద్దిగా ఏర్పడింది. తనూ కొన్ని బాధ్యతలు నిర్దుష్టంగా నిర్వహించగలనన్న ధైర్యం వచ్చింది.

కాకపోతే సరోజకు ఒక్క విషయమే చాలా బాధ కలిగిస్తోంది. తన మనసుకు చిన్నతనంలోనే పడ్డ ఆత్మన్యూనతాభావం అన్న సంకెళ్ళు విడివడి స్వేచ్ఛగా ఆలోచించగలిగే ధైర్యం రావడానికి తమ్ముడు చావుకి సిద్ధపడడంలాంటి భయానకమైన సంఘటన జరగవలసొచ్చింది. ఆ ఆలోచన సరోజకు మనసులో ముల్లులా గుచ్చుకుంటూనే ఉంది.

ఏదిఏమైనా ఇవాళ శీలాలాంటి సీమటపాకాయకి మాటకి మాట బదులిచ్చి తను చేసిన అపూర్వసాహసం సరోజని చాలా





సంతోషపెట్టింది. 'ఇంక కాలేజీలో ఎవరితో నైనా సరే ముఖంలోకి సూటిగా చూసి మాట్లాడెయ్యగలను. నేను చలాకీగా ఉంటే నాకూమంచి మంచి స్నేహితులు దొరుకు తారు' అనుకుంది ఆనందంగా.

అయితే సరోజ సంబరం ఆట్టేసేపు నిల వలేదు. సరోజలాంటి పిరిగ్గొడ్డు తనకెదురు సమాధానం చెప్పేసరికి షీలా అహం దెబ్బ తింది. ఉడుకుమోత్తనంతో వికారంగా ముడుచుకుపోయిన ముఖాన్ని ముప్పైవం కర్లు తిప్పుతూ,

"ఓయబ్బో మాకూ తెలుసు ఈ తమ్ముళ్ళూ అన్నలూ వరసలు కలిపి కోతలు కోసెయ్యడం. ఎవరెవరితోనో తిరగడం ఎవ రంటే కజిన్ కజిన్ అని కుయ్యడం! కూతలు ముదిరి ఏకంగా తమ్ముడనే చెప్పే స్తోంది. ఇన్నాళ్ళూ లేని తమ్ముడిప్పుడెక్క డ్నించి సడన్‌గా ఊడిపడ్డాడు? తక్కుతూ తారుతూ మూడేళ్ళ బియ్యే నాలుగేళ్ళుగా ఈ కాలేజీలోనే చదువుతున్నావు. మరి ఇవాళే కొత్తగా తమ్ముడు పుట్టుకొచ్చాడే!" గొంతు పెంచి పెద్ద దెబ్బలాట మొదలె ట్టింది షీలా.

సరోజ, బీనా ఈ కొత్త ఎటాక్ విని స్టన్ అయిపోయారు. ముందుగా తేరుకున్న బీనా, "ఛీ... ఛీ... ఏంటి షీలా అంత అస హ్యంగా మాట్లాడ్తావు? సరోజెంత చక్కగా మాట్లాడిందీ నువ్వెంత వల్గర్‌గా మాట్లాడ్తు న్నావు? " అంది.

బీనా మాటలకి షీలా ఎంత ఘాటుగా సమాధానం చెప్పేదో ఏమోగానీ ఇంతలో మరో వింత జరిగింది.

వయసు మళ్ళిన దంపతులిద్దరు ఆయాస పడుతూ, సరోజా వాళ్ళున్నవైపు పరుగుపె డుతూ వచ్చారు.

"ఎందుకే షీలా మమ్మల్నిలా ఏడిపి స్తావు? మీ అమ్మకి మేం ఏమని చెప్పాలే? " అంటూ ఏడుస్తోంది పెద్దావిడ షీలాని వాటేసుకుని.

"చేసిన వెధవ నిర్వాకాలు చాలు ఇంటికి పద" కేక పెట్టాడు ముసలాయన కోపంగా.

ముసలావిడ చేతుల్ని విదిలించేసి దూరంగా జరిగిపోయింది షీలా. "నేను మీతో రానుపొండి. వెధవ ముసలిగోలా మీరూను. అసలు కాలేజీలోకెందుకొ చ్చారు? ఇక్కడిలా గొడవ చేస్తే ప్రిన్సిపాల్ మేడమ్ వాచ్‌మెన్ చేత మెడపట్టుకు గెంటి స్తారు. అప్పటిగ్గానీ మీ తిక్క కుదరదు" పెద్దవాళ్ళన్న గౌరవం కాదుకదా వాళ్ళమీద జాలైనా లేకుండా నోరు చేసుకుంది షీలా.

అప్పటికే చాలామంది అమ్మాయిలు వింత చూడ్డానికి చుట్టూ చేరారు. గొడవ గమనించి ప్రిన్సిపాల్, ఇతర స్టాఫ్ మెంబర్సూ వచ్చారు. మూగిన పిల్లలు తప్పుకుని వాళ్ళకి దారిచ్చారు.

"వాటీజ్ హాపెనింగ్? ఎవరు వీళ్ళు? ఏమిటి గొడవ? " అంది ప్రిన్సిపాల్ మేడమ్. పిల్లలంతా నిశ్శబ్దంగా నిలబడ్డారు. "ఎవరండీ మీరు? ఇక్కడెందుకు గొడవ చేస్తున్నారు? " మళ్ళీ అడిగిందావిడ.

"ఈ షీలా మా మనవరాలండి" అంది పెద్దావిడ దుఃఖంతో పూడుకుపోతున్న గొంతుతో.

"సో? అయితే ఏమిటి? మీకూ మీకూ ఏవైనా గొడవలుంటే మీ ఇంట్లో తేల్చు కోండి. ఇలా కాలేజ్‌కొచ్చి డిస్టర్బ్ చెయ్య కండి" కటువుగా చెప్పింది ప్రిన్సిపాల్.

"ఇంటి విషయాలు ఇంట్లోనే తేల్చుకోవా లని మాకూ తెలుసు. కానీ ఈ మహాతల్లి ఇంటికొచ్చి మూడు రోజులయింది. ఇవాళ ఇక్కడ పట్టుకున్నాం" అన్నాడు షీలా తాత గారు కోపంగా.

సంగతేదో చాలా సీరియస్ అని గ్రహిం చింది ప్రిన్స్‌పాల్. చుట్టూ మూగిన పిల్లల కేసి చూస్తూ, "నౌ గర్ల్స్... ఆల్ ఆఫ్ యూ గోటు యువర్ క్లాసెస్. కమాన్... డిస్ పర్స్... నాకు కాంపౌండ్‌లో చెట్లకింద ఒక్కళ్ళు కూడా కనిపించకూడదు.

వెళ్ళండి... వెళ్ళండి" అని పిల్లలందర్నీ తరిమేసి "శీలా నా రూమ్‌కి పద. మీరిద్దరూ కూడా రండి" అని శీలాని, ఆమె తాతా అమ్మమ్మల్ని తన రూమ్‌లోకి తీసుకుపోయింది.

అమ్మాయిలందరూ గుసగుసలాడుకుంటూ ప్రిన్స్‌పాల్ రూమ్‌వైపు నడుస్తున్న శీలాకేసి వెనక్కి వెనక్కి తిరిగిచూస్తూ క్లాసులవైపు నడిచారు. సరోజ, బీనా కూడా కదిలారు.

"ఏవిటీ బీనా ఈ గొడవ?" నెమ్మదిగా అడిగింది సరోజ.

"లంచవర్లో బయట కేంటీన్‌కెడదాం. అక్కడ చెపుతాలే" అంది బీనా.

కాంటీన్లో కూచుని బీనా చెప్పిన శీలా కథ వింటూంటే ఇది నిజమా? ఇలా కూడా జరుగుతుందా? అని ఆశ్చర్యపోయింది సరోజ.

బీనా తల్లి, శీలా తల్లి మొన్నమొన్నటి దాకా ఒక ప్రభుత్వాస్పత్రిలో నర్సులుగా పనిచేసేవారు. శీలా తండ్రి అదే ఆస్పత్రిలో టెక్నీషియన్. బీనాకి తండ్రిలేడు.

శీలా తల్లి, తండ్రి, బీనా తల్లి విశ్వప్రయత్నాలు చేసి గల్ఫ్‌లో ఉద్యోగాలు సంపాదించారు. నాలుగు డబ్బులు కూడబెట్టుకుని తమకీ పిల్లలకీ కాస్త మంచి భవిష్యత్తు నిర్మించుకోవాలన్న చిన్న ఆశతో వాళ్ళు ముగ్గురూ విధేశాలకి వెళ్ళారు.

బీనా మేనమామగారింట్లో ఉండి చదువుకుంటోంది. శీలా తల్లి తమ ఊరినుంచి తన తల్లిదండ్రుల్ని పిలిపించి శీలాకి సాయంగా ఉండమంది.

బీనా స్వతహాగా కుదురైన పిల్ల కాబట్టి తల్లి పంపుతున్న డబ్బు జాగ్రత్తగా ఖర్చుపెట్టుకుంటూ తనేమో తన చదువేమో అన్నట్టు కాలం గడుపుతోంది.

అయితే శీలా స్వభావం అందుకు పూర్తిగా భిన్నమైనది. తల్లీదండ్రీ విదేశాల్లో ఉద్యోగాలకి వెళ్ళకముందు కూడా తాహతుకు మించిన కోరికలూ, షోకులూ పెంచుకుని తల్లిని విసిగించేది. ఇంక ఇప్పుడు డబ్బుకి ఇబ్బందిలేదు. తల్లి ఫోను చేసినప్పుడల్లా గారంగా గొంతుపెట్టి ఎంతడిగితే అంత పంపుతుంది. అమ్మమ్మ, తాతయ్యల దగ్గర భయం అసలేలేదు. నెమ్మదినెమ్మదిగా విచ్చలవిడి జీవితానికి అలవాటుపడింది.

చిన్న స్కూటీ వేసుకు రోడ్లట్టుకు తిరుగుతూ బోయ్ ఫ్రెండ్సుని సంపాదించింది. అందర్లోకి మురళి అనేవాడు శీలా కన్నా విలాస పురుషుడు. అతనితో ఈమధ్య ఎక్కువగా తిరుగుతోంది శీలా. ఆ విషయం బీనాలాంటి కొద్దిపాటి ఫ్రెండ్స్‌కే కాక అమ్మమ్మ, తాతలకు కూడా తెలుసు. కానీ వాళ్ళు చేసేదేమీలేదు. అప్పుడప్పుడు ఆ పిల్లని కోప్పడడం ఆ పిల్ల వాళ్ళని ఎదిరించి గొడవచెయ్యడం తప్ప ఆ ముసలివాళ్ళు శీలాని ఏవిధంగానూ అదుపులో పెట్టలేక పోతున్నారు.

ఆ మురళి అన్న కుర్రాడు ఎన్ఆర్ఐ పుత్రుడు. అతని తల్లిదండ్రులిద్దరూ చాలా కాలం ఇండియాలోనే ఉద్యోగాలు చేసేవారు. తరువాత మంచి అవకాశాలు వచ్చి అమెరికాలో సైంటిస్టులుగా వెళ్ళారు. అప్పటికి మురళి కాలేజీ చదువుకొచ్చాడు. డాలర్లు ఖర్చుపెట్టి స్థానిక ప్రైవేటు ఇంజనీరింగ్ కాలేజీలో ఎన్ఆర్ఐ కోటాలో అతనికి సీటుసంపాదించి చేర్పించి వెళ్ళారు.

అయితే పండితపుత్రుడు సామెత ప్రకారం మురళి చదువులో శుంఠ అవడమే కాక విలాసాల్లో పండితుడయ్యాడు. శీలాకి మురళికి మహబాగా కుదిరిపోయింది. ఇద్దరికీ సరదాలమీద తప్ప చదువుమీదగానీ, పెళ్ళిమీదగానీ ఏమాత్రం ఆలోచనలేదు. స్నేహితులతో కాలక్షేపానికి వెళ్ళడం, కుదిరినప్పుడల్లా ఇద్దరూ కలిసి టింగు రంగామంటూ తిరగడం మరిగారు.

హాస్టల్లో చదువు సరిగా సాగదని చెప్పి తల్లిని మభ్యపెట్టి మురళి చిన్నఫ్లాట్ ఒకటి

అద్దెకి తీసుకున్నాడు. అక్కడ షీలా మురళిల స్వేచ్ఛ హద్దులు మీరింది.

ఆ విషయమై షీలా అమ్మమ్మ, తాత బాగా దెబ్బలాడారు వారంరోజులక్రితం. షీలా తల్లికి ఫోనుచేసి జరుగుతున్న వ్యవహారమంతా చెప్పి, ఏదోరకంగా సెలవుపెట్టడమో, ఏకంగా రాజీనామా చెయ్యడమో చేసి వచ్చి కూతుర్ని అదుపులో పెట్టుకోమని చెప్పేశాడు షీలా తాతగారు. ఆ విషయమై షీలా తాతతో గొడవపడింది. అలిగి వాళ్ళతో చెప్పకుండా మూటాముల్లె సద్దేసి మురళి ఫ్లాటుకెళ్ళిపోయింది. మూడు రోజులుగా అక్కడే ఉంటోంది.

ఈ రోజు మురళి అత్యవసరంగా డబ్బు తెచ్చుకోడానికి మేనమామగారింటికి వెళ్ళాడు. సాయంత్రానికి గానీ రాడు. ఈ లోపల కాలక్షేపానికి షీలా కాలేజీకి వచ్చింది. గత రెండు మూడు రోజులుగా తాతా అమ్మమ్మలు మురళి ఫ్లాటుకి వచ్చి వాళ్ళు లేకపోవడంతో వెనుదిరిగిపోతున్నారు. ఇవాళ ఫైనల్‌గా కాలేజీలో దొరికిపోయింది షీలా.

ఈ కథంతా వింటుంటే సరోజకి మతిపోయినట్టయింది. శ్రమించి సంపాదించి పిల్లల భవిష్యత్తుకి ఓ బాట వెయ్యాలన్న లక్ష్యంతో కష్టపడుతున్న తల్లిదండ్రులనించి షీలా ఏ పాఠమూ, ఏ క్రమశిక్షణా నేర్చుకోలేదు. పైగా తను తవ్వుకునే డబ్బుగనులుగా మాత్రమే వాళ్ళని పరిగణిస్తోంది. మురళి కూడా అంతే.

షీలా పరిస్థితితో తన పరిస్థితిని పోల్చుకుంది సరోజ. శ్రమచేసి సంపాదించడం కాక అక్రమపద్ధతుల్లో డబ్బు సంపాదించడమే బాటగా ఎంచుకున్నాడు తండ్రి. తన సరదాలు, వ్యసనాలు అతనికి ముఖ్యం. ఏ ఆదర్శమూ ధ్యేయమూ అతనికిలేవు.

ఇంక తల్లి సంగతికి వస్తే, తండ్రికన్నా మరీ ఘోరం. గొప్పలూ షోకులూ తప్ప పిల్లలూ సంసారం ఆవిడ కంటికానవు. ఒక ఉద్యోగంకోసమో, కళాసేవలోనో, మరో ఆదర్శంకోసమో ఇంటిని విడిచి కొంత టైము బయట గడపడంలో అర్థం, పరమార్థం ఉన్నాయి. కానీ ఈ సంగతి అలా కాదు. సరోజకు తన తల్లి ఎప్పుడూ అర్థంకాని సమస్య. తన తిరుగుడూ తన కాలక్షేపం తను చూసుకోవడం తప్పులేదుగానీ సంసారంపట్ల కూడా ఆవిడకి కొంత బాధ్యత ఉంది కదా. ఇంట్లో ఉన్నంతసేపూ చిర్రుబుర్రులాడుతూ, ఇంట్లో ఎవరూ తన లెవెల్‌కి తగ్గవారు కారన్నట్టు విసుక్కుంటూ, "ఇది ఇల్లు కాదు నరకం" అని కసురుకుంటుందే గానీ ఆ యిల్లు నరకంగా మారడంలో తన బాధ్యతకూడా ఉందని గ్రహించనే గ్రహించదు.

బీనా మాటలు వింటూ తన ఆలోచనలు తను ఆలోచించుకుంటూ, బాధ భరించలేక దీర్ఘంగా నిట్టూర్చింది సరోజ. బీనా సరోజ కేసి నవ్వుతూ చూసింది. "షీలా గొడవలు వింటుంటే బాధగా ఉందా? అలా నిట్టూరుస్తున్నావ్? నా మటుకు నాకు షీలాని చూస్తుంటే ఒక్కోసారి పిచ్చికోపం వచ్చి తన్నబుద్దేస్తుంది. వాళ్ళమ్మ ఎంత బాధపడుతూ వెళ్ళిందో. ఆవిడ ఏంచేసినా దాని మంచికోసమేగా. ఇదిలాంటి పాడు బుద్ధులు నేర్చుకుని పేరెంట్స్‌నీ గ్రాండ్ పేరెంట్స్‌నీ కూడా క్షోభపెడ్తోంది" అంది.

"ఏం జీవితాలో. ఎవర్ని చూసినా ఏ ఒక్క కుటుంబమూ సజావుగా లేదనిపిస్తోంది" అంది సరోజ తమ ఇంటి సంగతులు ఆలోచించుకుంటూ బీనా మాటలు సగం వినీ వినకుండా.

"నేను మాత్రం అలా అనుకోవట్లేదు. మానాన్న నా చిన్నతనంలోనే పోయాడన్న లోపం తప్ప మా అమ్మ నాకేలోటూ లేకుండా పెంచింది. ఆవిడ కష్టాన్ని నేనూ అర్థంచేసుకున్నా. ఆవిడ కేనాడూ ఏ బాధా కలగకుండా ప్రవర్తించడానికే ప్రయత్నిస్తుంటా. మా అమ్మ నా విషయంలో ఒక్క

సారే డిసప్పాయింట్ అయింది ఆవిడకి నేను మెడిసిన్ చదవాలని కోరికుండేది. ఆ సీటు మాత్రం సంపాదించలేకపోయా. అంతమాత్రాన ఇర్రెస్పాన్సిబుల్‌గా బతికెయ్యాలని నేననుకోవట్లేదు. నా ఫ్యూచర్ కోసం పకడ్బందీగా ప్లాన్ వేశా" అంది బీనా.

"ఏవిటి నీ ఫ్యూచర్‌ప్లాన్స్?" కుతూహలంగా అడిగింది సరోజ.

'మా అమ్మ, శీలా పేరెంట్సూ గల్ఫ్‌కెళ్ళేటప్పుడు మొదట రెండేళ్ళకాంట్రాక్టు మీద వెళ్ళారు. అదృష్టంకొద్దీ వీళ్ళకి మరో నాలుగేళ్ళకి ఎక్స్‌టెన్షన్ దొరికింది. వాళ్ళ ముగ్గురికీ తప్ప వాళ్ళ గ్రూప్‌లో వెళ్ళిన మరెవ్వరికీ ఎక్స్‌టెన్షన్ దొరకలా. మా అమ్మ తిరిగొచ్చేసరికి నేను ఎమ్.ఎ.ఎమ్‌ఎడ్. పూర్తిచెయ్యాలని డిసైడ్ చేసుకున్నా. ఇప్పుడు మా అమ్మ సంపాదన చాలా సేవ్‌చేస్తున్నాం. అమ్మ తిరిగొచ్చాక మా డబ్బుకి జతగా బ్యాంక్‌లోన్ పెట్టుకుని సొంతంగా స్కూలు స్టార్ట్‌చేస్తాను. నాకు దానిమీద చాలా ఇంట్రెస్టుంది" అంది బీనా.

సరోజ ఆశ్చర్యపోయింది. ఇంత చిన్న వయసులో ఎంత బాధ్యతగా ఆలోచిస్తోంది బీనా! తనేనాడూ భవిష్యత్తేమిటి అని ఆలోచించలేదు. ఏ పూటకాపూట తల్లి ఈసడింపులు తప్పించుకు బతకడం ఒకటే ధ్యేయమన్నట్టు బతికేస్తోంది. 'ఇంకనుంచి నేనూ బీనాలాగా ఒక పద్ధతిలో ఆలోచించడం అలవర్చుకోవాలి. జీవితానికి ఒక ధ్యేయం పెట్టుకోవాలి. అమ్మ నేనేం చెప్పినా నా ఆలోచనలన్నీ లోక్లాసు వని తీసిపారేస్తుంది. ఏ కలెక్టరుగారి కూతుర్నో మినిస్టరుగారి మనవడ్నో అనుకరించమంటుంది. ఇంక ఆవిడ మాటలు మనసుకు పట్టించుకోకూడదు. బాగా ఆలోచించి ఒక లక్ష్యం పెట్టుకుని కృషి చెయ్యాలి' అనుకుంది. ఇదంతా రాజీవ్‌తో కూడా చర్చించాలని నిర్ణయించుకుంది.

తేలికపడ్డ మనసుతో ఆ రోజు కాలేజీలో ఉన్నంతసేపూ ఉల్లాసంగా గడిపింది సరోజ.

అయితే ఆరోజు కాలేజీలో అమ్మాయిలందరికీ శీలాయే చర్చనీయాంశమైంది. కొందరు శీలాలాగా 'లిబరేటెడ్' లైఫ్ గడపాలంటే చాలా గట్సుండాలన్నారు. శీలా చాలా ధైర్యవంతురాలన్నారు. కానీ సరోజ, బీనాలాంటి మరి కొందరు మాత్రం ఒప్పుకోలేదు. విచ్చలవిడి జీవితం గడిపేవాళ్ళు ఆడైనా మగైనా చాలా నష్టపోతారు. ఎవరికైనా కొన్ని హద్దులుండాలని వాదించారు.



రాజీవ్ క్లాసులోకి వెళ్ళేసరికి వెనక బెంచిమీద కూచుని కబుర్లు చెప్పుకుంటున్న నలుగురబ్బాయిలు తప్ప ఇంకెవరూ కనిపించలేదు. సెకండ్ పీరియడ్ స్టార్టయ్యే టైమయినా ఎవరూ రాలేదేమిటా అని అటూ ఇటూ చూస్తుంటే, "సెకండవర్ కూడా క్యాన్సిలయిపోయింది రాజీవ్" అని కేక పెట్టాడు అక్కడున్న నలుగుర్లో ఒకడు.

"ఓ అలాగా" అంటూ ఒక బెంచీమీద కూచుని పుస్తకాలు తీశాడు రాజీవ్. ఊరికే కూచునే బదులు తను మిస్సయిన క్లాసుల నోట్సు రాసుకుందామని మొదలెట్టాడు.

ముందురోజు ఉత్పల్ నడిగి తీసుకున్న నోటుబుక్ బ్యాగ్‌లోనే ఉంది. అది తెరిచి తన పుస్తకంలో కాపీ చేసుకుంటుంటే వెనక బెంచీవాళ్ళ గొంతులు నెమ్మదిగా వినిపిస్తు న్నాయి. ఆ అబ్బాయిలతో రాజీవ్ కెక్కువ స్నేహంలేదు. ఒకే క్లాసు కాబట్టి 'హాయ్', 'బై' అనుకునే పాటి పరిచయం మాత్రం ఉంది.

రాసుకోవడంలో మునిగిపోయిన రాజీవ్‌కు కొంతసేపయింతరువాత ఆ నలుగురి మాటల్లోనూ తన పేరు, ఉత్పల్ పేరు విని పించాయి. రాయడం ఆపకుండానే వినపడి నంతవరకూ వాళ్ళ మాటలు విన్నాడు.

"వీడేదో ఎడ్వెంచర్ చేశాడు తెలుసా నీకు? " అన్నాడొకడు.

"ష్... వినిపిస్తుంది. నెమ్మదిగా మాటాడు" అంటున్నాడింకొకడు.

"వింటే విననీ. ఆ ఉత్పల్‌గాడి రోగం నీక్కూడా పట్టుకుందా ఏంటి? వీడేదో పెద్ద హీరో అయినట్టు వాడి మనసు బాధపడకూ డదురా అని రిపీటెడ్‌గా అంటూ వాడ్ని ఒకటే ప్రొటెక్ట్ చేస్తుంటాడు. ఇంకెన్నాళ్ళిలా? ఎవరికి లేదు మనసు? మనకి మాత్రం లేదా? ఎప్పుడూ అన్నిటికీ మనసు పాడుచేసుకుంటూ కూచుంటే ఎవడూ కాలేజ్ లైఫ్ ఎంజాయ్ చేయలేరు" ఆ కుర్రాడు కాస్త పెద్ద గొంతుతోనే లెక్చరు దంచుతున్నాడు.

రాజీవ్ బిగుసుకుపోయాడు. నిజానికి అతనన్నమాటల్లో మరీ బాధపడాల్సిందేమీ లేదు. నిజమే. కాలేజ్ స్టూడెంట్సన్నాక అదీ మగపిల్లలు సున్నితంగా మాటాడడం అరుదే. కానీ రాజీవ్ బాధపడకుండా ఉండ లేకపోయాడు. అక్కడినుంచి లేచివెళ్ళి పోవాలనుకున్నాడు. కానీ ఒంట్లో శక్తంతా పోయినట్టూ, కాళ్ళూ చేతులూ స్వాధీనం తప్పినట్టూ అయిపోయి కదల్లేకపోయాడు.

"అసలెందుకు సూసైడ్ ఎటెంప్ట్ చేశా డట? " మరో చిన్న గొంతు కుతూహలంగా అడుగుతోంది.

"ఏమో ఆ ఉత్పల్‌గాడినెన్నిసార్లడిగినా చెప్పలేదు"

"ఏదైనా లవ్ ఎఫైర్‌గాబోలు" కిసుక్కున నవ్వులు.

"వీడిమొహం, వీడికి అమ్మాయిల్తో పెట్టు కునే ధైర్యం కూడానూ" ఈసారి విరగబడి నవ్వులు.

"వెళ్ళి అడిగేద్దామా? " నవ్వులమధ్య మరో సాహసి ఉత్సాహం.

'నిజంగా వచ్చి అడుగుతారా? ' రాజీవ్ గుండె ఒక్కసారి ఆగిపోయినట్టయి తిరిగి వేగంగా కొట్టుకుంది. వాళ్ళు బెంచీమీంచి లేచి తనవైపు వస్తున్నట్టు అడుగుల చప్పుళ్ళు వినిపించాయి.

రాజీవ్‌కి చెమటలు పట్టి కళ్ళు తిరుగుతున్నట్టనిపించి డెస్కుని గట్టిగా పట్టుకుని ముందున్న నోట్‌బుక్‌లోకి ముఖం వంచాడు. నుదుటిమీంచి చమటచుక్కలు కారి పుస్తకంమీద పడ్డాయి. ఊపిరి బిగబట్టి అలాగే కూచున్నాడు.

వాళ్ళు నలుగురూ రాజీవ్ కూచున్న బెంచిదాకా వచ్చి ఆగకుండా ముందుకు నడిచి రూమ్‌లోంచి బయటకు వెళ్ళిపోయారు. రాజీవ్ ముందునుంచి నడుస్తున్నంతసేపూ అందరూ నవ్వునదిమిపెట్టి అతనివైపు దొంగచూపులు చూస్తూనే వున్నారు. ఆఖరివాడు బాగా అర్భకుడిలా ఉన్నాడు. వాడు భుజాలు కుదుపుకుంటూ కిస్సుకిస్సుమని పైకే నవ్వుతూ పోయాడు.

రాజీవ్ చాలాసేపటివరకూ తేరుకోలేకపోయాడు. అలాగే డెస్కుమీద తల పెట్టుకుని ఎంతసేపు ఉండిపోయాడో అతనికే తెలీదు. నెమ్మదినెమ్మదిగా శరీరంలోకి చైతన్యం వచ్చింది. మొద్దుబారిన మెదడులోకి ఆలోచనలొచ్చాయి.

'వాళ్ళు నన్ను ఏదైనా అడుగుతారేమోనని అంతగా ఎందుకు భయపడ్డాను? ఒకవేళ వాళ్ళు అడిగినా 'ఇదంతా నా పర్సనల్

విషయం మీకనవసరం అని జవాబు చెప్పచ్చుకదా? అసలా ఆలోచనే నాకెందుకు రాలేదు? ' అని బాధపడుతూ చాలాసేపు కూర్చుండిపోయాడు.

నెమ్మదిగా లేచి క్లాసరూమ్‌లోంచి బయటకు నడిచాడు. టైమ్ చూసుకున్నాడు. సెకండవర్ కూడా అయిపోయే టైమయింది. ఇంకా ఎవరూ రాలేదే? అనుకున్నాడు. అంతలోనే గుంపులు గుంపులుగా అమ్మాయిలు, అబ్బాయిలు రావడం కనిపించింది. వాళ్ళందరూ క్లాసులోకి వెడుతుంటే అక్కడే అయిదు నిముషాలు నుంచుని చూశాడు. ఉత్పల్ జాడ కనిపించలేదు. రాజీవ్‌కి క్లాసుకెళ్ళబుద్ధికాలేదు. కాళ్ళీడ్చుకుంటూ స్కూటర్‌వైపు నడిచాడు.

ఉత్పల్ కాలేజ్‌కెందుకు రాలేదా అని ఆలోచించాడు. బహుశా ఎలాగూ రెండు క్లాసులు క్యాన్సిలయ్యాయి కదా అని ఏకంగా ఆఫ్టర్‌నూన్ సెషన్‌కే రావచ్చులే అని మానేసుంటాడనుకున్నాడు. ఇవాళ వాడొచ్చి ఉంటే క్లాసులో మిగతా వాళ్ళు తన గురించి ఏమనుకుంటున్నారో తనకి తెలిసేది కాదు. మళ్ళీ వాళ్ళ మాటలు, నవ్వులూ గుర్తుకొచ్చి కుంగిపోయాడు రాజీవ్.

నీరజ్ గుర్తుకొచ్చాడు. నీరజ్ చెప్పేమాటలు గుర్తొచ్చాయి. ఎవర్నీ లక్ష్యపెట్టకుండా వాడిలాగా బతకాలి. ఎలాగైనా వాడిలాగా ఆలోచించడం అలవాటు చేసుకోవాలి. అప్పుడప్పుడు నీరజ్, తనూ కలిసి తాగిన అనుభవం గుర్తొచ్చింది. అందరూ తాగుడు చెడ్డదని ఎంత చెప్పినా అందులో ఏదో శాంతి ఉంది. అందుకే నీరజ్ తాగుతాడు. తాగి ఎవర్నీ లెక్కచెయ్యకుండా బతగ్గలుగుతున్నాడు. ఒక్క నీరజే ఏమిటి తాగేవాళ్ళందరూ అందుకే తాగుతున్నారు.

'తాగుడులో ఒక శాంతేకాదు, నాలాంటి పిరికివాడికి దానివల్ల ధైర్యం కూడా వస్తుంది. తాగినందువల్లే ఆరోజు నాన్న మీద తిరగబడి ధైర్యంగా పోట్లాడాను' అనుకున్నాడు రాజీవ్. ఆ మత్తులోనే పరిస్థితులు కాస్త వికటించేసరికి జీవితం మీదే విరక్తి పుట్టి చచ్చిపోవాలని కూడా అనుకున్నానన్న విషయం అతనికి అప్పుడు గుర్తు రాలేదు.

నీరజ్ దగ్గరకి వెళ్ళాలనిపించింది. స్కూటర్ స్టార్ట్ చేసి బయల్దేరి నీరజ్ ఇంటికి వెళ్ళాడు. అక్కడ వాళ్ళిల్లంతా కోలాహలంగా ఉంది. ఎవరో చుట్టాలొచ్చినట్టున్నారు. ఇంటినిండా మనుషులు గలగలలాడుతూ తిరుగుతున్నారు. "నీరజ్ ఉన్నాడండీ? " అన్న రాజీవ్ ప్రశ్నకు జవాబు రావడానికి మాత్రం పూర్తిగా పది నిముషాలు పట్టింది. డ్రాయింగ్ రూమ్‌లో ఉన్న వాళ్ళు "నీరజ్‌కోసం ఎవరో వచ్చారు" అని లోపలికి వినబడేలాగా కేకపెట్టారు. ఇంకెవరో లేచి "మేడమీదున్నట్టున్నాడు" అంటూ మేడమెట్లెక్కారు. ఎక్కడో వంటింట్లో ఉన్న నీరజ్ వాళ్ళమ్మ బయటకొచ్చి, "నీరజ్ లేడు" అని జవాబు చెప్పింది. 'ఈమాట చెప్పడానికి ఇంతసేపా? లోపల్నించి ఆవిడొచ్చి చెప్పాల్సిందే గానీ ఇక్కడున్నవాళ్ళెవరైనా చూసొచ్చి చెప్పచ్చుగా? ' అని విసుక్కుంటూ బయటకొచ్చాడు రాజీవ్.

అక్కడిజనం, ఆ గోలా అదంతా పదినిముషాలసేపు దుర్భరంగా భరించి నీరజ్ లేడని చెప్పించుకుని బయటపడేసరికి రాజీవ్‌కి డిప్రెషన్ ఎక్కువయింది.

మళ్ళీ స్కూటరెక్కి ఇంటివైపు బయల్దేరాడు. నీరజ్ ఇంటివీధి చివర్లో ఉన్న బ్రాందీషాపు దగ్గరకొచ్చేసరికి ఏదో ఆకర్షణకు లోనయ్యాడు. స్కూటర్ స్లోచేసి రోడ్డుకి ఒకపక్కగా ఆపి నిలబడ్డాడు. కొంచెం... ఒక చిన్న బాటిల్ కొనుక్కుందామా అనిపించింది.

మనస్విమాటలు మనసులో మార్మోగాయి. "బాధగానూ, డిప్రెషన్‌గానూ ఉన్నప్పుడు ఒక్కడివీ గడపకు. నీ స్నేహితులదగ్గరకైనా ఎక్కడికైనా వెళ్ళి నలుగురిమధ్యా గడుపు. డిప్రెషన్ తగ్గుతుంది" అని చెప్పిం




టారాయన.

ఆ క్షణాన రాజీవ్‌కి తనకసలు స్నేహితులన్నవాళ్ళే లేరేమోనన్నంత నిరాశ ముంచుకొచ్చింది. ఒక్కసారి తల విదిల్చాడు. 'లాభంలేదు. ఇలా ఒక్కణ్ణీ ఆలోచించుకుంటూ ఇలాగే రోడ్లంట తిరిగితే మళ్ళీ డిప్రెషన్ ముంచుకొచ్చి నాకు నేనే శత్రువునైపోతాను. కొంచెం దూరమైనా ఉత్పల్ ఇంటికి వెళ్ళి కూచోవాలి' అనుకుని మళ్ళీ స్కూటర్ స్టార్ట్ చేశాడు.

ఉత్పల్ వాళ్ళ ఇంటిగేటు తెరిచి లోపలికి వెడుతుంటే మనసులో బాధ ఎక్కువైంది. ఆ పెద్ద బిల్డింగ్‌లో ఓ పక్కకున్న చిన్న పోర్షన్ ఉత్పల్‌వాళ్ళది. ఆ చిన్న గూడు ఎప్పుడూ ప్రశాంతంగా ఉంటుంది. వాళ్ళమ్మ ఉత్పల్‌తో మాట్లాడడంకన్నా ముఖ్యమైన పని తనకేదీ లేదన్నట్టు అతనితో కబుర్లు చెప్తుంటుంది ఆలోచిస్తూ వెళ్ళి తలుపు తట్టబోయిన రాజీవ్‌ని తలుపుకి వేలాడుతున్న తాళం వెక్కిరించింది.

నిట్టూరుస్తూ వెనక్కి తిరిగాడు. రోడ్డు మీది గతుకులు తప్పించుకుంటూ స్కూటర్ నెమ్మదిగా పోనిస్తున్న రాజీవ్‌ని ఆ సందు మొదట్లో కొత్తగా వెలిసిన బ్రాందీ షాపు ఆకర్షించింది.

దాని ముందు స్కూటరాపి దిగాడు. మళ్ళీ మనస్వి మాటలు హెచ్చరించాయి. ఒక్కడే కూచుని తాగడంకన్నా తిరిగి కాలేజ్ కెళ్ళి క్లాసులో పదిమంది మధ్యా కూచుని టైం పాస్ చెయ్యడం నయమేమోనని ఆలోచించాడు. కాని క్లాసురూమ్‌లో అంతకు ముందే తనకు జరిగిన చేదు అనుభవం గుర్తుకొచ్చింది.

'క్లాసులో మిగతావాళ్ళు నా గురించి ఇంకెంత చీప్‌గా ఆలోచించి నవ్వుకుంటున్నారో! నా బాధనీ, సమస్యల్నీ ఏమాత్రం అర్థంచేసుకోలేని వాళ్ళమధ్య గంటసేపు కూచోడంకన్నా నరకం ఇంకోటిలేదు' అనుకుంటూ స్కూటర్ పార్క్‌చేసి బ్రాంది షాపు మెట్లెక్కాడు రాజీవ్.

★ ★ ★

"ఊ... ఇప్పుడు చెప్పల్లుడూ! కారమ్ముకోవాల్సిన అవసరం ఏమొచ్చింది? మళ్ళీ కొత్తది కొనడమంటే మాటలా? నా దగ్గర్నుంచి మాత్రం పైసారాలదు. అట్లాంటి ఆశలేం పెట్టుకోమాక" అని పెద్ద జోక్ వేసినట్టు వికటాట్టహాసం ఒకటి చేశాడు అప్పల నర్సయ్య.

మోహన్‌రావు ఇబ్బందిగా మొహం పెట్టి బెడ్‌రూమ్‌లోకి తొంగిచూశాడు ఆడవాళ్ళిద్దరూ వింటున్నారేమోనని. అదృష్టవశాత్తూ లేటెస్టు చీరల గుట్టలో పీకల్దాకా మునిగిపోయున్నారు లీల, మణెమ్మ. ఇదే మంచి సమయం అని ఉన్న విషయం చెప్పేశాడు మోహన్రావు.

"ఆఫీసంతా గందరగోళంగా ఉంది మావా! లంచం తీసుకుంటుండగా మావాణ్ణొకణ్ణి అరెస్టు చేసి పట్టుకుపోయారు. అందరిమీదా సీక్రెట్‌గా ఎంక్వయిరీలు జరుగుతున్నాయని ఒకటే పుకార్లు వింటున్నాం. కార్లూ గీర్లూ ఎక్కడినించొచ్చాయన్చెప్పి ఇరికించేస్తారేమోనని కాస్త దడుపుగా ఉంది. అమ్మేసి వచ్చిన తృణమోపణమో మనూరి బ్యాంకులో వేసేద్దాం అనుకుంటున్నా. ఈ గొడవలన్నీ సద్దుమణిగాక ఎలాగూ నష్టాలన్నీ పూడుకునేదాకా కష్టపడతాం. అప్పుడు మళ్ళీ కొంటా. దాన్దేముంది? "

అర్థమైందన్నట్టు తలూపాడు నర్సయ్య. "నేనుండగా నీకు భయమేంటల్లుడూ! కారు మావగారిచ్చారని చెప్పెయ్. మనదంతా అగ్రికల్చరల్ ఇన్‌కమ్ అన్చెప్పేస్తాం కదా. ఇంకేముంది? అన్ని ఎంక్వయిరీలు మూసుకుపోతాయ్" అన్నాడు సోఫాలో చేర్లబడి కాళ్ళు ముందున్న బల్లమీదకెక్కించి.

"అసలు వాళ్ళని మనదాకా ఎట్రాక్ట్ చేయించి ఎంక్వయిరీ పెట్టించుకోడం ఎందుకు? సంజాయిషీలు ఇచ్చుకోడం ఎందుకు? ఈ గొడవంతా ఎందుకు. కొరి

వితో తల గోక్కోడంలాగా? ప్రస్తుతానికిదేదో అమ్మిపారేస్తే పీడాపోతుంది. మనవైపెవడూ చూడడు. తరవాత సంగతి తరవాత చూసుకోవచ్చు" అన్నాడు మోహన్రావు.

"సరే అలాగే కానీ. నీకేది మంచిదంటే అదే చేసేద్దాం. నువ్వారోజు ఫోనుకొట్టంగానే పార్టీని రెడీ చేసిపెట్టా. మనూరోడే ఒకడున్నాడు. ఈ ఊళ్ళో ఫైనాన్స్ బిజినెస్ చేస్తున్నాడు. వాడికి అక్కడ్నుంచే ఫోన్‌చేశా కొనుక్కుంటానన్నాడు. క్యాష్ ఇచ్చేస్తాడులే. ఎగ్గొట్టడు. ఈ ఊళ్ళో దిగంగానే ఫోను కొడ్తానని చెప్పా. ఫోన్‌చేసి వాడుంటే రమ్మందాం" ఫోన్ చెయ్యడానికి లేచాడు అప్పలనర్సయ్య.

ముసలయ్యకి వంటలూ టిఫిన్లూ పురమాయించడానికి గదిలోంచి ఇవతలకొచ్చింది లీల. నర్సయ్య ఫోన్‌లో మాటాడుతున్నది విని, "ఔను, ఏంటి పొద్దున్నే కారమ్మడానికి ఏర్పాట్లు చేస్తున్నారు? మామా అల్లుళ్ళ గూడు పుఠాణీ ఏంటో నాకర్థం కావట్లా. ఉన్నట్టుండి ఉన్నది కాస్తా అమ్ముక్కూచుంటే ఎంత ఇబ్బందో తెలుసా? మీకేం మీరు టింగురంగామని స్కూటరేసుకుని ఊరేగుతారు! నా సంగతేమయినా ఆలోచించారా? పొద్దున లేస్తే ఎన్ని అవసరాలుంటాయో మీకేం తెలుసు? "అంది నిష్టూరంగా.

"నాకు మాత్రం తెలీదేంటీ? నిన్నెందుకిబ్బంది పెడతాను? కొత్త కారు కొందామన్చెప్పి ఈ కారమ్ముతున్నా. ఈసారి సెకండుహాండూ థర్డ్‌హాండూ కాదు. ఏకంగా కొత్తకారే! వారం తిరిగే సరికల్లా కొత్త మారుతీలో దర్జాగా తిరుగుతావు నువ్వు" మస్కాకొట్టాడు మోహన్రావు.

లీల ముఖం చింకి చేటలా వికసించింది. ఆనందంతో ఉబ్బితబ్బిబ్బైపోతూ, "ఈసారి ఏసీ కొనాలిబాబూ!" అంటూ గారం చేసింది.

"మరి? ఏసీ కాక ఉత్త బోసి మారుతీ కొంటాననుకున్నావా? మా ఫ్రెండొకాయనా లాయరులే. ఆయన కొన్న కొత్త ఏసీ మారుతి అమ్మేస్తాడంట. బేరమాడుతున్నా"

"ఆయనద్దగ్గర కొంటే అది మళ్ళా సెకండ్ హాండైపోదా? " పాయింటు లాగింది లీల తను కూడా లాయరే అయినట్టు.

"ఆయన కొని వారమే అవుతోంది. ఇంతలో అమెరికాపోడానికి వీసా వచ్చింది. ఆర్నెల్లదాకా తిరిగిరాడు. అక్కడాయనకో కొడుకున్నాడులే. ఆర్నెల్లు కారు ఊరికే ఉంటే పాడయిపోతుందని అమ్మేసుకుంటున్నాడు. కొత్తకారు సెకండ్‌హాండ్ రేటుకొస్తుంది. అదీ అందులో మన లాభం" చెప్పిన అబద్ధానికి చిలవలూ పలవలూ అల్లి చక్కని కథ చెప్పేశాడు మోహన్రావు.

లీల భర్త తెలివితేటలకి చాలా సంతోషించింది. తను తళతళా మెరిసే కొత్త ఏసీ కారులో మహారాణీలా కూచుని మండుటెండలో అయినా సరే మహాసుఖంగా నగర వీధుల్లో సంచరిస్తున్న దృశ్యం ఊహించుకుని సంబరపడిపోయింది. ఏసీ కారు గురించి తల్లిదగ్గర యధాశక్తి వివరించి చెప్పే ఉద్దేశంతో చీరల కుప్పల్లో కూరుకుపోయిన మణెమ్మని వెతుక్కుంటూ వెళ్ళింది.

అల్లుడు కూతురి దగ్గర అసలు విషయం దాచేసి ఏసీ కారు తాయిలం చూపించి ఊరించడం అప్పలనర్సయ్యకి బాగా నచ్చేసింది. "భలే వాడివల్లుడూ! మా బాగా చెప్పావ్. ఈ ఆడోళ్ళకి ఎంక్వయిరీలు ఎసిబిలు గట్రా ఎంత ఇవరంగా చెప్పినా అర్థంచేసుకోరు సరిగదా ఆళ్ళు వొర్రీ అయిపోయి మనల్ని కంగారెట్టేస్తారు కాలూ చెయ్యీ ఆడ్నీకుండా. మా బాగా సద్దిచెప్పావ్" అంటూ ఒకటే తెగ మెచ్చేసుకున్నాడు.

"సద్ది చెప్పడం కాదు మావా. ఈ గొడవలన్నీ సద్దుమణిగి పోతే నిజంగానే ఏసీ





కారు కొందామన్న ఉద్దేశం ఉంది. ఉత్తుత్తి మాటల్చెప్తున్నాననుకున్నావా? అబ్బెబ్బే!" అంటూ రెచ్చిపోయాడు మోహన్రావు.

అప్పలనర్సయ్యకి అల్లుడి మాటలు నమ్మాలో నమ్మకూడదో అర్థం కాలేదు. అసలు మొదట తనతో చెప్పింది కూడా నిజమోకాదోనన్న అనుమానం కూడావచ్చింది. 'ఈడు నిజంగా ఎంక్వయిరీకి భయపడే కారమ్ముతున్నాడా? లేకపోతే ఏ రేసుల్లోనయినా ఉన్నదంతా తగలేసి అప్పులపాలయి ఇంక ఉన్నవన్నీ అమ్ముకు తినే స్టేజి కొచ్చేశాడా? తాగుడు మరిగినోడు రేసులూ జూదాలూ గట్రాగట్రా అలవాటు పడలేదని గ్యారంటీ ఎక్కడుంది? అమ్మో దేవాంతకుడు! ఈడితో జాగ్రత్తగా ఉండాలి. ఈ కారమ్ముడు యవ్వారం ఏదో అయిపోయాక ఇక ఇక్కడుండకూడదు. ఆట్టే రోజులుంటే నానెత్తిన కూడా భస్మాసురహస్తం ఎట్టేస్తాడేమో' అనుకున్నాడు. రాజకీయాల్లో మసిపూసి మారేడుకాయ చేసి అవతలివాడి నెత్తిన చెయ్యెట్టే అలవాటున్న అప్పలనర్సయ్యకి అల్లుడిచేత తన నెత్తిన చెయ్యెట్టించుకోడం చాలా నీచం అనిపించింది.

మణెమ్మ మాత్రం కూతురి వైభవం చూసి మనస్ఫూర్తిగా సంతోషించింది. "నీ పెళ్ళప్పుడు అల్లుడిది చిన్న ఉద్యోగం చిన్న ఉద్యోగం అని చుట్టాలందరూ అంటుంటే మీ నాన్న ఇట్టాంటి సంబందం కుదిర్చాడేంటా అని తెగ బాధపడిపోయానే లీలమ్మా! కానీ ఇప్పుడు చూడు! అబ్బో! అల్లుడుగారు మెట్లుమెట్లుగా బలే పైకొచ్చారే! అంతా నీ అదృష్టమేనే తల్లీ! మీ అన్నలూ ఉన్నారు ఎక్కడేసిన గొంగళీ అక్కడే అన్నట్టు. మీ ఒదిన్లు ఉట్టుట్టినే కళ్ళు నెత్తికెక్కించుకుని తిరుగుతారు గానీ నీకున్న దర్జాబతుకు ఆళ్ళకెక్కడిదీ? ఆడోళ్ళ మొహాన్న అదృష్టం రాసుంటేనే కదా మొగోళ్ళు వుర్ది (వృద్ధి)లోకొచ్చేదీ!" అని తన కొడుకులు వృద్ధిలోకి రాకపోడానికి కోడళ్ళు దురదృష్ట జాతకులవడమే కారణం అని తేల్చి చెప్పేసింది.

ఆ తరవాత చాలాసేపు తల్లీ కూతుళ్ళు లీల వదినల దుర్మార్గం, లీల అన్నల వెర్రి బాగుల్తనం అన్న టాపిక్కు మాట్లాడుకున్నారు. ఇంకా చాలాసేపు వెర్రివాళ్ళైన లీల అన్నలు భార్యలకి బానిసలైపోయి వాళ్ళు ఆడించినట్టల్లా గంగిరెద్దుల్లా ఎలా ఆడి నాశనమైపోతున్నారో సవిస్తరంగా చర్చించుకున్నారు.

ఆవిధంగా తల్లీ కూతుళ్ళిద్దరూ ఏకాభిప్రాయంతో ఎన్నో కబుర్లు చెప్పుకుంటూ, మామా అల్లుళ్ళిద్దరూ మనసులో ఒకటీ, మాటల్లో ఇంకొకటీగా సంభాషించుకుంటూ, ముసలయ్య వండి టేబుల్ మీద పరిచిపెట్టిన వంటకాలు తింటూ కాలక్షేపం చేస్తూండగా అప్పలనర్సయ్య చెప్పిన 'పార్టీ' వచ్చాడు. చల్లగా కారు చేతులు మారిపోయింది. ఆ రోజుకి మోహన్రావు ఆఫీసు దుమ్మాకొట్టాడు.

★ ★ ★

సాయంత్రం ఇంటికొచ్చిన సరోజ కారు జాడ కనపడకపోయేసరికి కాస్త సంతోషించింది. ఇంకా రాజీవ్ ఇంటికి రాలేదని గమనించి, 'ఇవాళ వీడు మళ్ళీ డాక్టరు దగ్గరకెళ్ళాలే? ఇంకా రాలేదేమిటి?' అనుకుంది.

సాయంత్రం ఆరైనా రాజీవ్ రాకపోవడంతో కొంచెం ఆదుర్దాపడింది సరోజ. కొంతసేపు తనలోతనే మథనపడి ఇంక ఆగలేక లీలని అడిగింది. "అమ్మా! మధ్యాహ్నంగానీ రాజీవ్ ఇంటికొచ్చి వెళ్ళాడా? సాయంత్రం ఆలస్యంగా వస్తాననేమైనా చెప్పాడా?" అని.

"ఏమో మధ్యాన్నం ఇంటికొచ్చాడో లేదో నాకేం తెలుసూ? నేనూ అమ్మమ్మా భోజనాలు కాంగానే నూన్‌షో ఉందంటే పడిపోయాం. అక్కడా వెధవ హాల్లో కరెంటు పోయి సినిమా ఆగిపోయి చచ్చింది. మిట్ట మధ్యాన్నం ఆటోల్లో పడి ఎండంతా

మామొహాన్నే పడి మాడిమాడి ఇంటికొచ్చే సరికి ఈవేళయింది. నా యాతనలు ఏనాడైనా మీకెవరికైనా పట్టాయా? ఇవాళ వాడు రావడం అరగంట ఆలస్యమయ్యేసరికి నన్ను నిలదీస్తున్నావ్. నువ్వూ నీ తమ్ముడూ ఎప్పుడెళ్తున్నారో ఎప్పుడొస్తున్నారో నాకెప్పుడైనా చెప్పారా? పొద్దున్న మీరిద్దరూ కలిసే పోయారుగా మరప్పుడు నీకు చెప్పలేదా ఆయనగారు ఇంటికేటైముకి వేంచేసేదీ? " అంటూ అలవాటుప్రకారం గయ్‌మంటూ విరుచుకుపడింది. లీల ఎప్పుడు ఎందుకు గయ్ మంటుందో ఆవిడకే తెలియదు. అది ఆవిడకి పుట్టకతో వచ్చిన స్వభావం అని మోహన్రావు సద్దుకుపోయినట్టు సద్దుకుపోవడం సరోజకి చేతకాదు.

'వాడు నాకు చెప్తే నిన్నెందుకు అడుగుతాను?' అని మనసులో అనుకుంటూ నుదురు కొట్టుకుంది సరోజ.

"ఎందుకే లీలమ్మా దాన్నట్టా కసురుతావు? అన్నిటికీ అంత విసుగెందుకే? నీ పిల్లలు పెద్దవాళ్ళయినా నీకు చిన్నతనం పోలేదే తల్లీ!" అని కూతుర్ని గారంగా మందలించి,

"అవునే సరోజా! ఆడు మగపిల్లాడు. మొగోడన్నాక కాస్త అటూఇటూ తిరగడా? ఆడేం చిన్నపిల్లోడా తప్పిపోడానికి? అరగంట ఆలీసానికి అంత కంగారెందుకే బాబూ? వస్తాడ్లే బెంగెట్టుకోకు" అంది మణెమ్మ.

"కాదులే అమ్మమ్మా! నీకు తెలీదు. వాడు డాక్టరుదగ్గరకెళ్ళాలివ్వాళ. ఇప్పటికే ఆలస్యమయింది" అని చెప్పి ముసలయ్యకేమైనా తెలుసేమో అడగడానికి అతన్ని వెతుక్కుంటూ వెళ్ళింది సరోజ.

"ఏమిటే వాడు డాక్టరు దగ్గరకెళ్ళాలంటుందీ? ఏమైందేవిటీ వాడికి? పొద్దున్న బాగానే ఉన్నాడే" విస్తుబోతూ కూతుర్నడిగింది మణెమ్మ.

"ఏవుంటుందీ? ఏవీలేదు. ఏవున్నా లేకపోయినా డాక్టర్లచేత మాటిమాటికీ చెకప్పులు చేయించుకోడం ఇప్పుడు కుర్రాళ్ళకి ఫ్యాషన్లే. అందుకని అదేదో ముంచుకుపోతున్నట్టు నీ మనవరాలు చిందుల్తొక్కుతోంది" అంది లీల కొడుకు సైకియాట్రిస్టుని కన్సల్ట్ చేస్తున్నాడంటే అదేదో అవమానకరమైన సంగతి అని దాచిపెడ్తూ.

"అవున్లే. ఈ కాలం కుర్రాళ్ళు ఒకడేది మొదలెడితే ఇంక అందరూ వేలంవెర్రిగా అదేచేస్తారు" అంది మణెమ్మ. లీల సంతోషించింది ఈ పెద్దావిడ ఇంకేమీ అడక్కుండా అక్కడితో సరిపెట్టినందుకు.

పొద్దున్నించీ చీరలు, కార్లూ మత్తులో కూతురితోపాటు మునిగి తేలుతున్న మణెమ్మకి అప్పుడు ఉన్నట్టుండి గుర్తుకొచ్చింది "అవునూ. ఏంటే నీ కొడుకు నిద్రమాత్రలేవో మింగేశాడంట? మన వెంకన్న కొడుకు రామారావు ఆస్పత్రిలో పెట్టి మింగినవన్నీ కక్కించార్ట? ఓర్నాయనో! ఆరోజు మీనాన్న ఫోనులో మాటాడి నాతో చెప్తుంటే గుండాగిపోయిందే నాతల్లీ! నేన్నీతో మాటాడతానంటే ఆళ్ళాస్పత్రిలో ఉన్నారు. తరవాత మాటాడచ్చులే అని నన్ను మాటాడనియ్యలేదు మీ నాన్న. ఎందుకే వాడట్టాంటి పన్జేశాడు? " మణెమ్మ ప్రశ్నలేస్తుంటే లీల మొహం మాడ్చుకుంది.

"చెప్పానుగా ఈ కాలం కుర్రాళ్ళకి ఇట్టాంటివన్నీ ఫాషన్లయిపోతున్నాయని? ఊరికే ఏవో సినిమాల్చూసి టీవీల్చూసి గొప్పకోసం ఏదోటి చేసి ప్రాణంమీదకి తెచ్చుకుంటుంటారు. ఈరోజుల్లో ఇంటింటా ఇట్టాంటి రామాయణాలుంటూనే ఉన్నాయలే. పెద్దగా పట్టించుకుని భయపడిపోవాల్సిందేం లేదు" అని కొట్టిపారేసింది.

అవును కాబోలనుకుని 'అయినా దానికి లేని బెంగా కంగారూ నాకు మాత్రం ఎందుకులే' అని ఊర్కుంది మణెమ్మ.

సరోజ ముసలయ్యని రాజీవ్ గురించి




అడిగితే మధ్యాన్నం భోజనాలయ్యాక నేను కూడా ఇంటికెళ్లొచ్చానమ్మా. మరి నేను లేన పుడొచ్చాడేమో తెలీదు" అన్నాడు. సరోజ దిగులు ముఖం చూసి "వస్తాడు లేమ్మా! చాలా రోజులు కాలేజీ మానేశాడుగా? ఏ నోట్సులు రాసుకుంటానికో ఉత్పల్ బాబిం టికెళ్లాడేమో" అన్నాడు ముసలయ్య ఓదా ర్పుగా.

సరోజ ముసలయ్యతో మాట్లాడ్తుండగానే లీల, "ఈ పిల్లకెప్పుడూ వంటింట్లో చేరి పని వాళ్లతో మంతనాలాడ్డమే పని" అని విసు క్కుంటూ వచ్చి "మేం ఎగ్జిబిషనుకెళు తున్నాం. నువ్వూ పద. తయారవు" అంది.

"రాజీవింకా రాలేదు. ఎలా వెడతాం? ఎక్కడికెళ్లాడో. ఇప్పుడు మళ్లీ డాక్టరు దగ్గర కెళ్లాలి" అంది సరోజ.

"ఆ బుద్ధి వాడికుండాలి. డాక్టరు డాక్టరని నీ భజనేవిటీ? వాడికోసం మన ప్రోగ్రా ములు మానుకుంటామా? వాడొస్తే ముస లయ్యుంటాడుగా? చూసుకుంటాడులే. ముసలయ్యా! వాడొస్తే గుర్తుచేసి డాక్టరు దగ్గరకి పంపు. నువ్వు రావే!" అంది సరోజ హడావిడిగా.

"నేను రాను" తన గదిలోకెళ్లిపోతూ ఖచ్చి తంగా చెప్పింది సరోజ.

"దాని మొండితనం చూడు! కొత్తరకం డ్రెస్సులు ఎగ్జిబిషన్లో దొరుకుతున్నాయని మా క్లబ్బులో వాళ్లందరూ కూతుళ్లకి కొంటున్నారు. దీనిక్కూడా కొందామను కున్నా. చూడు ఎలా విదిలించేసి పోయిందో. నా సరదా ఒక్కటీ తీరనివ్వరీ పిల్లలు. నేనంటే అస్సలెక్కలేదువీళ్లకి" తన కష్టాలు తల్లికి చెప్పుకుని బాధపడిపోయింది లీల. మణెమ్మకి కూతురి కష్టాలు చూస్తుంటే కడుపు తరుక్కుపోయి కూతురి మీద తెగ జాలిపడిపోయింది.

పెద్దవాళ్లు నలుగురూ సరదాగా ఎగ్జిబిష న్కెళ్లారు.

"రాజీవ్ వచ్చేదాకా నాకు సాయం ఉండు ముసలయ్యా" అని అడిగింది సరోజ. ముస లయ్య పనైపోయాక వీధివరండాలో కూచుని ఎదురు చూశాడు.

సరోజ నీరజ్ ఇంటికి రెండుసార్లు ఫోను చేసింది. నీరజ్ ఇంట్లోలేడనీ, రాజీవ్ రాలే దని చెప్పారు ఇంట్లోవాళ్లు. ఉత్పల్ ఇంటికి ఫోనులేదు. ఇంకెవరి నంబర్లూ సరోజకి తెలీదు. ఏం చెయ్యాలో తోచక తొమ్మిదవు తుండగా మళ్లీ నీరజ్ ఇంటికే ఫోన్ చేసింది సరోజ. అదృష్టవశాత్తూ నీరజ్ పలి కాడు.

సరోజ చెప్పింది విని, "నేనిప్పుడే బయ ల్దేరి ఉత్పల్ ఇంటికి వెళ్లి చూస్తా. అక్కడ లేకపోతే ఇంకెవరింటికైనా వెళ్లాడేమో ఎలా గోలా పట్టుకుని తీసుకొస్తా. నువ్వు కంగా రుపడకక్కా" అని హామీ ఇచ్చాడు.

ఎగ్జిబిషన్కి వెళ్లిన పెద్దలు తిరిగొచ్చారు. వాళ్లకి ఎదురెళ్లి "రాజీవ్ ఇంకా రాలేదు" అని చెప్పింది సరోజ బెంగముఖంతో.

"అబ్బబ్బ! మాతో రమ్మంటే రాకుండా ఇంట్లోనే కూచుని వాడి గురించే బుర్రపాడు చేసుకుని మా బుర్రలు తినేస్తున్నావు! కాసేపు బయట తిరిగితే అదే ధ్యాసగా ఉండకుండా వేరే కాలక్షేపం ఉండేదికదా? " అంటూ ఎగిరింది లీల అక్కడికేదో సరోజ కాలక్షేపం అవక కొట్టుకుంటున్నట్టు.

"అయినా ఈ వెధవొకడు. తిన్నదరక్క ఏదో ఒకటి నెత్తిమీదకి తెస్తుంటాడు. అస లింటికి రావాలంటేనే విసుగేస్తోంది బాబూ. ఈ పిల్లలు మనశ్శాంతి లేకుండా చేసేస్తు న్నారు" దండకం చదివేసి నుదురు బాదేసు కుంది లీల.

"నువ్వుండమ్మాయ్! అనవసరంగా బీపీ పెంచుకోకు. సరోజా! నీకెందుకే ఈ ఆదుర్దా? మేమంతా లేమూ? ముందు భోజనాలు కానిచ్చుకుందాం పదండి. నేనూ అల్లుడూ చూస్తాంలే వాడి సంగతి భోజనా లయ్యాక" అంటూ అందర్నీ సర్దేసి నోళ్లు మూయించాడు అప్పలనర్సయ్య.



కంచంలో అన్నం కెలికేసి లేచిపోయింది సరోజ. తన గదిలోకి వెళ్లి చేతికందిన పుస్తకం తీసుకుని పక్కమీదవాలింది. పెద్ద వాళ్లు భోజనాలు చేస్తూ చెప్పుకుంటున్న కబుర్లు చెవిలో నసపెడ్తుంటే రాజీవ్ గురించి వీళ్లెవరికీ కంగారులేదేంటీ? అని ఆశ్చర్యపోతూ పడుకుంది.

అందరూ భోజనాలు కానిచ్చి చేతులు కడుక్కుంటుండగా కాలింగ్‌బెల్ మోగింది. మంచంమీంచి ఒక్క ఉదుటున్న దూకి వెళ్లి తలుపు తీసింది సరోజ. ఎదురుగా కనిపించిన దృశ్యం చూసి ఒక్క అడుగు వెనక్కి వేసింది.

ఉత్పల్, నీరజ్‌లు గట్టిగా పట్టుకుని నిలబెడితే తలవేలాడేసుకుని నుంచునున్నాడు ఒంటిమీద తెలివిలేని రాజీవ్!

ఉత్పల్, నీరజ్ ఇద్దరూ చెరోపక్కా పట్టుకుని నడిపించి రాజీవ్‌ని తీసుకొచ్చి సోఫాలో కూచోబెట్టారు. ఒంట్లో ఏమాత్రం శక్తిలేని వాడిలాగా కాళ్లు, చేతులు వేలాడేసి సోఫాలో వాలిపోయాడు రాజీవ్.

మణెమ్మ గుండెలు బాదుకుంటూ "ఓలమ్మో! ఏవయిందిరా దేవుడా. ఇదేంటి పిల్లాడిలా స్పృహలేకుండా పడిపోయాడు?" అంటూ రాగాలు మొదలెట్టింది.

"యహ! ఊరుకో యదవగోల! నువ్వు లోపలికి పో అసలు. నీ గోల వింటే మాకందరికీ స్పృహతప్పిపోయేలాగుంది. ఇంక ఆపు" కసిరాడు అప్పలనర్సయ్య. మణెమ్మ నోరుమూసేసి గుడ్లప్పగించింది.

రాజీవ్ దగ్గర్నుంచి వస్తున్న వాసన, వ్యవహారం అందరూ గ్రహించారు మణెమ్మ తప్ప.

"ఏం బాబూ! చదువు పేరుతో మా వాడ్నిలా చెడగొట్టడానికా మీ వెంట తిప్పుకుంటున్నారు?" మోహన్రావు కోపంగా కేకలు పెట్టాడు.

"మాటలు తిన్నగా రానీండి. మీ వాడ్ని మీరదుపులో పెట్టుకోలేక..." అంటూ దెబ్బలాటకి దిగుతున్న నీరజ్‌ని ఉత్పల్ వెనక్కి లాగాడు.

"సారీ అంకుల్! మీరు అసలు సంగతి తెలియకుండా మాట్లాడ్తున్నారు. నేన్చెప్పేది కూల్‌గా వినండి ప్లీజ్! రాజీవ్ నాకోసం మధ్యాహ్నం మా ఇంటికొచ్చాడట. మధ్యాహ్నం మేం ఎవరమూ ఇంట్లోలేం. తలుపు తాళం పెట్టుండడం చూసి వెళ్లిపోయాడట. మా పక్కపోర్షన్ వాళ్లు చెప్పారు. నేను అయిదింటికి గానీ ఇంటికి వెళ్లలేదు. ఇందాక నీరజ్ వచ్చి చెప్పే వరకూ రాజీవ్ ఇల్లు చేరలేదని తెలియదు నాకు. మేం ఇద్దరం కలిసి వెతకడానికి ఎక్కడికెళ్దామా అని ఆలోచిస్తుంటే మా చుట్టుపక్కల ఇళ్లల్లో పిల్లలు కొందరు రాజీవ్ సాయంత్రం అంతా మా ఇంటి దగ్గర పార్కులో చెట్టుకింద కూచుని ఏదో సీసాలోంచి తాగుతూ చాలా సేపున్నాడని చెప్పారు. ఆ పిల్లలందరూ చీకటిపడేదాకా పార్కులో ఆడుకుని ఇంటికి వెళ్లిపోయేటప్పుడు కూడా రాజీవ్ ఇంకా ఆ చెట్టుకిందే ఉన్నాడని చెప్పారు. మేం వెళ్లి పార్కులో వెతికేసరికి అక్కడ బుషెస్‌లో ఒళ్లు తెలీకుండా పడున్నాడు. రెండు సీసాల్దాకా ఖాళీ చేసినట్టున్నాడు. కొంచెం జాగ్రత్తగా చూసుకోండంకుల్" చెప్పదల్చుకున్నదంతా గబగబా చెప్పేసి నీరజ్ చెయ్యిపట్టుకుని బయటకి నడిచాడు ఉత్పల్.

వేగంగా అడుగులేస్తూ వాళ్లతోపాటు బయటికి నడిచింది సరోజ. "ఇన్ని రోజులూ బాగానే ఉన్నాడు. మళ్లీ ఏమయింది వీడికివాళ?" అంది ఉత్పల్‌తో.

"ఏమోమరి! ఇలా ఎందుకు చేశాడో. ఇవాళ కొద్దిగా పనుండి నేనసలు కాలేజీకెళ్లలా" అన్నాడు.

"సరే మేం వెడతామక్కా! రేపు వాడిని కాలేజీకి వెళ్లనీయకు. ఇంట్లోనే ఉంచేసెయ్" వెళ్లిపోతూ చెప్పాడు ఉత్పల్.

భారమైన హృదయంతో లోపలికి నడి




చింది సరోజ.

"వీధివీధికీ బ్రాందీ షాపులేనాయె. ఈ కుర్రకుంకల్ని ఊరికే ఉండమంటే ఉంటారా" అంటున్నాడు అప్పలనర్సయ్య.

"అయ్యయ్యో బంగారం లాంటి పిల్ల గాడు. ఎట్టాంటిపిల్లోడెట్టా తయారయ్యాడు" కొంగుతో కళ్లొత్తుకుంది మణెమ్మ.

"ఇదుగో ఇదేనే అమ్మా! ఈ పిల్లలిట్టా ఏడిపించుకు తింటున్నారు. వాళ్ల నాన్నేమో వాళ్లకేలోటూ లేకుండా అన్నీ కొని తెచ్చి పడేస్తారు. వీళ్లేమో తిన్నగా ఉండి చావరు. ఏదో ఇంత సంపాయించుకుంటున్నాం ఇన్ని కొనుక్కుంటున్నాం అన్న సుఖమే లేదు. ఈ పిల్లల మూలంగా మనశ్శాంతే లేదే అమ్మా నాకు. అందుకే కొంచెం సేపలా క్లబ్బులనీ ప్రోగ్రాములనీ పోతుంటాను. బయటకెళ్లిన కాసేపే నాకు మనశ్శాంతి . ఇంటికొస్తే చాలు ఇదిగో ఈ పిల్లలిట్టా ప్రాణాల్తోడే స్తారు" అంటూ బావురుమంది లీల.

"నువ్వూరుకో అమ్మాయ్! ఇంతలోకే యావయిందనీ ఈ ఏడుపులూ సోక న్నాలూ? ఏదో కుర్రాళ్లన్నాక గొడవలూ అల్లర్లూ ఉండవేంటీ? మేవంతా లేమా చూసుకోడానికి? మీ ఆడోళ్లంతా లోపలికి పోయి పడుకోండి. రేప్పొద్దున్న చూసు కుందాం ఈడి సంగతి" అని కేకలు పెట్టి అందర్నీ తరిమేశాడు అప్పల నర్సయ్య.

'ఇన్నాళ్లూ ఏం పట్టించుకోకుండా ఊరు కుని ఇప్పుడు ఏడిచేంలాభం? ' అనుకుంటూ తన గదిలోకి వెళ్లిపోయింది సరోజ.

★ ★ ★

రాత్రంతా కలత నిద్రతో, పీడకలల్తో గడి పిన సరోజ తెల్లారాక ఏ మిన్ను విరిగి మీదపడుతుందో అని భయపడుతూ లేచింది.

ఆలస్యంగా నిద్రలేచిన రాజీవ్ తయారవు తుంటే అతని గదిలోకి వెళ్లి "ఎందుకురా నిన్న అలా చేశావ్? నిన్న డాక్టరుగారి దగ్గ రకెళ్లాల్సిన రోజని కూడా మర్చిపోయావా? ' అనడిగింది సరోజ.

రాజీవ్ ఏం మాట్లాడకుండా పుస్తకాలు సర్దుకుంటూ తలొంచుకు నిలబడ్డాడు.

"ఇవాళ కాలేజీకెళ్లకురా. రెస్టు తీసుకో. సాయంత్రం డాక్టరుగారి దగ్గరకెడదాం. నేను తొందరగా వచ్చేస్తాను" అంది సరోజ.

రాజీవ్ నెమ్మదిగా తలెత్తి "సారీ అక్కా! నిన్న జరిగినదానికి నాకెంతో సిగ్గుగా ఉంది" అన్నాడు. సరోజ ఏం మాట్లాడ కుండా నిలబడింది.

"కానీ ఇవాళ కాలేజి మానేస్తే ఇంకా చాలా క్లాసులు పోతాయి. వెడతాను. ఇంకె క్కడికీ వెళ్లకుండా తొందరగా ఇంటికొచ్చే స్తాను" అన్నాడు రాజీవ్ మళ్లీ.

"నీ ఇష్టం. ఓపిగ్గా లేకపోతే మాత్రం అన వసరంగా స్ట్రెయిన్ అవ్వకు. రెస్టు తీసుకో" అనేసి తనకి ఆలస్యమవుతోందని వెళ్లిపో యింది సరోజ.

"రాజీవ్‌బాబూ! నీకు టైమవట్లేదా? టిఫిను తిందువుగానిరా" అన్న ముసలయ్య కేక విని వచ్చి టేబుల్ ముందు కూచు న్నాడు రాజీవ్. అప్పటికే అప్పలనర్సయ్య అక్కడ కూచుని టిఫిన్ తింటున్నాడు. ముసలయ్య టిఫిన్ ప్లేటు తీసుకొచ్చి రాజీ వ్‌ముందు పెట్టాడు.

"కిందటి మాటు మేం వచ్చినప్పటికంటే ఇప్పుడు బాగుందయ్యా ముసలయ్యా నీవంట. ఏదీ చట్నీ గిన్నెపట్రా" అని ముస లయ్యతో అంటూ,

"ఏరా రాజీవా! ఏలెడులేవు. నువ్వు తాగుడు మరిగావేంట్రా నాయనా! మానుకో. ఒళ్లు కుళ్లిపోగల్దు" అన్నాడు పెద్ద గొంతుతో అప్పలనర్సయ్య.

రాజీవ్ మొహం ఎర్రబడింది. చటుక్కున లేచిపోబోయాడు. వంటింట్లో కర్రపెత్తనం చేస్తున్న మణెమ్మ అప్పుడే అక్కడకొచ్చింది. "అయ్యో అయ్యో! పిల్లాడ్ని తిండైనా తినని య్యరా ఏంటీ? ఏమైనా చెప్పాలంటే తిన్నాక చెప్పాలిగానీ నువ్వు కూచోరా బాబూ! తాత



మాటలు పట్టించుకోకు. ఆయనట్టా ఏదోటి అంటూనే ఉంటార్లే" అంటూ బలవంతాన రాజీవ్‌ని మళ్లా కూచోబెట్టింది.

రాజీవ్ ప్లేట్లో చెయ్యిపెట్టి కెలుకుతూ కూచున్నాడు. మణెమ్మ రాజీవ్ పక్కన కుర్చీలో కూలబడి "అవున్రా బాబూ! తప్పు కదూ? అట్టా చెడుసావాసాలు పట్టకూడదురా అబ్బాయ్! రాత్రి నిన్ను చూసి మీ అమ్మెంత ఏడిచిందో తెలుసా? ఎవర్రా నిన్నట్టా చెడగొడుతున్నది? నిన్నొచ్చిన ఆ గుంట వెధవలేనా? బలే పొగరుమోతుల్లా ఉన్నారే? మీ నాన్నతో ఎంత పొగరుగా మాట్లాడారో తెలుసా?" అంటూ ఆవిడ చదువుతున్న దండకానికి అప్పలనర్సయ్య అడ్డుపడ్డాడు.

"ఏవే నన్నని నువ్వు చేస్తున్నదేంటి? వాడి చెవికింద జోరీగలాగ అట్టా నువ్వు పెట్టచ్చానస?"

"ఆ మీలా ఇంత గొంతేసుకుని రంకెలెడ్తున్నానా? పిల్లాడికి నెమ్మదిగా నచ్చచెప్పకోడం కూడా తప్పేనా? హయ్యోఖర్మ" అని జవాబు చెప్పింది మణెమ్మ మూతీముక్కూ తిప్పుకుంటూ.

వీళ్లిద్దరి వాదన భరించలేక రాజీవ్ లేచిపోయి చేతులు కడుక్కోడానికి వాష్ బేసిన్ దగ్గరకెళ్లిపోయాడు.

రాజీవ్ టిఫిన్ తినకుండా లేచిపోవడం వంటింట్లోంచి చూసిన ముసలయ్య ఇవతలకొచ్చి "ఏంటండయ్యగారూ! మొత్తానికి మీరిద్దరూ కలిసి బాబుని టిఫిన్ తినకుండా లేవగొట్టేశారు. ఆ బాబు తినే ఆకాస్తా కూడా తినకుండా ఖాళీ కడుపుతో పోతాడు కాలేజీకి" అన్నాడు నిష్ఠూరంగా.

"ఓసోస్... నువ్వు కూడా నాకు చెప్పేటోడివే?" అన్నాడు అప్పలనర్సయ్య కోపంగా.

అప్పుడే అక్కడకొచ్చిన లీల "ఏం ముసలయ్యా! మా నాన్న మీదే ఒంటికాలిమీద లేస్తున్నావ్? వంటవాడివి వంటింట్లోనే ఉండు. హద్దులు మీరితే మర్యాదగా ఉండదు జాగ్రత్త" అంది గుడ్లురిమి చూస్తూ.

"ముసలయ్యనేం అనకమ్మా. అతనిదేం తప్పులేదు. తాతయ్యే అనవసరంగా కేకలేస్తున్నారు" అన్నాడు రాజీవ్.

"నువ్విలా నెత్తికెక్కించుకోబట్టే అణిగి పడుండాల్సిన పనివాళ్లు మా మీద పెత్తనం చేస్తున్నారు. నీకు సొంత వాళ్లకంటే పని వాళ్లూ ముష్టివాళ్లూ ఎక్కువైపోయారు" రాజీవ్‌మీద గట్టిగా కేకలుపెట్టింది లీల.

గొడవ విని గదిలోంచి బయటకొచ్చిన మోహన్‌రావుని చూసి "చూడండీ వీడు! ముసలయ్య మా నాన్ననెదిరించి మాటాడ్తుంటే మందలించడం పోయి వాడిని సపోర్టుచేసి నాన్ననే నానా మాటలంటున్నాడు" అని కంప్లెయింట్ చేసింది లీల.

మోహన్రావు ఉగ్రుడయ్యాడు. "ఏరా! తాగి రోడ్లమీద దొర్లడం కాకుండా ఇంట్లోవాళ్ళతో పోట్లాటలు కూడానా? నీపొగరెలా అణగ్గొట్టాలో నాకు తెలుసురా" అంటూ మీదకొచ్చి రాజీవ్ చెంపలు పగిలిపోయేలా కొట్టడం మొదలెట్టాడు.

"అయ్యో, అయ్యో. పిల్లాడు చచ్చిపోతాడు బాబోయ్" అని రాగాలు పెట్టుకుంటూ మణెమ్మ రాజీవ్‌ని వాటేసుకుని ఇవతలకి లాగింది.

"ఇంక చాల్లే అల్లుడూ. మరీ అంత కోపం కూడదు. ఆయువుపట్టుమీద దెబ్బతగిల్తే ప్రమాదం కూడానూ" అంటూ మోహన్రావు చేతులు పట్టుకుని తీసుకొచ్చి కుర్చీలో కూచోబెట్టాడు అప్పల నర్సయ్య.

"చూడండి వాడ్ని! దెబ్బలు తింటాడుగానీ తప్పయిపోయిందని ఒప్పుకోడు. ఇంకో నాలుగు కొట్టనియ్యి నాన్నా. వాడి పొగరట్టాగానీ తగ్గదు. ఛీ, ఛీ... ఏంపిల్లలో! రోజు రోజుకీ ఇల్లు నరకం చేసిపారేస్తున్నారు" అంటూ ముక్కు చీదేసింది లీల.

జరిగిన రభసకి నివ్వెరపోయిన ముసలయ్య వంటింట్లో ఓమూల కూచుని




గుడ్లల్లో నీళ్ళు కుక్కుకున్నాడు.

"నువ్వూరుకోవే లీలమ్మా! అన్నిటికీ ఏడవ డవేనా? ఏడిస్తే బాగుపడతారా పిల్లలు? ఇదుగో ఏవయ్యోవ్! ఈడ్ని మనం మనతో పాటు మనూరికి తీసుకుపోదాం. కొన్నాళ్ళు మన్దగ్గరుంచుకుని ఈడ్ని కాస్త దార్లోపెట్టి తీసుకొద్దాం" అంది మణెమ్మ పెద్ద వ్యవహా ర్తలా.

అప్పల నర్సయ్యకి పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టయింది. ఇక్కడ రాజీవ్ తాగుడొకటే నేర్చాడు. అక్కడా పల్లెటూళ్ళో ఆయన కొడుకులు తాగుడుతోపాటు అన్నీ మరిగిన సకల దుర్గుణాభిరాములు! అక్క డికి తీసుకెళ్తే రాజీవ్ బాగుపడడంకల్ల.

"నువ్వు నోర్ముయ్యవే. అంతా తింగరివా గుడూ నువ్వూనూ. ఆడు కాలేజీకెళ్ళక్క ర్లేదా? ఆడి చదువేంగావాల? మన పల్లె టూళ్ళో ఆడికి చదువు చెప్పేదెవరు? ఆమాత్రం ఆలోచన మాకు లేదనుకుంటు న్నావా? " కేకలు పెట్టి మణెమ్మ నోరు మూయించాడు అప్పల నర్సయ్య.

మోహన్రావుక్కూడా తెలుసు మావగారిం టికి పంపిస్తే రాజీవ్ ఏమాత్రం బాగుపడ తాడో. "వాడినే ఊరూ ఎవరూ తీస్కెళ్ళక్క ర్లేదు. వాడి సంగతి నేనే చూస్తా. ఎక్కడికీ పంపను" అంటూ మళ్ళీ రాజీవ్ మీదకి లంఘించాడు.

"నా సంగతి ఎవరూ చూడక్కర్లేదు. నేనే చూస్కోగలను" అంటూ మీద కొస్తున్న తండ్రిని ఒక్కతోపు తోసి గబగబా బయట కెళ్ళిపోయాడు రాజీవ్.

హద్దులు మీరిన కోపంతో కేకలు పెడ్తూ లీల రాజీవ్ వెనకే పరుగెడ్తున్నట్టు నడుస్తూ బయటకెళ్ళింది. కోపంగా స్కూటర్ని బర్రు బర్రున స్టార్ట్‌చేస్తున్న రాజీవ్‌కేసి ఎర్రగా చూస్తూ "ఎంత కావరంరా నీకు? నాన్న మీదే చెయ్యి చేసుకుంటావా వెధవా" అంటూ కేకలు పెట్టింది.

ఆమె కేకలు వినిపించుకోకుండా స్పీడుగా వెళ్ళిపోయాడు రాజీవ్. స్కూటర్ రేపిన దుమ్ము లీల కళ్ళల్లో నీళ్ళు తెప్పించింది.

రాజీవ్ తోసిన తోపుకి కుర్చీమీదపడి, అది జర్రున జరిగిపోగా నేలమీద వెల్లకిలా పడిపోయాడు మోహన్రావు. అప్పలన ర్సయ్య చెయ్యిపట్టి లేవదీశాడు.

"వెధవ, పూర్తిగా వెధవైపోయాడు. అయ్యయ్యో! మీకు బాగా దెబ్బతగిలిందా? " అంటూ లోపలకి పరుగెత్తుకొచ్చింది లీల.

"ఏంలేదులే, నువ్వు కంగారు పడకు. వాడికి ఆ డాక్టరుకాదు, నేన్చేస్తా వైద్యం. వాడి రోగం ఎలా కుదర్చాలో నాకు బాగా తెలుసు" లేచి బట్టలు దులుపుకున్నాడు మోహన్రావు.

మణెమ్మ ఓ మూల కూలబడి రకరకాల శ్రుతుల్లో రాగాలు తీస్తూ జరుగుతున్న గొడ వకంతకి బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ అందిం చింది.

"యహ! ఇహ నోర్మూయవే. అసల్నీమూ లాన్నే మొదలయింది ఈ యదవ గొడ వంతా. నువ్వు మధ్యలో కలిగించుకోకుండా ఉంటే ఇదంతా జరిగేదేకాదు. చేసినదంతా చేసి ఇప్పుడీ శోకాలెందుకూ? ఇంక చాలు మూసెయ్‌నోరు" అప్పల నర్సయ్య కసిరేస రికి టక్కున నోరు మూసేసింది మణెమ్మ.

గణగణ గోలెడుతున్న ఫోనందుకుని, "అల్లుడూ! నీకే ఫోను. ఎవరో భక్తవత్సల వంట" అంటూ ఫోను మోహన్రావు చేతికి చ్చాడు అప్పల నర్సయ్య.

ఫోన్లో అవతలివాళ్ళు చెప్తున్నది నిశ్శ బ్దంగా విని "సరే, ఇంక చేసేదేముంది? నేనిప్పుడే బయల్దేరుతున్నా" అని ఫోను పెట్టేశాడు మోహన్రావు.

"పులిమీద పుట్రలా ఇదొకటి" అని గొణు క్కుంటూ తయారై బయల్దేరుతున్న భర్తని చూసి, "ఎక్కడికండీ? ఇంకా ఆఫీసు టైము కాలేదుగా? " అంది లీల.

"ఏంలేదులే. ఏవో ఆఫీసు గొడవలు. నువ్వేటూ పోకు. నీ కొడుకింటికొస్తే ఎటూ

కదలనియ్యకు. ఇవాళ అటో ఇటో తేల్చేద్దాం" అని ఆదరాబాదరాగా వెళ్ళిపోయాడు మోహన్రావు.

"చూశావా అమ్మా! ఆఫీసులో ఏ చిన్న సమస్యొచ్చినా వాళ్ళ డైరెక్టరు దగ్గర్నుంచీ మోహన్రావే రావాలి ఇదేదో చూడాలి అని అన్నిటికీ ఈయన మీదే ఆధారపడిపోతారు. ఆయనకి ఆఫీసులో అంత పరపతి! ఊళ్ళో అందరూ ఆయన్ని నెత్తిన పెట్టుకు గౌరవిస్తుంటే ఈ పిల్లలు చూడు ఎట్టా పీడించేస్తున్నారో! వీళ్ళు పిల్లలు కాదే అమ్మా! పిశాచాలు" అంటూ వాపోయింది లీల.

"అవునే లీలమ్మ తల్లీ! నీ వైభోగం చూసి ఎంత సంబరపడ్డానో! కొరకరాని కొయ్యల్లాగా ఇట్టాంటి పిల్లల్నిచ్చాడేంటే నాతల్లీ పాపిష్టి దేవుడు" అని మరోసారి రాగంతీసి కూతురికి తన హృదయపూర్వక సానుభూతిని మరోసారి ప్రకటించుకుంది మణెమ్మ.

సాయంత్రం కాలేజీనుంచి ఇంటికొచ్చిన సరోజ మళ్ళీ ఇంట్లో ఏదో గొడవ జరిగిందని గ్రహించింది. ఏమయిందని తల్లినడగడం కన్నా కందిరీగల తుట్టని లేపి వాటిచేత ఒళ్ళంతా కుట్టించుకోవడం నయం అన్న సంగతి సరోజకి చిన్ననాడే గ్రహింపుకొచ్చింది. కాబట్టి తల్లినడగ దల్చుకోలేదు. 'అమ్మమ్మనడిగితే చెప్తుందా?' అన్న ఆలోచన ఒక్క క్షణం వచ్చింది. మణెమ్మకేసి చూసింది.

"ఏమోనమ్మా మా కాలంలో ఎరుగుదుమా ఇలాంటి ఎదవ్వేషాలు? ఈకాలం పిల్లలు ఏంపిల్లలు ఓర్నాయనో" అని తన లోతను సణుక్కుంటూ ఇల్లంతా కలయతిరుగుతున్న మణెమ్మని చూస్తే చిరాకేసింది సరోజకి.

విచారంగా మొహం పెట్టుకుని రాత్రి వంటకోసం కూరలు తరుగుతున్న ముసలయ్య దగ్గరకెళ్ళింది. ఆ పిల్లకి కాఫీ కలి





పిస్తూ పొద్దున్న ఇంట్లో జరిగిన భాగోతం పూసగుచ్చినట్టు చెప్పాడు. చెప్తూచెప్తూ కళ్ల నీళ్లు పెట్టుకుంటుంటే "నువ్వెందుకు ముసలయ్యా అంత బాధ పడతావు? జరిగిన దాంట్లో నీ తప్పేం లేదులే" అంది సరోజ ఓదార్పుగా.

"ఏమోనమ్మా! ఈ పెద్ద వయసులో ఇలా మాటలు పడుతుంటే బాధగా ఉందమ్మా. నాకంటూ ఎవరూ లేనోడ్ని. ఒకరిజోలీ సొంటీ అవసరం లేకుండా కడుపుకింత సంపాదించుకు బతుకుదాం అన్న తాపత్ర యంతో పనుల్చేసుకుంటూ బండిలాక్కొస్తున్నాను. మీరు చిన్నపిల్లలప్పుడు ఈ ఇంట్లో పన్లో చేరాను. నాకళ్ళముందు ఎన్నో చూశాను. ఎవరెట్టాపోతే నాకేంటని ఏవీ పట్టించుకోకుండా నెట్టుకొస్తున్నాను. నేను పన్లో చేరినప్పుడు మీరింతింత పిల్లలు. ఇన్నాళ్ళ సావాసంలో మీరంటే ఆపేక్ష ఏర్పడిపోయిందమ్మా ఇన్నేళ్ళుగా సేవచేస్తున్న వాడిని కాస్త నాచేత్తో బాబుకింత టిఫిన్ పెట్టుకోవాలని నాకనిపించదా? ఆ బాబు ఆకలితో కాలేజీకి పోతాడంటే నాకు బాధె య్యదా? నేను ఒక్కమాట కూడా మాటాడకూడదా? " అంటూ ఒకే ఇదిగా బాధపడిపోయాడు ముసలయ్య.

సరోజకి అతని మాటలు వింటే కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. "ఊరుకో ముసలయ్యా! నిన్ను తప్పుపట్టినవాళ్ళదే తప్పు. నీసంగత్తెలుసుకోకుండా తాతయ్య వాగితే అమ్మ ఆయనకి సపోర్టివ్వడంతప్పే. నాకు తెలుసు కదా నీ సంగతి! ఇంక బాధపడకు" అని అతన్ని ఓదార్చి ఇవతలకొచ్చింది.

వంటింట్లోంచి బయటికొస్తున్న సరోజని చూసి నడ్డిమీద చేతులు పెట్టుకుని "అయ్యాయా తల్లీ పనివాళ్ళతో గూడుపుఠాణీలు? " అంది లీల వెటకారం వలక

బోస్తూ. సరోజ మాట్లాడకుండా తన గది లోకి పోతుంటే,

"చూశావా అమ్మా దాని పొగరు? ఇక్కడ నేను మాట్లాడ్తూనే ఉన్నాను, దానిదారిన అది పోతూనే ఉంది" ఉక్రోషంగా మణె మ్మకి కంప్లైయింట్ చేసింది లీల.

మణెమ్మ గునగునా నడుచుకుంటూ వెళ్లి సరోజకి అడ్డుపడి, "ఏవే! మీ అమ్మంటే అంత అలుసేవిటే నీకు? వొచ్చినప్పట్నించీ చూస్తున్నానసలు నీతంతు. పెద్దవాళ్లంటే బొత్తిగా లెక్కలేకుండాపోయింది. మీ అక్కా తమ్ముళ్ళని నెత్తినెట్టుకుని చూస్తుంటే మీరేమో ఇద్దరికిద్దరూ తెయ్‌మంటూ తిరగ బడ్డం, పనివాళ్లని ఎక్కువచేసి అమ్మానా న్నల్ని అవమానించడం. ఇవేనా మీర్నేర్చు కుంటున్న చదువులు? మీ అమ్మేనాడైనా నాకలా ఎదురు తిరగడంచూశావా?" చేతులు తిప్పుకుంటూ పెద్దగా కేకలు పెట్టింది.

"ఆ, నీ పెంపకంలో నీ కూతురూ కొడు కులూ ఎంత బుద్ధి మంతులయ్యారో నేనూ చూస్తున్నాలే. ఊరికే ముసలయ్యని పట్టు కుని పనివాడు పనివాడంటారు. మరాపని వాడు పిల్చి పెడ్తే తప్ప మాకింత కూడుపె ట్టేదిక్కులేదీ ఇంట్లో. అతను చూపించిన జాలిలో వెయ్యోవంతైనా అమ్మ మామీద చూపించిందా? ఒక్కరోజునైనా దగ్గర కూచుని అన్నం పెట్టిందా? పెట్టడందాకా ఎందుకు? ఒక్కరోజైనా తిన్నారా ఉన్నారా అని అడగనైనా అడిగిందా?" జాడించి దులిపేసింది సరోజ.

ఎప్పుడూ బిక్కుబిక్కుమంటున్నట్టుంటూ ముంగిలా మాటైనా మాటాడని సరోజ అన్ని మాటలు మాటాడేసరికి లీల నిశ్చేష్టు రాలై నిలువు గుడ్లేసుకుని నిలబడిపో యింది.

"హయ్యో! హయ్యో! ఎంతెంత మాటలం టున్నావే! మీ అమ్మానాన్నా మీకేం పెట్ట కుండానే చెయ్యకుండానే ఇంతవాళ్ళయ్యా రుటే మీరు? ఎవరే నీకిలా విషంపెట్టి నీమనసు విరిచేసిందీ? ఆ ముసలయ్యగా డేనా? పొద్దున్నకి పొద్దున్న వేలెడులేడు ఆ వెధవకూడా తండ్రిమీద చెయ్యెత్తడమే" సాగదీసుకుంటూ మణెమ్మ సరోజ బుగ్గలు పొడిచి తన బుగ్గలు నొక్కుకుని రకరకాల అభినయాలు ప్రదర్శించింది.

"ఛీ... ఇంక ముసలయ్య పేరెత్తకు. ఎవరో విషం పెట్టేదేముందీ? ఇంట్లోవాళ్లు కక్కుతున్న విషం చాలదా? చావుతప్పి కాస్తలో బతికి బయటపడ్డాడుకదా రాజీవ్, వాడ్ని కాస్త జాగ్రత్తగా చూసుకుంటే ఏంపో యిందీ? వాడు తాగడం తప్పే. నేను కాద నట్లేదు. కాని దానికి పెద్దరాద్ధాంతం చేసేసి వాడ్ని చితకదంతే సరిపోతుందా? అలా చేసేబదులు డాక్టరుగారినడిగి అలాంటి పరిస్థితి మళ్ళీ రాకుండా ఉండాలంటే ఏంచె య్యాలో సలహాతీసుకోవచ్చుగా? ఆయన ఎన్నిసార్లో చెప్పారు అమ్మనీ నాన్ననీ కూడా వచ్చి తనతో మాట్లాడమని. వీళ్ళు ఒక్కసా రంటే ఒక్కసారి వచ్చి ఆయన మాటలన్నీ కుడిచెవితో విని ఎడంచెవితో వొదిలే శారు. ఆయన చెప్పిన జాగ్రత్తల్లో ఒక్కటి కూడా పాటించట్లేదు. వాడింకేం బాగుపడ తాడు?"

సరోజ లెక్చరు విని మణెమ్మ అవాక్కయి పోయింది. ఆ అమ్మాయి మాటలు ముస లావిడకి సగం అర్ధమయీ సగంకాకుండా ఉన్నట్టున్నాయి. మొత్తానికి సరోజ ఇదివర కటి సరోజకాదు అని మాత్రం అర్ధమ యింది.

సరోజ తన గదిలోకి వెళ్ళిపోయేదాకా నోర్మూసుకుని వెళ్ళిపోయాక, "ఏం డాక్టరే లీలా? వీడు తాగి రోడ్లమీద తందనాలా డితే మధ్యలో డాక్టరేంచేస్తాడు? అసలు మొన్నటినించీ చూస్తున్నా మాటమాటాడ్తే చాలు వాడ్ని డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళండో అని గోలెడుతుందేవిటే ఇదీ?" అనడిగింది కూతుర్ని.




"చెప్పానుగా! ఇప్పుడిలాంటి వాటిక్కూడా డాక్టర్లని దేవిరించడం ఈ కుర్ర నాగన్నలకో ఫ్యాషన్. ఇంట్లోవాళ్లం చెప్తే వాళ్ళ బుర్రకె క్కదు. ఆ డాక్టరుకెవరికో అడిగినంత ఫీజు సమర్పించుకుని ఆయన్చేత నీతులు చెప్పిం చుకోవాలి. అదీ దానిగోల. ఆ చెప్పించు కునే నీతులు కూడా వాళ్ళొక్కళ్ళూవెళ్ళి చెప్పించుకోరు. ఇంటిల్లిపాదిమీ వెళ్ళి చెప్పిం చుకోవాల్ట. వెధవ్వేషాలు! అసలు వీళ్ళిద్దరికీ వాళ్ళ నాన్న చేసే బడితెపూజొక్కటే అసలు సిసలు వైద్యం" పళ్ళు పటపటా కొరికింది లీల.



పొద్దున్న హడావిడిగా బయల్దేరిన మోహన్రావు సాయంత్రం నాలుగింటికి శ్రీక నకవల్లీ బార్ అండ్ రెస్టారెంట్‌లో తేలాడు భక్తవత్సలంతోసహా. కొంతసేపు మౌనంగా మందుసేవనం చేశాక నోరువిప్పాడు.

"ఇది మరీ ఘోరం గురూ! ఒక్కసారే ఇద్దరిద్దరి అంత్యక్రియలు. అబ్బా! భరించలే కపోయాగురూ" అన్న మోహన్రావు మాట లకి "అవునవును" అంటూ తలని గిలక్కా యలా ఊపేశాడు భక్తవత్సలం.

"అసలే మంచి మందు ఫ్రెండొకడు ఏక్సి డెంట్లో ఎగిరిపోయి పట్టుమని పదిరోజులు కూడా కాలా. మళ్ళీ ఇదొకటా? మొగుడూ పెళ్ళాలిద్దరూ ఒక్కసారే ప్రాణాల్తీసుకో వాలా? ఆ పోస్టుమార్టమ్‌లేంటో! ఆ శవ దహనాలేంటో. ఓరి బాబోయ్ చూళ్ళేకపో యాగురూ" గుండెలు బాదుకున్నాడు మోహన్రావు.

కళ్ళు మూసుకుని బుర్ర ఊగించాడు భక్త వత్సలం. "కలికాలం బాస్! కలికాలం. ప్రపంచం తగలడిపోతోంది బాస్. లాభంలే దస్సల్లాభంలేదు" అన్నాడు విరక్తిగా గ్లాసు లోకి చూస్తూ. అతనికి నిలువెల్లా స్మశానవై రాగ్యం కమ్మేసుకుంది.

"అసలు ఘోరకలి ఇంట్లోనే తగలడింది. ప్రపంచాన్ననుకోడం ఎందుకు"పొద్దున్న ఇంట్లో జరిగిన గొడవ హఠాత్తుగా గుర్తు కొచ్చి అన్నాడు మోహన్రావు.

"ఇంట్లో సమస్యలుకేముందిలే బాస్! డబ్బు. డబ్బు పడేస్తే ఇంట్లో సమస్యలు వాటంతటవే తీరిపోతాయి. అయినా మీ ఆవిడ బాగా కోపరేట్ చేస్తుందంటుంటా వుగా? " అడిగాడు భక్తవత్సలం.

"మా ఆవిడతో సమస్యలేదు. సమస్యంతా పిల్లల్తోనే"

భక్తవత్సలం ఒళ్ళంతా కుదుపుకుంటూ ఏడుస్తున్నాడేమోనని అనుమానం వచ్చేలా నవ్వాడు.

"పిల్లల్తో సమస్యేంటి బాస్" అని మళ్ళీ నవ్వాడు.

"నీకేం గురూ! పిల్లల్నిద్దర్నీ రెసిడెన్షియల్ స్కూల్లో పెట్టేశావ్ హాయిగా. నేను పొర పాటు చేశాను. మావాడు కొంపలోనే కూచుని కొరకరాని కొయ్యలా తయారవుతు న్నాడు" పొద్దున్న రాజీవ్ తనని తోసేసి పోవడం తలుచుకుని తలుచుకుని మన సులో ఉడికిపోయాడు మోహన్‌రావు.

కొడుకు చేతిలో జరిగిన అవమానం పైకి చెప్పుకోలేక, మింగలేక, కక్కలేక ఉడు క్కుంటూ కూచున్న మోహనరావు మొహం లోకి చూసి, "మందు సీసా ముందరెట్టు

కుని మనసు పాడుచేసుకోకు బాస్! అన్నీ సద్దుకుంటాయిలే. కష్టాలు కలకాలం ఉండవ్" అని ఓదార్చాడు భక్తవత్సలం. మళ్ళీ అతనే "అన్నట్టు మొన్నొకరోజు మంగపతి బామ్మర్ది మా ఇంటికొచ్చాడు" అన్నాడు.

"ఎందుకూ? " అడిగాడు మోహనరావు.

"మంగపతి భార్యకి ఉద్యోగం వస్తుం దేమో కనుక్కోడానికి. టెన్తువరకూ చదివిం దిట. ఎంత చిన్న ఉద్యోగమైనా చేస్తుం దిట. కనుక్కోవాలి. వాళ్ళ ఆఫీసుకు పోవాలి. ఎలాగోలా చూడమని బతిమా లాడు. మీ రుణం ఉంచుకోం సార్ అన్నాడు" అర్థవంతంగా నవ్వాడు భక్తవ త్సలం.

"ఛీ... ఛీ. గురూ! చేసే సాయం ఏదన్నా ఉంటే చేసేద్దాం. మొగుడుపోయి కష్టాల్లో ఉన్న ఆడది. ఆవిడ దగ్గర మనం ఏం తీసు కోకూడదు. పాపం" అన్నాడు మోహన రావు.

భక్తవత్సలం లేచి నిలబడి రెండు చేతులూ ఎత్తి మోహనరావుకి దండం పెట్టాడు. మళ్ళీ ధడీలని కూలబడి, "నీది మరీ మంచి మనసు బాస్! నాకు తెలీదా? నువ్వు చెప్పినట్టే చేద్దాం. ఇంక పోదాం బాస్. చాలా దూరం పోవాలి పద" అంటూ లేచాడు.

మోహనరావు అతని చెయ్యి పట్టుకులాగి కూచోబెట్టి, "ఇంతకీ ఈ జంట ఆత్మహత్యల గొడవ మనపీక్కి చుట్టుకోదుకదా? " రహస్యం అడుగుతున్నట్టడిగాడు.

నాలిక బైటపెట్టి ముక్కున వేలేసుకుని తల అడ్డంగా ఊపాడు భక్తవత్సలం.

"మనకేం సమ్మంధం బాస్? లంచం పట్టే ధైర్యం ఉన్నవాడికి ఫైటవుట్ చేసే పట్టుదలుండొద్దూ? సస్పెండవగానే భయ పడిపోయి ఢామ్మని ప్రాణాలొదిలేస్తే ఎవరేం చెయ్యగలరు? " అన్నాడు.

"నిజమేలే" ఒప్పేసుకున్నాడు మోహన రావు.

"ఇంకలే బాస్! ఇలా ఆపకుండా మందు లాగించేస్తే మనం కూడా మంగపతి దార్లోనే పోతాం. జాగ్రత్తగా ఉండాలి" మోహనరావుని చెయ్యిపట్టి బలవంతాన లేవదీశాడు భక్తవత్సలం.

"ఔన్నిజమే. మా ఆవిడసలే టెన్తు కూడా పాసవలేదు" అంటూ లేచాడు మోహన రావు.

★ ★ ★

సాయంత్రం ఆరింటికి దెబ్బతిన్న పక్షిలా మొహం పెట్టుకుని ఇల్లు చేరాడు మోహన రావు. ఎక్కడెక్కడో తిరిగి ఎనిమిదింటికి ఇంటికొచ్చాడు అప్పల నర్సయ్య. రాజీవ్ మాత్రం రాలేదు.

తొమ్మిది గంటలయినా రాజీవ్ రాకపో యేసరికి మణెమ్మ మళ్ళీ రాగాలాపన మొద లెట్టింది "పొద్దున్ననగా పోయాడు గుంటవె ధవ! ఇంకా రాలేదర్రో!" అంటూ.

లీల మోహనరావుని కదిపింది. "మళ్ళీ వీడు ఎటో పోయాడండీ" అంది.

"వాడే వస్తాడ్లే. ఏ రోడ్లమీదో దొల్లుతుం టాడు. జేబులో డబ్బు కాస్తా అయిపోతే సరి వాడే వస్తాడు, ఇల్లెక్కడుందాని వెతు క్కుంటూ. ఆఫీసు గొడవల్తోటే బుర్ర వేడె క్కిపోయి చస్తుంటే వాడు రాలేదు, వీడురా లేదని నసపెట్టి ప్రాణాల్తోడేస్తున్నారు ఇంటి కొస్తే చాలు" అంటూ కసురుకున్నాడు మోహనరావు.

"రేపు పొద్దున్న బండికెళ్లిపోదాం అను కున్నా..." అప్పల నర్సయ్యేదో చెప్పబో తుంటే మణెమ్మ అందుకుంది. "వాడు ఇంటికి రావడం చూశాకగానీ మనం వెళ్ళద్దు. పిల్లాడు ఏపూట కాపూట దినదిన గండంగా తయారవుతుంటే వీళ్ళనిట్టా వొది లేసి మనవెట్టా వెడతావూ? "

"అబ్బ! అదేనే నేనూ చెప్పేదీ. వాడొచ్చాకే వెడదాం" ప్లేటు ఫిరాయించి కుర్చీలో మఠం వేసుక్కూచున్నాడు అప్పల నర్సయ్య.




రాత్రి పదకొండున్నరకు ఫోను మోగింది. ఫోనెత్తి అవతలివాళ్ళు చెప్తున్నది వింటూ వింటూనే లీల, "అమ్మబాబోయ్! వాడు పోలీస్‌స్టేషన్లో ఉన్నాట్టండీ" అంటూ ఆరు న్నొక్క రాగం అందుకుంది.

గబుక్కున ఆమె చేతుల్లోంచి రిసీవర్ లాక్కున్నాడు మోహనరావు. అవతలివాళ్ళు చెప్పిందంతా విని, "సరే. ఇప్పుడే వస్తాను సార్" అంటూ ఫోన్ పెట్టేసి పిడికిళ్ళు బిగించి పళ్ళు పటపటా కొరికాడు.

"ఏవయిందే? అల్లుడూ నువ్వన్నా చెప్పు" అప్పలనర్సయ్య చిందుల్తొక్కాడు.

"ఆ యూస్‌లెస్‌ఫెలో తాగి స్కూటరు లైటు స్తంభానికి గుద్దించేసి పడ్డాట్ట. పోలీస్ స్టేషన్లో మర్యాదల్చేస్తున్నారు" కసిగా చెప్పాడు మోహనరావు.

మోహనరావు మాటలు విని కూతురితో పాటు యుగళం ప్రారంభించింది మణెమ్మ.

సరోజ భయంతో బిగుసుకుపోయింది. "దెబ్బల్తగిలాయేమో. హాస్పిటల్లో పెట్టా ర్టనా? స్టేషన్లోనే ఉన్నాడా?" సరోజ ప్రశ్న లకి తిక్కరేగిపోయింది మోహనరావుకి.

"ఆ... ఆ. ఫలానా సరోజగారి తమ్ముడు అన్చెప్పి వాడ్ని ఆస్పత్రిలో చేర్పించి ఆపిల్ పళ్లు తినిపిస్తున్నారు" అన్నాడు వెటకా రంగా.

"అబ్బ! ఊరుకో అల్లుడూ. ఏదో దాని ఆత్రం దానిదీ. ఇంతకీ వాళ్ళేం చెప్పారు? కేసు బుక్ చేశారంటనా? చేసినా పర్వా లేదు మేనేజ్ చేసేద్దాం. మనూరోడే ఓ సర్కిలినస్పెక్టరున్నాడిక్కడ. ఫోన్ చేస్తే నిముషాలమీద పనైపోద్ది" తన దర్పం ఒల కబోసేందుకు, ఛాన్సు దొరికినందుకు మహా సంబరపడ్డాడు అప్పల నర్సయ్య. తన పోరంబోకు కొడుకులవల్ల ఇలాంటి 'మేనేజ్ మెంట్లు' అతనికి బాగా అలవాటే.

"ఎవ్వరికీ ఫోను చెయ్యక్కర్లేదు. ఉండనీ. ఓ రాత్రికి పోలీస్‌స్టేషన్లో పడుంటే బుద్ధొ స్తుంది వెధవకి" పళ్ళు కొరికాడు మోహన రావు.

లీల, మణెమ్మ తీస్తున్న రాగం తారస్థా యినందుకుంది. "అబ్బబ్బ! నీ కోపం నీదే కానీ ఆలోచించవేంటల్లుడూ? ఆడక్కడ పడుంటే నీ పరువేం గావాల? తెల్లారి చుట్టుపక్కలోళ్లందరికీ తెలిసేలోగా విడిపిం చుకురావాల. పద. పద" అల్లుడ్ని బయల్దే రదీశాడు అప్పలనర్సయ్య.

అతనికి అల్లుడి పరువు కాపాడ్డంకన్నా తన ప్రతాపం చూపించాలన్న ఆత్రం ఎక్కు వైపోయింది. సిటీలో కూడా తన ఇన్‌ఫ్లు యెన్సు ప్రభ ఎలా వెలిగిపోయిందో ఊళ్ళో వాళ్ళందరికీ వర్ణించి వర్ణించి చెప్తుంటే సర్పంచ్ అప్పలనర్సయ్యకి అక్కడెంత గౌరవం! దర్జా పెరిగిపోదూ? తలుచుకుం టేనే నోరూరిపోతుండగా అల్లుడికి మరో ఆలోచన తోచనియ్యకుండా తొందరపెట్టే శాడు.

★ ★ ★

పోలీస్‌స్టేషను ముందు స్కూటరాపి అప్పలనర్సయ్యకు వార్నింగిచ్చాడు మోహన రావు. "నువ్వు ముందే నాకీడు తెలుసు, ఆడు తెలుసు అనకు మావా. కొందరు కొందరు పోలీసులు తిక్కచచ్చినాళ్ళుంటారు. ఇక్కడి ఎస్సై ఏదయినా ట్రబులిస్తే అప్పుడు చూపిద్దాం మన తడాకా?" అన్నాడు. మావగారి ఇన్‌ఫ్లుయెన్సూ, కాంటా క్ట్సుమీద అతనికి బోలెడు భరోసా ఉందిగానీ ముందసలు పరిస్థితేంటో చూడా లిగా!

మామా అల్లుళ్ళిద్దరూ లోపలకెళ్ళేసరికి ఓ మూల బెంచీమీద తల వేలాడేసుకుని గోడకు జార్లబడి కూచునున్నాడు రాజీవ్. నిద్రపోతున్నాడో, స్పృహ తప్పాడో, మెలుకు వగానే ఉన్నాడో తెలియట్లేదు.

"మీరేనా అతని తండ్రి మోహనరావు?" అడిగాడు ఎస్సై.

'కాకపోతే నువ్వు నాకెందుకు ఫోన్ చేస్తావూ, ఇంత రాత్రివేళ చల్లో ఒణు



క్కుంటూ ఇంకేం పన్లేనట్టు నేనెందుకు నీ పోలీస్‌స్టేషనుకొస్తాను?' అని మనసులో విసుక్కుంటూ పైకి "అవున్సార్" అన్నాడు మోహనరావు.

"ఎక్కడ పని చేస్తున్నారు?" అంటూ ఎస్సై అడిగిన వివరాలన్నిటికీ జవాబిస్తూ బల్లమీద చిన్న చెక్కముక్కమీద పెయింట్ చేసున్న ఎస్సై పేరు 'వి.యస్. పంతులు' అన్న అక్షరాలు చదివాడు. ఆయన లాఠీ ఎంత పొడుగుందో చూశాడు. ఓ పక్కన పేర్చి ఉన్న తుపాకులనీ, ఆ రూములో ఉన్న మిగతా వస్తువుల్నీ వింతగా చూశాడు. లాకప్పు ఖాళీగా ఉందే అనుకున్నాడు. గుమ్మం దగ్గరా, స్టేషన్‌లో అక్కడక్కడా తిరుగుతున్న కానిస్టేబుల్స్ యమభటుల్లా కనిపించారు. మోహనరావు సినిమాల్లో తప్ప పోలీస్‌స్టేషను లోపల ఎలా ఉంటుందో ఇంతకు ముందెప్పుడూ చూడలేదు.

ఆ అర్థరాత్రిపూట కీచురాళ్ల చప్పుళ్లతో జీబురుమంటున్న ఆ రూములో కూచున్న మోహనరావుకి ఏదో తెలియని భయంతో ఒళ్ళు ఒక్కసారి జలదరించినట్టయింది. తేరుకుని ఎస్సై చెప్తున్న మాటలు బుర్రకెక్కించుకోడానికి ప్రయత్నించాడు.

"కుర్రాడు చూస్తే మరీ రాటుదేలిన రకంలా లేడు. బిహేవియర్ బాగానే ఉంది. ఇదే ఫస్టఫెన్సయుంటుందని వార్నింగిచ్చి ఒదిలి పెడ్దామనుకుంటున్నా. ఇంక ముందిలాంటివి జరక్కుండా జాగ్రత్తగా చూసుకోండి. బహుశ ఫ్రెండ్సెవరో ప్రాక్టికల్ జోక్ కోసం ఇతనికి ఏ కూల్‌డ్రింకులోనో ఆల్కహాల్ కలిపి ఇచ్చేసుంటారు" చాలా సౌమ్యంగా, మర్యాదగా మాట్లాడాడు ఎస్సై. పోలీసుల్లో తప్ప బుట్టిన వాడిలాగా.

"కాదు. కాదు. నేను తాగాను. మా వీధి చివర్లో ఉండే 'స్వర్గం'బారూ? అందులో తాగాను" మూసుకుపోతున్న కళ్ళని తెరవడానికి ప్రయత్నం చేస్తూ గంగిరెద్దులా తలూగిస్తూ ముద్దమాటల్తో అన్నాడు రాజీవ్.

'హోరి చండాలుడా! ఇంటిదాకా వచ్చి మన ఇంటి దగ్గరి బార్లోనే పీకల్దాకా లాగించడమేకాక ఇంతోటి వీరత్వానికీ మరో వీధిలోకి స్కూటరేసుకెళ్ళి యాక్సిడెంటు చెయ్యడం కూడానా' మనసులో కసితీరా కొడుకుని తిట్టుకున్నాడు మోహనరావు.

"ఆల్‌రైట్... ఆల్‌రైట్. ఇంకెప్పుడూ ఇలా చెయ్యకూడదు. ఇంకోసారిలా జరిగితే ఊరుకోను తెలిసిందా?" అన్నాడు ఎస్సై. మళ్ళీ బుర్ర ఊగించాడు రాజీవ్.

"వీధి వీధికీ బార్లూ, బ్రాందీషాపులూ వెలిసి పెద్దల్నీ పిల్లల్నీ ఒకేరకంగా దిగజారుస్తున్నాయ్. పేరెంట్స్ జాగ్రత్త తీసుకోకపోతే కుర్రాళ్ళెందుకూ పనికిరాకుండాపోతారు" అన్నాడు ఎస్సై.

మోహనరావు ఏం మాట్లాడలేదు. "పోలీసోడి దగ్గరే నేర్చుకోవాలి నీతిపాఠాలు!" అనుకున్నాడు మనసులో కసిగా.

"మరో తమాషా చెప్పనా? రాదర్ పెక్యూలియర్! మీ అబ్బాయి మీ పేరు ఎడ్రసు చెప్పనని చాలాసేపు మొరాయించాడు. ఒక్క అక్క తప్ప తనకెవరూ లేరన్నాడు. మొత్తానికి రాబట్టాననుకోండి. తరవాత మీకు ఫోన్ చేశాక, 'మా నాన్నొచ్చినా నేనింటికెళ్లను' అని ఇక్కడే ఉండనివ్వమని బతిమాలాడు. కొంచెం వింతగా అనిపించింది" అంటూ మోహనరావు మొహంలో రియాక్షను కోసం పరీక్షగా చూశాడు ఎస్సై.

మోహనరావు ముఖం కోపంతో మరింత నల్లబడింది. "కుర్రెదవగదండీ! పైగా తాగున్నాడు" అప్పలనర్సయ్య ఇంకా ఏదో చెప్పబోయి అల్లుడి చూపుల్లో క్రోధం చూసి నోర్మూసేసుకున్నాడు.

"నేననుకోవడం దేనివల్లో అతని మనసు కొంచెం దెబ్బతింది. డెఫినిట్లీ హి ఈజ్ సైకలాజికల్లీ ఎఫెక్టెడ్. బహుశా అందరూ




తనని నెగ్లెక్ట్ చేస్తున్నట్టుగా ఫీలవుతున్నాడ నుకుంటా. ఎవరైనా మంచి సైకియాట్రిస్ట్‌కి చూపించడం బెటర్" అన్నాడు ఎస్సై.

'అడ్డమైన గాడిదా నాకు సలహాలిచ్చేవాడే' మనసులో తిట్టుకుంటూ పైకి మాత్రం ఓ వెర్రి నవ్వు నవ్వి ఊరుకున్నాడు.

"ఆల్‌రైట్ మిస్టర్ మోహనరావ్! మీరింక మీ అబ్బాయిని తీసుకెళ్ళచ్చు" ఎస్సైమాట చెవిని పడగానే రిలీఫ్‌తో లేచి నుంచున్నాడు మోహనరావు. గబుక్కున జేబులో చెయ్యి పెట్టి అందినన్ని నోట్లు తీసి బల్లమీదపెట్టి, "థ్యాంకూ సర్" అని ఎస్సైకి దండం పెట్టాడు.

నిప్పులు చెరుగుతున్నట్టు చూశాడు ఎస్సై. "వాటీజ్ దిస్? వాడ్డూయూ మీన్? "

ఎస్సై కేకలకి అదిరిపడి, "ఏదో మా సంతోషం..." ఒణుకుతూ నీళ్లు నమిలాడు మోహనరావు.

"షటప్!" మోహనరావు మాట పూర్తికా కుండానే అరిచాడు ఎస్సై.

"ఇలాంటి పనులు చేస్తే మిమ్మల్ని లోప లికి తొయ్యాల్సొస్తుంది. హౌ డేర్ యూ!" ఎస్సై కేకలు పెడ్తుంటే అప్పలనర్సయ్య క్కూడా ఒణుకుపుట్టింది.

నీతిముందు ముఖాముఖీ నిలబడితే అవి నీతి ఒణికిపోవడం సహజంకదా!

"అందరూ తనలాంటివాళ్ళే అనుకుం టాడు మా నాన్న. ఇహిహిహి..." రాజీవ్ ఇకిలింపు చెవినిపడగానే సర్రున లేచింది మోహనరావు చెయ్యి. మరుక్షణంలో రాజీవ్ దవడ పగిలిపోయేదే!

"మిస్టర్!" అని ఎస్సై హెచ్చరించగానే లేచిన చెయ్యి కాస్తా దిగిపోయింది.

"మీరిలా బిహేవ్ చేస్తే, చెప్పానుకదా! మీ అబ్బాయి కాదు మిమ్మల్ని లాకప్‌లో వేసేస్తాను" వార్నింగిచ్చాడు ఎస్సై.

"జరిగిన భాగోతం చాలుగానీ ఇంక పదరా" అంటూ అప్పలనర్సయ్య రాజీవ్‌ని రెక్కపుచ్చుకు లేవదీశాడు. రాజీవ్ మాటాప లుకూ లేకుండా లేచి నుంచుని రెండుచే తులూ తలపైదాకా ఎత్తి ఎస్సైకి దండం పెట్టాడు.

"ఓ.కె. ఓ.కె. వెళ్ళు. చెప్పినవన్నీ గుర్తు పెట్టుకో" అన్నాడు ఎస్సై రాజీవ్‌కేసి జాలిగా చూస్తూ.

"మీర్రేపొచ్చి స్కూటర్ తీసుకెళ్లండి" అన్నాడు మోహనరావుతో.

ఈ డ్రామా అంతా ఇందాకట్నుంచీ గుమ్మం దగ్గర నిలబడి చూస్తున్న కానిస్టే బుల్ లోపలకొచ్చి రాజీవ్ రెండో చెయ్యి పట్టుకున్నాడు. కానిస్టేబులూ, అప్పలన ర్సయ్య చెరోవైపూ నడిపిస్తూ రాజీవ్‌ని బయటకు తీసుకొచ్చారు.

ముందే బయటకొచ్చిన మోహనరావు ఆటో పిల్చాడు. రాజీవ్ చెయ్యిపట్టుకుని బయటకొచ్చిన కానిస్టేబుల్ మోహనరావు దగ్గరగా వచ్చి నిలబడి, "ఎందుకు సార్! మా ఎస్సైకి పైసలిచ్చారు? ఆయన రూల్సు పట్టుకువేళ్ళాడుతూ ఉంటాడు. రూల్స్ రూల్సంటూ పైవోళ్ళతో కూడా పోట్లాటకి దిగుతాడు. ట్రాన్స్‌ఫర్‌కీ భయపడ్డు. సస్పె న్షన్‌కీ భయపడ్డు. మళ్ళా ఉద్యోగం పోతే తిండిక్కూడా జరుగుబాటులేని పేదోడు. అయినాసరే ఆదర్శాలొదలడు, రూల్సొద లడు. తను బాగుపడడు. మమ్మల్ని బాగు పడనీడు. ఆయనైతే పెళ్ళీపెటాకులూ మానేసి ఆదర్శాలకోసమే బతుకుతున్నానం టాడు. మరి మేం పిల్లాజెల్లా కలోళ్లం. మా కష్టం అర్థం చేసుకోండి. మీ సంతోషంకొద్దీ ఏమయినా ఇచ్చుకోదల్చుకుంటే మాకిచ్చు కోండి" అని చెయ్యి చాపాడు.

అతనికేసి ఎర్రగా చూసి, మాటాడకుండా స్కూటర్ స్టార్ట్ చేసేశాడు మోహనరావు.

ముందు ఆటో, వెనక స్కూటరూ దుమ్ము రేపుకుంటూ పోతుంటే "రేపు స్కూటరు కోసం వస్తావుగా అప్పుడు చూపిస్తా నా తడాఖా. నీ తిప్పలు కుక్కలు కూడా



పడవు" తిట్టుకుంటూ లోపలికి పోయాడు కానిస్టేబుల్.

లోపల ఎస్సైకూడా మోహనరావుని మనసారా తిట్టుకున్నాడు. కుర్చీలో జేర్లబడి, కాళ్లు బల్లమీద పెట్టి కళ్లు మూసుకున్నాడు ఎస్సై పంతులు. తను ఆ మోహనరావుతో అంత మర్యాదగా ఉండవల్సింది కాదు అనుకున్నాడు. 'వెధవలు! మంచికి మర్యాదకి విలువ తెలీనివాళ్ళు! వాడేదో ముట్టజెప్తాడన్న ఆశకొద్దీ నేను వాడి కొడుకుని వొదిలి పెట్టాననుకుంటున్నట్టున్నాడు' మోహనరావు తనని లంచగొండిగా లెక్కే సెయ్యడం అతన్ని చాలా బాధపెట్టింది.

"అందరూ తనలాంటివాళ్లే అనుకుంటాడు మా నాన్న" రాజీవ్ మాటలు గుర్తొచ్చి కొద్దిగా నవ్వొచ్చింది అతనికి. 'వాళ్ల నాన్న స్వభావం బాగా కనిపెట్టాడు కుర్రాడు' నవ్వుకున్నాడు ఎస్సై.

తను మోహన్రావింటికి ఫోన్ చేస్తుంటే కూడా వెనకనుంచి "అలా ఒక్కసారి ఫోన్ చేస్తే మా నాన్న రాడుసార్! ఎంతోకొంత ముట్టచెప్తాననండి అప్పుడొస్తాడు" అన్నాడు.

మళ్లీ కాసేపయ్యాక "అసలాయనిక్కడికి రాకపోతేనే బావుంటుంది. ఆయనొచ్చినా నేనింటికెళ్లను. నాకిక్కడే హాయిగా ఉంది" అలా ఏదో ఒకటి వాగుతూనే ఉన్నాడు వాళ్ల నాన్నొచ్చేదాకా.

'పాపం! కుర్రాడు మంచి వాడులాగే ఉన్నాడు. ఇంట్లో ఏవో గొడవలుండుంటాయి. అందుకే అలా వాగుతున్నాడు. అన్ని కొంపల్లోనూ గొడవలూ, అశాంతే! ఏ ఇల్లు ప్రశాంతంగా ఉండేడ్సింది గనుక' అని నిట్టూర్చి బుర్రలోంచి రాజీవ్ గురించిన ఆలోచనలు పక్కకి నెట్టేశాడు ఎస్సై.

★ ★ ★

"సైకియాట్రిస్టంటే మెంటలోళ్లకి వైద్యం

చేసే డాక్టరేనా అల్లుడూ? " తెల్లారాక తీరిగ్గా టిఫిను తింటూ అడిగాడు అప్పలనర్సయ్య.

"ఊ!" ఉరిమాడు మోహన్రావు. అతనికి రాత్రినుంచీ ప్రపంచంలో అందరిమీదా ఒళ్లు మండిపోతోంది.

"రాత్రి ఆ ఎస్సై మనోడ్ని మెంటల్ డాక్టరుకేగా చూపించమంటున్నాడు? చూపిస్తే పోలా? " అడిగాడు అప్పలనర్సయ్య.

"ఏంటి పోయేది? ఇప్పుడసలు వాడు మెంటల్ ట్రీట్ మెంట్ లోనే ఉన్నాడు. ట్రీట్ మెంటు మొదలెట్టాకే ఇట్టా రెచ్చిపోతున్నాడు. ట్రీట్ మెంటేదీ లేనప్పుడే సుబ్బరంగా ఉండేవాడు" కోపాన్నంతా పూరీ ముక్కమీద చూపించి దాన్ని కసాపిసా నమిలేస్తూ మోహన్రావు మండిపడుతుంటే అతని మాటలు పూర్తికాకముందే సరోజ గబుక్కున అందుకుంది.

"మూడు రోజులబట్టీ వాడు డాక్టరుగారిచ్చిన మందులు వేసుకోడంలేదు. మందులయిపోయినట్టున్నాయి. అసలు మొన్ననే వాడు డాక్టరు దగ్గరకెళ్లి చూపించుకుని మళ్లీ మందులు తెచ్చుకోవాల్సుంది" అంది.

సరోజ మాటలు విని ఒంటికాలిమీద లేచాడు మోహన్రావు. "ఆహాఁ అలాగా తల్లీ! మరైతే అన్ని తెలిసిన దానివైతే వాడు మందులేసుకోట్లేదని తెలిసీ చూస్తూ ఊరుకున్నావేం పాపం? నువ్వెందుకు తీసుకెళ్ల లేదూ వాడ్ని డాక్టరుగారి దగ్గరికీ? " అంటూ ఎగిరాడు అక్కడికి బాధ్యతంతా సరోజదే అయినట్టూ, తనకేమీ సంబంధం లేనట్టు.

"గుడ్డొచ్చి పిల్లనెక్కిరించిందనీ ఈమధ్య దీనికి బాగా నోరు లేస్తోంది. అన్నీ తనకే తెలిసినట్టు వాగుడూ ఇదీనూ" లీల సన్నాయి నొక్కులు నొక్కింది. సరోజ ఇంకేమీ మాట్లాడలేక కళ్లల్లో నీళ్లు నిండుకొస్తుంటే తన గదిలోకి వెళ్లిపోయింది.

"ఇంతకీ అసలు ఇసయమేంటల్లుడూ? ఏ

మాటడిగినా నువ్వు గయ్ మనడం, ఆడోళ్లు ఏడవడం! ఏడ్చేటోళ్ల సంగతేంటో సరిగ్గా చెప్పేడవరు. నాలాంటోడికి అర్థమయ్యేదె లాగ? కాస్త సరిగ్గా చెప్పల్లుడూ" అప్పల నర్సయ్య గింజుకున్నాడు.

"చెప్పేందుకేముందీ? వాడు మాత్రలు మింగి ప్రాణాలమీదకి తెచ్చుకున్నప్పుడు ఆ డాక్టర్రామారావు నా ప్రాణాల్తోడేసి వాడికి ఒక సైకియాట్రిస్టు దగ్గర వైద్యం మొదలెట్టించాడు. ఆయన వారానికి సరిపడా మందులిచ్చి వారం వారం వచ్చి కనపడమంటున్నాడు. అదీ నీ మనవరాలి గోల! మొన్నటికి వాడు మళ్లీ డాక్టరు దగ్గరకెళ్లాల్సిన రోజు. వాడ్నెవరూ తీసుకెళ్లలేదని ఆవిడగారు మనందర్నీ దెప్పి పొడుస్తోంది. తనంతట తను పోటుగాడిలా బారుకెళ్లి తాగి రోడ్లమీద ఏక్సిడెంట్లు కూడా చెయ్యగలిగినవాడు తనంతట తను డాక్టరు దగ్గరకెళ్లలేడు కాబోలు. వేషాలు"

మోహన్రావు చెప్పిందంతా విని అప్పలనర్సయ్య బుర్రగోక్కున్నాడు. "పోనీ ఇవాళ తీసుకుపోదాం. ఈడు కాలేజీకన్చెప్పి పోయి తాగి బోర్లాపడకుండా ఉండేందుకు ఏ మందో మాకో ఇస్తాడేమో ఆ డాక్టరు" అన్నాడు.

"నీకు టైముంటే నువ్వు తీసుకుపో మావా! ఆ డాక్టరు అంత తేలిగ్గా పేషెంటుని చూసేసి మందివ్వడు. అబ్బో చాలా ప్రశ్నలేసి చాలా మాట్లాడిస్తాడు. అంత సేపాయన్తో మాట్లాడ్తూ కూచోడానికి నాకింకేం పనుల్లేవా? నేనసలాఫీసుకి పోవాలివాళ" అంటూ లేచాడు మోహన్రావు.

"అవున్నాన్నా! నువ్వు తీసుకెళ్లు. సరోజ కూడా వస్తుంది. దానికీ ఆ రామారావుగారికీ మంచి దోస్తీ అంకులంకులనుకుంటూ. మా పిల్లలు మమ్మల్ని చూస్తే మొహాలు ముడుచుకుంటారుగానీ ఊళ్లో వాళ్లతో మాత్రం మహా గౌరవంగా ఉంటార్లే. ఇంతకీ చెప్పొచ్చేదేంటంటే సరోజకి ఆ డాక్టరూ ఆ ఆస్పత్రీ మహా బాగా తెలుసు. అదీ నువ్వూ వెళ్లండి. నన్నివాళ మధ్యాహ్నం మూడింటికే వొచ్చెయ్యమంది మా క్లబ్బు ప్రెసిడెంటు. నీకు తెలీదులే. నాకు క్లబ్బులో అన్యాయం జరుగుతుంటే పెద్ద పెద్దోళ్ల భార్యలందరూ నాకు సపోర్టిచ్చి మా క్లబ్బు సెక్రటరీకి ఎదురు తిరిగారు. ఆ గొడవంతా తాడోపేడో తేలిపోతుందివాళ. నాకస్సలు తీరికలేదు" అంటూ లీల లేచింది.

అప్పలనర్సయ్య ఇరకాటంలో పడ్డాడు. 'అటు తిరిగీ ఇటు తిరిగీ తన పీక్కి చుట్టుకుందే ఈ గొడవ' అనుకున్నాడు. 'ఈళ్లు కొడుకుని చెడగొట్టుకుని నా నెత్తిన రుద్దాలని చూస్తారేంటి?' అని కూడా అనుకున్నాడు. ఊరుకుంటే లాభంలేదని ఎత్తుకు పైఎత్తేశాడు. "అసలింతకీ ఆయనిచ్చిన మాత్రలు ఈడు వేసుకోట్లేదంటోందిగా సరోజమ్మ? పోనీ డాక్టర్ని మార్చి చూస్తే సరి. మనూరి ప్రసాదరావు కొడుకులు అమెరికా వెళ్లొచ్చి సంపాదించిన డబ్బుల్తో ఈ ఊళ్లో పేద్ద అయిదుస్టార్ల ఆస్పత్రి కట్టించార్టగా. అక్కడికి పట్టుకుపోదాం. అక్కడ అమెరికా డాక్టర్లుంటారు. నిమిషాలమీద ఈడి రోగమేంటో తేల్చేసి వైద్యం చేస్తారు" అన్నాడు.

లీల కళ్లు మెరిశాయి. "ఆ మాట నేనే నాడో చెప్పా నాన్నా! ఆయన వినిపించుకోట్లేదు. ఏవండీ! సాయంత్రం మీరూ నాన్నా వాణ్ణి అక్కడికి తీసికెళ్లండి. ఇంక కాదనకండి" పట్టుబట్టింది.

"సర్లే చూద్దాం" అనేసి అలవాటు ప్రకారం అప్పటికి వాయిదావేసి వెళ్లిపోయాడు మోహన్రావు. అల్లుడి ఖర్చు మీద ఆ కొత్తాస్పత్రి ఎలా ఉంటుందో చూసి మరీ ఊరుకి పోవచ్చు అనుకున్నాడు అప్పలనర్సయ్య.

★ ★ ★

మూడింటికల్లా టిప్‌టాప్‌గా తయారై క్లబ్బుకి బయల్దేరిపోయింది లీల. "ఆటో





దొరుకుతుందో లేదో! ఇలాంటప్పుడే అమ్మె య్యాలా కారు? " అని సణుక్కుంటూ హడా విడిపడుతూ వెళ్లిపోయింది.

అదుర్తున్న గుండెల్తో క్లబ్బు ముందు ఆటో దిగింది లీల. అప్పుడే అక్కడ కారు దిగిన మిసెస్ మూర్తిని చూసి "మా కారు రిపేరుకొచ్చింది" అని అబద్ధమాడింది ఆవిడ తను కార్లోకాక ఆటోలో రావడం చూసిందేమోనని. మిసెస్ మూర్తి లీలవైపు తల తిప్పి చూడనైనా చూడకుండా హైహీల్స్ టకటకలాడించుకుంటూ పోయింది లోపలికి.

లీలకి ఒళ్లుమండింది. 'నిన్న మిసెస్ పాఠక్ ఇంట్లో తనకి సపోర్టిస్తూ మాట్లా డింది. ఇవాళ ముఖం తిప్పుకుపోతోంది. హు... తిక్కపీనుగు! దీనికొక్కత్తికే డబ్బుం దనుకుంటోంది కాబోలు. కుక్కని కొడితే డబ్బులు రాలే రోజులు. దీని గొప్పేంటి? ' తిట్టుకుంటూ లోపలికి నడిచింది లీల.

లోపల తనతో మామూలుగా స్నేహం చేసేవాళ్లెవరూ కనబడలేదు లీలకి.

"వర్ధనమ్మగారేరీ? " అని స్వీపర్నడిగితే

"లోపల గదిలో మీటింగులో ఉన్నారు" అని చెప్పింది.

తన విషయం మీదే మీటింగు పెట్టు కుంటూ తను లేకుండానే మీటింగు మొద లెట్టెయ్యడమేవిటి? విసవిసా నడుచు కుంటూ పోయి వర్ధనమ్మగారి గది తలుపు తోసి లోపలకెళ్లింది. అక్కడ మిసెస్ సహా నీయే కాక తనకి సపోర్టిస్తున్న ఆడవాళ్లం దరూ ఉన్నారు. వికసించిన మొహంతో ముందుకు నడిచింది.

"ఏమ్మా? మేం మీటింగులో ఉన్నాం. కాసేపు బయట వెయిట్ చెయ్యి లీలా! పనే వున్నా ఉంటే తరువాత మాట్లాడదాం" అంది ప్రెసిండెట్ వర్ధనమ్మ.

లీల మొహం మాడిపోయింది. "మీరే మూడింటికల్లా వచ్చెయ్యమన్నారుకదా మేడమ్" అంది గొంతు పెగుల్చుకుని.

"సర్లే! వెయిట్ చెయ్యమంటున్నాగా? వెళ్లి వెయిట్ చెయ్యి" విసుగ్గా మొహం పెట్టి కటువుగా చెప్పింది వర్ధనమ్మ.

మనసు కుతకుత ఉడికిపోతుంటే ఇవత లకొచ్చేసింది లీల. కాసేపు స్పోర్ట్సు రూమ్‌లో అటూ ఇటూ తిరిగింది. అది మామూలుగా మెంబర్స్ వచ్చే టైమ్ కాదు. క్లబ్బంతా ఖాళీగా ఉంది. వెళ్లి లైబ్రరీలో కూచుని బల్లమీద పడేసున్న ఇంగ్లీషు పత్రి కలు తిరగేసి బొమ్మలు చూసింది. గంట న్నర కాలం అతి కష్టంమీద గడిచాక స్వీపరు వెంకమ్మొచ్చి "పెద్దమేడమ్‌గారు రమ్మంటున్నారు" అని చెప్పింది.

మొహాన గంటు పెట్టుకుని వర్ధనమ్మగారి గదిలోకి నడిచింది. ఇప్పుడక్కడ వర్ధనమ్మ గారు, క్లబ్బులో కొత్తగా చేరిన శైలజ తప్ప మరెవరూ లేరు.

"చూడమ్మా లీలా! మేం మీటింగులో చాలా విషయాలు చర్చించాంలే. వాటిలో నీ సంగతొకటి. అమ్మాయ్ శైలజా! మీటిం గయ్యాక మనం రాసుకున్న తీర్మానం చదివి వినిపించమ్మా" అంది కొప్పు సవరిం చుకుంటూ వర్ధనమ్మ.

చెవులప్పగించి వింది లీల. లీల వంటి సభ్యురాళ్ల సౌకర్యార్థం ఆ క్లబ్బులో తీర్మా నాలు ఇంగ్లీషులోనేకాక తెలుగులో కూడా రాయబడతాయి. అంచేత తీర్మానంలో ఏముందో అర్థం చేసుకోడం కష్టంకాలేదు లీలకి.

అంతా విన్న తరువాత లీల గ్రహించిన సారాంశం ఇది. సెక్రటరీ పదవులు రెండు ఏర్పడ్డాయి. కల్చరల్ సెక్రటరీ ఒకటి. పబ్లిక్ రిలేషన్స్ సెక్రటరీ ఒకటి. కాబట్టి ఇప్పుడు మిసెస్ సహానీతోపాటు మిసెస్ పాఠక్‌కి కూడా సెక్రటరీ హోదా కల్పించబ డింది. జాయింట్ సెక్రటరీ పదవులు ఇది వరకటిలా నలుగురుకాక ఇప్పుడు ఆరు సృష్టించబడ్డాయి. కాకపోతే సదరు జాయింట్ సెక్రటరీలు ఆరుగురి పేర్ల



లోనూ లీల పేరు మాత్రం లేదు. ఆ సంగతి అర్థమయ్యేసరికి లీలకి కళ్లల్లో నీళ్లు నిండుకొచ్చి గొంతు పూడుకుపోయింది.

ఎలాగో కంట్రోల్ చేసుకుని గొంతు పెగుల్చుకుంది. "అదేంటి మేడమ్. నాక న్యాయం చేశారు?" లీల ప్రశ్న పూర్తికాకుం డానే వర్ధనమ్మ అందుకుంది.

"అదేఅదే మన వాళ్లకెవరికీ నచ్చనిది. అన్నిటికీ అదేంటిదేంటని తిరగబడతావు. ఇందరు పెద్దలు నిర్ణయించారు కదాని ఊరుకోవు. అసలు నీవల్లనే ఎప్పుడూ లేనిది మెంబర్స్‌లో చీలికలొచ్చి గొడవల య్యాయి. నీ మెంబర్ షిప్ కూడా రద్దు చెయ్యమని వాళ్లందరూ పట్టుబట్టారు. నేనే పోన్లెండ్రా అని సర్ది చెప్పాను. ఇంకా హాళ్లందరూ చాలా అన్నార్లే. అసలు లోయ ర్‌స్టాటస్ వాళ్లకెవరికీ మెంబర్‌షిప్ లివ్వ ద్దనీ, అదీఇదీ చాలా మాట్లాడారు. నేనే ఇప్పటికి మెంబర్లయిన వాళ్లని పోన్లే పాపం ఉండనివ్వండీ ఏ ట్రాన్స్‌ఫరో అయితే వాళ్లే వెళ్లిపోతారు. అందాక ఉండనివ్వండీ అన్చెప్పా. అయితే కొత్త మెంబర్‌షిప్ లిచ్చే టప్పుడు ఇంకనించీ జాగ్రత్తగా ఉందాం అని నచ్చచెప్పాను"

లీలకి కాళ్లకింద భూమి కదిలిపోతున్న ట్టుంది. ఇదా వీళ్ల అసలు రంగు? నాది లోయర్ స్టాటసా? ఆ మిసెస్ పాఠక్ నాకు సపోర్టిచ్చినట్టే ఇచ్చి నా సమస్యని తన పదవికోసం ఉపయోగించుకుందా? రకర కాల ప్రశ్నలతో లీల బుర్ర తిరిగి పోయింది.

వర్ధనమ్మ ఇంకా మాట్లాడుతోంది. "ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే మనది సంఘ సేవ కోసం ఏర్పడ్డ మహిళా సంఘం కాదు కదా? గవర్నమెంటు గ్రాంటుల కోసం మనం ఎగబడంకదా? ఇదసలు అందరూ కలిసి కాసేపు రిలాక్సయి సరదాగా పార్టీలు, గేమ్సూ, కల్చరల్ ప్రోగ్రాములు పెట్టుకుని ఎంజాయ్ చెయ్యడం కోసమూనూ, మెయి న్‌గా రకరకాల కాంటాక్ట్స్ కోసమూ పెట్టు కున్న క్లబ్బాయె. మరందుకే ఎవరిని పడితే వాళ్లని మెంబర్సుగా చేర్చుకోవద్దని వాళ్లం దరూ ఒకటేగోల. సరేలెండ్రా లీలవల్ల మనకి నష్టమేవీలేదు. చాలా పనులు చాలా చక్కగా చేసింది! మనం అలా శ్రమపడా లేమూ చెయ్యాలేం! అని చెప్పాననుకో"

ఇంకా ఆవిడలా అంతూపొంతూ లేకుండా చెప్తూనే ఉంది. లీల ఇంక భరిం చలేక ఒక్క గెంతులో లేచి బయటపడింది. ఆటోలో ఇంటికొస్తున్నంతసేపూ వర్ధనమ్మ మాటలు చెవిలో మోగుతూనే ఉన్నాయి.

'వాళ్లు శ్రమ పడే పనులు చెయ్యలేరు, చెయ్యరు కాబట్టి ఖర్చులేకుండా అలాంటి పనులు నేను శ్రమపడి చేస్తున్నానుకాబట్టి ఆ చాకిరీ కోసం పోన్లే పాపం అని నన్ను మెంబరుగా ఉండనిస్తున్నారా? ఛీఛీ కుళ్లుపీ నుగులు! జిత్తులమారి నక్కలు. ఛీ నన్ను వెర్రిదాన్ని చేసి వాళ్ల వెనకాల ఇన్నాళ్లూ తిప్పుకుని... ఆలోచిస్తుంటే లీలకి దుఃఖం ముంచుకొచ్చి ఆపుకోలేక వెక్కివెక్కి ఏడ్చింది.

ఆటోవాడు బిత్తరపోయి ఆటో స్లో చేశాడు. "ఎందుకాపావ్? పోనీ పోనీ" అని కీచుగా అరిచింది లీల తన బాధనీ కోపాన్నీ ఉక్రోషాన్నీ అంతా ఆ కేకలోనే నింపేసి.

★ ★ ★

సాయంత్రం మోహన్రావు ఇంటికొచ్చేసరికి జరీకండువా, ఇస్త్రీ పంచాలాల్చీలు సింగా రించి పచార్లు చేస్తున్న అప్పలనర్సయ్య కంటబడ్డాడు. అతని ముస్తాబు ఎందుకో అర్థమై మొహం చిట్లించుకున్నాడు మోహ న్రావ్. ఆ రోజు సాయంత్రం రాజీవ్‌ని తీసుకుని ఎన్ఆర్ఐ హాస్పిటల్‌కి తీసుకు వెళ్లడానికి ఒప్పుకున్న సంగతి అతను మర్చే పోయాడు. ఇప్పుడు అప్పలనర్సయ్యని చూడగానే గుర్తొచ్చింది. ఎలా తప్పించుకో వాలా అని ఆలోచించాడు.

అసలు క్లబ్బులో పేకాట, మందు పార్టీ




పెద్ద ఎత్తున ఏర్పాటు చేశారు మిత్రబృందం. ఇంటికొచ్చి స్నానం చేసి డబ్బు తీసుకుని పోదామన్న ఉద్దేశంతో ఇంటికొచ్చాడు మోహన్‌రావు. ఈ సాయంత్రం క్లబ్బుకెడితే మళ్లీ డేటు మారాక కానీ ఇంట్లో అడుగు పెట్టడం కుదరదు. అంత భారీ ఏర్పాట్లు జరుగుతున్నాయి క్లబ్బులో. ఇప్పుడీ ముసలాయన కొత్తకొత్త ఆస్పత్రులు చూసే సంబడంలో జలగలా పట్టుకునేలా ఉన్నాడనుకున్నాడు. ఆ ఆస్పత్రిలో ఏవన్నా సినిమాలూ డాన్సులూ చూపిస్తారా? ఈ ముసలాయనకి అది చూడాలన్న మోజెందుకో అని మనసులో విసుక్కున్నాడు. రాజీవ్‌ని బాగు చేసెయ్యాలన్న ఆత్రంకన్నా అంత పెద్దాస్పత్రిలో తనకు తెలిసినవాళ్లు కనబడితే దర్పం ఒలకబోసి ఓసారి అల్లుడిముందు తన పరపతి ప్రదర్శించుకోవాలన్న ఆబ అప్పలనర్సయ్యకెక్కువగా ఉందన్న సంగతి మోహన్రావుకి బాగా తెలుసు.

"ఆ గాడిదసలున్నాడా ఇంట్లో? ఎట్టైనా పోయాడా? " అనడిగాడు మోహనరావు మామగార్ని.

"ఎక్కడికీ పోలా. ఇంట్లోనే ఉన్నాడు. పదపద, తొందరగా బయల్దేరితే తొందరగా వొచ్చెయ్యొచ్చు" అన్నాడు అప్పలనర్సయ్య.

"వాడిని తయారుచేసి తీసుకురా మావా. మనిద్దరం వెళ్ళి ఏంచేస్తాం? " అన్నాడు మోహనరావు తన గదిలోకి వెడుతూ.

అప్పలనర్సయ్య హడావిడిగా రాజీవ్ గదిలోకి వెళ్ళాడు. రాజీవ్ ఊరికే మంచంమీద పడుకుని ఇంటికప్పుకేసి శూన్యదృక్కులతో చూస్తున్నాడు.

"లేవరా. లే... లేచి బట్టలు మార్చి తయారవు. నిన్ను మాంచి అమెరికా డాక్టరుకి చూపిస్తాం" అని సంబరంగా చెప్పి ఇవతలకొచ్చి మళ్ళీ పచార్లు మొదలెట్టాడు అప్పలనర్సయ్య.

గబగబా స్నానం చేసి బట్టలు మార్చుకుంటున్న మోహనరావు మంచంమీద ముసుగుతన్ని మూడంకెవేసిన లీలని చూశాడు. "క్లబ్బుకెడతానన్నావుగా? వెళ్ళ లేదా? " అని అడిగాడు.

"వెధవక్లబ్బు! దిక్కుమాలిన క్లబ్బు! దొంగ పీనుగుల క్లబ్బు" అని సమాధానం వచ్చింది ముసుగులోంచి.

ఇంకా మాట్లాడితే ఏం తుఫాను ముంచుకొచ్చి మీద పడుతుందోనని ఆ సంభాషణకక్కడే ఫుల్‌స్టాప్ పెట్టి గదిలోంచి ఇవతలికొచ్చేశాడు మోహనరావు.

పచార్లు అతిగా చేసి కాళ్లు నెప్పెట్టి సోఫాలో కూలబడుతున్న అప్పలనరసయ్యను చూసి "ఏడీ వాడు? రాడా? " అనడిగాడు మోహనరావు.

"రెడీ అవమని చెప్పాను. ఏరా రాజీవ్! రెడీయేనా? " అని కేక పెట్టాడు అప్పలనరసయ్య.

రాజీవ్ తన గది గుమ్మందగ్గర నిలబడి, "నేను మనస్వి డాక్టరు దగ్గరకే వెడతాను. ఇంకెక్కడికీ రాను" అన్నాడు.

"సర్లే... అయితే అక్కడికే వెళ్లు. మావా! నువ్వు తయారైవున్నావుగా వాడితోపాటు నువ్వూ వెళ్లు. నాక్కొంచెం పనుంది. అట్టా వెళ్లొస్తా" అని తొందరపడ్డాడు మోహనరావు.

"అట్టాంటే ఎట్టా అల్లుడూ! ఒరేయ్ నువ్వు పద. బట్టలు బాగానే ఉన్నాయిలే. మార్చక్కర్లేదు. బయల్దేరు. ముగ్గురం ఆటోలో పోదాం" అంటూ రాజీవ్‌ని ఇంట్లోంచి ఈడ్చుకొచ్చినంత పనిచేసి అల్లుడ్ని తొందరపెట్టి ఇద్దర్నీ ఆటో ఎక్కించి కూచున్నాడు అప్పలనరసయ్య.

ఆటోలో పోతూండగా, "ఒరేయ్! రాజీవ్! ఆ రామారావు నర్సింగ్ హోమ్‌కి మన చుట్టాలందరూ వస్తుంటారు. నువ్వు మాటి మాటికీ అక్కడ మెంటల్ డాక్టరు దగ్గరకెడితే వాళ్లందరూ ఆరాలీస్తారు. మీ నాన్న పరువేంగావాలి? " అనడిగాడు.

రాజీవ్ నిర్వికారంగా మొహంపెట్టి "ఉంటే కదా అసలు!" అన్నాడు.

"నోర్ముయ్ వెధవా! రోడ్డుకడ్డం పడే నీకేం తెలుసురా పరువంటే ఏంటో!" అన్నాడు మోహనరావు కళ్లెర్రచేస్తూ.

"నువ్వుండల్లుడూ! ఒరేయ్! ఏంటిరా ఆ మాటలూ? నాన్ననట్టా అనచ్చా? అసలు నీకీ తలతిక్కలన్నీ ఒదిలించడానికే నిన్ను తీసుకుపోతున్నాం" అన్నాడు అప్పలనరసయ్య. రాజీవ్ ఏంమాట్లాడకుండా కూచున్నాడు.

★ ★ ★

పెద్ద రాజభవనంలా ఉన్న ఆ కార్పొరేట్ హాస్పిటల్‌లోకి అడుగుపెడుతుంటే తమ స్టేటస్ పదింతలు పెరిగి పోయినట్టు ఫీలయిపోయారు మోహనరావు, అప్పలనరసయ్యా ఎవరి మనసులో వారు.

నీటుగా టక్ చేసుకుని టై కట్టుకుని రిసెప్షను దగ్గర కూర్చున్న కుర్రాడు మోహనరావు బృందాన్ని పావుగంట వెయిట్ చేయించి యాభై రూపాయలు తీసుకుని కంప్యూటర్ టకటకమనిపించి ఒక కాయితం చేతిలో పెట్టి పక్క కంప్యూటర్ దగ్గరకి పంపించాడు.

అక్కడ కూడా మొదటివాడిలాగే పరమ నీటుగా కూచుని దిక్కులు చూస్తున్న కుర్రాడు మొదటి కంప్యూటర్ వాడిచ్చిన చీటీ తీసుకుని చదివినట్టు అభినయించి, మరో యాభైరూపాయలు తీసుకుని తన కంప్యూటర్‌ని కూడా టకటకలాడించి, కిర్రు కిర్రుమని మరో చీటీ ప్రొడ్యూస్ చేసి మోహనరావు చేతిలో పెట్టి ఎటు వెళ్ళాలో చెప్పాడు.

ఆ కుర్రాడు చెప్పిన రూమ్ దగ్గరకెళ్ళి చీటీమీది నంబరు, చీటిలో డాక్టరు పేరు, తలుపుమీదున్న నేమ్‌ప్లేట్‌లో పేరు ఒకటౌనో కాదో చూసుకున్నాక, అక్కడి మహా నీటు కుర్రాడిచేత "అక్కడ కూచోండి పిలుస్తాం" అని చెప్పించుకుని, అక్కడున్న రంగుల రంగుల కుర్చీల్లో కూచుని పిలుపు కోసం నిరీక్షించారు.

గోడమీద ఎత్తుగా పెట్టున్న టీవీకేసి గుడ్లప్పగించి కొంతసేపు చూశాక చుట్టూ ఉన్న మనుషుల మొహాలు పరిశీలించాడు అప్పల నర్సయ్య తనకి తెలిసిన మొహం ఏదన్నా కనిపిస్తుందేమోనని. కొందరు తన ఊరి వాళ్ళలాగే ఉన్నారుగానీ, ఈ వెధవ సిటీల్లోకొచ్చాక పల్లెటూరి వాళ్ళు కూడా ఆ కొత్తరకం బట్టలేవో తొడుక్కుని, ఎప్పుడూ ఏదో బిజీగా ఉన్నట్టు భుజాలెత్తిపెట్టి తిరిగేస్తూ వేరే లోకంనుంచి వచ్చిన వాళ్ళల్లాగా కనిపిస్తారు. బాగా తెలిసినవాళ్ళు కూడా ఎవరో కొత్తవాళ్ళన్నట్టు బెదరగొడ్తారు. మరందుచేత అప్పలనర్సయ్య ఎవర్నైనా పలకరించే సాహసం చెయ్యలేదు.

గంటన్నర తరవాత మోహనరావు బృందానికి పిలుపొచ్చింది. సింహం గుహలోకెళ్తున్న గొర్రెల్లాగా డాక్టరు గదిలోకి పోయారు. "పేషెంటెవరూ?" అనడిగి, చెప్పాక రాజీవ్‌ని బయట కూచోమన్నాడు నీలం సూటులో నున్నగా మెరుస్తున్న డాక్టరు.

రాజీవ్ బయటకెళ్ళాక, "మీ ఇద్దరూ అతనికేమవుతారు?" అనడిగాడు. మోహనరావు జవాబు చెప్పాడు.

"ఏమిటి ప్రాబ్లెమ్? చెప్పండి" అనడిగాడాయన మళ్ళీ.

ఏంచెప్పాలో తెలియలేదు మోహనరావుకి.

"కుర్రోడు తాగుడు మరిగాడండి. రోజుకో గొడవ నెత్తిమీదకి తెస్తుంటాడు" సింపుల్‌గా తేల్చి చెప్పేశాడు అప్పలనర్సయ్య.

"ఓహో... ఇంట్లో ఏమైనా గొడవలున్నాయా?" చాలా రొటీన్‌గా అడిగాడు నీలం సూటు నున్నటి డాక్టరు.

"ఏంలేవు" అన్నాడు మోహనరావు మరీ రొటీన్‌గా చూపుల్తోనే అప్పలనర్సయ్య నోరు




మూయించేస్తూ.

"సరే... మీరు బయటికి వెళ్ళి పేషెంటుని పంపించండి" అన్నాడు డాక్టరు.

ఇద్దరూ బయటికొచ్చి రాజీవ్‌ని లోపలికెళ్ళమన్నారు. రాజీవ్ వెళ్ళాక దిక్కులు చూస్తూ ఆలోచించాడు మోహనరావు. రామారావుగారి నర్సింగ్ హోమ్‌లో డాక్టరు గారి చుట్టాలన్చెప్పి తనకీ తన కొడుక్కీ జరిగిన రాయల్ ట్రీట్‌మెంట్, రాచమర్యాదలు గుర్తుకొచ్చి మోహనరావుకి దాదాపు కళ్ళనీళ్ళొచ్చినంత పనయింది. గంటన్నర వెయిట్ చేయించి మూడు ముక్కలు మాట్లాడాడీ డాక్టరు.

డాక్టర్ మనస్వి గుర్తుకొచ్చాడు. ఆయన పేషంట్లమీద చూపించే శ్రద్ధ గుర్తొచ్చింది. ట్రీట్‌మెంట్ మొదలెట్టిన మూడోరోజుకల్లా రాజీవ్‌లో వచ్చిన మార్పు గుర్తొచ్చింది.

ఇవన్నీ ఆలోచిస్తుంటే మోహనరావుకి విపరీతంగా వైరాగ్యం ముంచుకొచ్చింది. ఎప్పుడో ఎవరో ముష్టివాడు పాడుతుండగా విన్న పాట గుర్తొచ్చి 'ఏమి జన్మము ఏమి జీవనమూ నరుడా?' అని మనసులోనే పాడుకుంటూ కూచున్నాడు.

పాట పూర్తిగా పాడుకోకముందే రాజీవ్ వచ్చి "నిన్ను రమ్మంటున్నారు నాన్నా" అని చెప్పి కూచున్నాడు.

కాళ్ళీడ్చుకుంటూ లోపలికెళ్ళాడు మోహనరావు. వెనకాలే అప్పలనర్సయ్య! ఇద్దర్నీ కళ్ళద్దాల పైనుంచి క్రిమినల్స్‌ని చూసినట్టు చూసి, "కూచోండి. నేనేం అడిగినా మీ అబ్బాయి ఒక్కమాట కూడా మాట్లాడలేదు. అస్సలు కోఆపరేట్ చెయ్యలేదు. అడ్మిట్ చెయ్యండి. ఓ మూడురోజులపాటు ఇన్‌పేషంటుగా ఉంచి అబ్జర్వ్ చేద్దాం. రేపొచ్చేటప్పుడు మీ మిసెస్‌ని కూడా తీసుకురండి. మాట్లాడదాం. వెయిటింగ్ హాల్‌కి కుడివైపున చిన్న కౌంటరుంది చూశారా? అక్కడ అడ్మిషన్ డిటెయిల్స్ చెప్తారు కనుక్కోండి. మీకు సింగిల్‌రూమా ఏంకావాలో చూసుకోండి. వన్‌మోర్‌థింగ్! ఇ.సి.జి, సి.టి. స్కాన్ చేయించమని రాశాను. ఆ కౌంటర్ దగ్గరే ఎంత పే చేయాలో చెప్తాడు. కనుక్కుని పే చేసెయ్యండి. అన్నీ వాళ్ళే చూస్తుకుని టెస్టులు చేసేస్తారు. రేపొచ్చేటప్పుడు టెస్ట్ రిపోర్ట్స్ తీసుకురండి. మీరు వెళ్ళచ్చు" ఎదుటి వాళ్ళకి నోరు తెరిచేందుకు అవకాశం ఇవ్వకుండా చెప్పేసి గంట మోగించేశాడు డాక్టరు.

చెవులప్పగించి ఆయన చెప్పిందంతావిని, 'మా బాబే! మా పెరట్లో చెట్లకి వందనోట్లు విరివిగా కాస్తున్నాయి. ఇంకా ఎవరెవరికి ఎంతెంతివ్వాలో చెప్పుబాబూ. బొట్టెట్టి ఇచ్చేసి పోతాం' అనుకున్నాడు మోహనరావు కసిగా. డాక్టరుకేసి గుర్రుగాచూసి, మౌనంగా బయటకి నడిచాడు.

ఇవతలకొచ్చాక, "అదుగో ఆ కౌంటరు దగ్గరకేకదా వెళ్ళి టెస్టుల గురించీ రూమ్ గురించీ కనుక్కోమన్నాడు డాక్టరు? " అన్నాడు అప్పలనర్సయ్య.

"అంటాడంటాడు. ఆయనకేం? ఎన్నైనా అంటాడు" అని సణుక్కుంటూ కౌంటరు దగ్గరకెళ్ళాడు మోహన్రావు. అక్కడి సీటుగాడికి డాక్టరు రాసిచ్చిన చీటీ చూపించాడు.

అది తీసుకుని వాడు ఎందుకో తెలీకుండా కంప్యూటరోసారి టకటకలాడించి కిర్రుకిర్రుమనిపించాడు. తరువాత తెలెత్తి, "సీటీ స్కానుకి పదహారొందలు. ఇ.సి.జికి ఎనిమిదొందలు పే చెయ్యండి. మిగతా టెస్టులన్నిటికీ కలిపి ఏడొందల యాభై అవుతుంది. మా బోయ్ తీసుకెళ్తాడు మిమ్మల్ని స్కాన్ తీసే చోటికి. ఇంక అడ్మిషన్ కావాలంటే సింగిల్ రూమ్ ఒక్కటే ఖాళీ ఉంది. రోజుకి ఆరొందలు" అన్నాడు వాడు కొంచెం మర్యాదగా, కొంచెం అసహనంగా.

మోహన్‌రావుకి ఉన్న సహనం చచ్చింది. " ఇప్పుడేవస్తా" అని చెప్పి రాజీవ్ చెయ్యి పట్టుకుని బరబరా బయటకి ఈడ్చుకుపోయాడు. వాళ్ళిద్దరి వెనకా పరుగు పెడుతూ



ఇవతలకొచ్చి ఆయాసపడ్డాడు అప్పల నర్సయ్య

"అదేంటల్లుడూ? డాక్టరు చెప్పిన టెస్టులు చేయించవా? " అయోమయంగా అడిగాడు అప్పలనర్సయ్య.

"చేయిద్దాం, చేయిద్దాం. నీపొలంలో కాసిన వందనోట్లు ఓ బస్తాడు పట్టుకురా. ఇంటిల్లిపాదిమీ అన్ని రకాల టెస్టులూ చేయించుకుందాం" కసిగా అంటూ ఆటో పిలిచాడు మోహన్‌రావు.

★ ★ ★

ముసుగులో దూరి మనసారా చాలాసేపు ఏడ్చింది లీల. మోహన్‌రావు వాళ్ళు వెళ్ళిపోయిన కొంతసేపటికి లేచి మొహం కడుక్కుంది. తరువాత టీ కలిపించుకు తాగుతూ క్లబ్బులో తనకెంత అన్యాయం జరిగిందో తల్లికి వివరించి చెప్పి నోరారా క్లబ్బులో మహిళా రత్నాలందర్నీ పేరుపేరునా తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టింది.

"వాళ్ళ నోళ్ళుపడ. నిన్నంతంత మాటలన్నార్టే పీనుగులూ" మెటికలు విరుస్తూ తను కూడా యథాశక్తి తిట్లు కురిపించి కూతురికి మద్దతు ప్రకటించుకుంది మణెమ్మ.

"దిక్కుమాలిన క్లబ్బు! ఆ ధొంగమొహాల క్లబ్బుకింక చచ్చినాపోను" అని శపథం పట్టింది లీల.

తల్లీ కూతుళ్ళ తిట్ల దండకం, శాపనార్థాలు, శపథాలూ అన్నీ పూర్తయ్యేసరికి ఇద్దరికీ తిన్నదంతా అరిగిపోయి కడుపులో ఎలకలు పరిగెత్తాయి.

"ఏరీ సాయంత్రవనగా పోయారు, ఇంకా రారేవిటీ వీళ్ళు? " అని విసుక్కుంటుండగా తొమ్మిదింటికి ఇంటికొచ్చారు మోహన్‌రావు బృందం.

"ఏవన్నాడు కొత్త డాక్టరు? " కుతూహలంగా భర్తనడిగింది లీల.

"ఏవంటాడు? మన జమీందారుగారు అక్కడ నోరిప్పితే కదా? మీవాడు మాటాడట్లేదూ, ఇక్కడో మూడు రోజులు అడ్మిట్ చేసి ఉంచండీ అప్పటిగ్గానీ తెలీదు జబ్బేమిటో. రేప్పొద్దున్న మీ ఇంటిల్లిపాదీ వొచ్చి ఇక్కడ పడిగాపులు పడండి అంటున్నాడు. పెద్దాస్పత్రిలో పెద్ద ఫారిన్‌డాక్టరు. వాళ్ళకే తెలిసేడవలేదు వీడిరోగం ఏవిటో. ఆ పోలీసు స్టేషనులో ఓ రెండ్రోజులుండనిచ్చుంటే అసలందరి రోగాలూ కుదిరిపోయుండేవి" అంటూ ఇల్లెగిరిపోయేలా రంకెలు పెట్టాడు మోహన్‌రావు.

అతని అరుపులకు లీల, మణెమ్మ హడిలిపోయి నోళ్ళు నొక్కేసుకుని మొహాలు చూసుకున్నారు. మోహన్‌రావు బట్టలు మార్చుకోడానికి గదిలోకెళ్ళగా చూసి, "ఆ డాక్టరేవేవో ఎక్సరేలు, టెస్టులూ రాశాడే. మీ ఆయన డబ్బుకి మొహం చూసుకుని అవేవీ చేయించలేదే. పిల్లాడి ఆరోగ్యంకన్నా డబ్బు ముఖ్యమా? " అన్నాడు అప్పల నర్సయ్య.

"ఆహాఁ! అయ్యో పాపం అల్లాగా? మరైతే నీ సొంత కష్టార్జితం డబ్బుతో అవేవో చేయించకపోయావా మావా? నీ మనవడి ఆరోగ్యంకన్నా నీకు డబ్బు ముఖ్యమా? " అన్నాడు మోహన్‌రావు వెనకాలే ప్రత్యక్షమై. అప్పలనర్సయ్య బిక్కచచ్చిపోయి నోరుమూసేసుకున్నాడు.

★ ★ ★

ఇంట్లోవాళ్ళ అరుపులు, కేకలు, వాదనలు, వాగ్వాదాలు అన్నీ సద్దుమణిగాక సరోజ నెమ్మదిగా రాజీవ్ గదిలోకి వెళ్ళింది.

ఇంటికి రాగానే గదిలో మంచంమీద వాలిపోయాడు రాజీవ్. ఎవరికోపాల్లో వాళ్ళుండి అతన్ని భోజనానిక్కూడా ఎవరూ లేపలేదు. ఎలా ఉన్నాడో చూడాలని వచ్చిన సరోజ అతను గాఢ నిద్రలో ఉన్నాడనుకుంది. పక్కనే కుర్చీలో కూర్చుంది.

సరోజవచ్చి కుర్చీలో కూర్చోవడం రాజీవ్ గమనించాడు. అతనికి నిద్ర పట్టలేదు. అలాగని లేచి ఎవరితోనూ మాట్లాడాలనీ లేదు. సరోజవైపు తలతిప్పి చూడకుండా




కిటికీలోంచి చీకట్లోకి చూస్తూ అలాగే పడుకున్నాడు.

సరోజకి జీవితమంతా చీకటైపోయినట్టుంది. బతుకంతా అగమ్యగోచరంగా ఏ దిక్కుగా పయనిస్తోందో తెలియకుండా తుఫానులో చిక్కుకున్న నౌకలా మనసు ఊగిపోతోంది. ప్రతిచిన్న విషయానికీ ఒకళ్ళమాటొకళ్ళు అర్థంచేసుకోకుండా పెద్ద పెద్ద గొడవలు సృష్టించుకునే పెద్దవాళ్ళ మధ్య బతుకు దుర్భరం అనిపించింది. 'వాళ్ళగొడవలే వాళ్ళవి. మాకేదో ఇంత తిండి పడేస్తే చాలనుకుంటారు వాళ్ళు. కాస్త ఆగి మా సమస్యలు అర్థంచేసుకోడానికెందుకు ప్రయత్నించరు? ఎప్పుడూ వేధించే సమస్యే మళ్ళీ సరోజ మెదడుని తినెయ్యడం మొదలెట్టింది.

'వాడు కొత్త డాక్టరు దగ్గరకి రాను' అని ఖచ్చితంగా చెప్పినా వాడ్ని బలవంతానలాక్కెళ్ళడమెందుకు? మళ్ళీ వాడక్కడేమీ మాట్లాడలేదని తిట్టుకోవడమెందుకు? వాడి సమస్యేమిటో అడిగి వాడికిష్టమైనట్టు చేస్తే వీళ్ళ గొప్పతనం ఏదో తరిగిపోతుంది కాబోలు. అమ్మకి అమ్మా అంతే. నాన్నకి నాన్నా అంతే' నిట్టూర్చింది సరోజ.

ఇదివరకెప్పుడో చిన్నచిన్న పోర్షన్లుగా ఉండే ఇంట్లో జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది సరోజకి. పక్కపోర్షనులో వయసు ముదిరిపోయి పెళ్ళికాకుండా ఒక అమ్మాయి ఉండేది. తండ్రి మూర్ఖత్వం, తల్లి తెలివితక్కువవల్ల ఆ అమ్మాయికి వచ్చిన ప్రతిసంబంధమూ తప్పిపోతుండేది. తండ్రి మూర్ఖుడేకాదు, నోటి దురుసువాడుకూడా. ఒకసారి చూసుకోడానికి వచ్చిన పెళ్ళికొడుకు పెళ్ళికి ఒప్పుకోవడందాకా వచ్చాడు. ఆఖరిదశలో పిల్లతండ్రి అనవసరంగా నోరు పారేసుకోడం మూలాన తాంబూలాల దాకా రాబోయిన పెళ్ళిసంబంధం వచ్చిన దారినే వెనక్కిపోయింది. ఆరోజు ఆ అమ్మాయి చేసిన గొడవ సరోజకిప్పటికీ జ్ఞాపకం ఉంది.

అంతంత మాత్రం చదువు, ఉద్యోగం సద్యోగం ఏమీ లేక అసలు మరే కాలక్షేపం లేక పెళ్లిమీదే ఆశలన్నీ పెట్టుకుని ఎదురు చూస్తూ బతుకుతున్న ఆ పిల్ల ఆ రోజు, "ఇలాంటి తల్లిదండ్రులు శత్రువులక్కూడా వద్దు దేవుడా" అంటూ తల గోడకేసి కొట్టుకుని మరీ ఏడ్చింది. సరోజకి ఇప్పుడలా ఏడ్వాలని ఉంది. మళ్ళీ భారంగా నిట్టూర్చింది సరోజ.

సరోజ నిట్టూర్పులు వింటూ ఆమె ఎందుకో చాలా బాధపడుతోందని గ్రహించాడు రాజీవ్. నెమ్మదిగా ఆమెవైపు తిరిగి, "ఏం అక్కా! పడుకోలేదా? " అని పలకరించాడు.

ఉలిక్కిపడింది సరోజ. "లేచే ఉన్నావా? నిద్రపోలేదా? " అంది. లేదన్నట్టు తలూపాడు రాజీవ్.

"అక్కడ డాక్టరుగారితో అస్సలు మాట్లాడలేదా? ఎందుకని? " సౌమ్యంగా అడిగింది సరోజ. రాజీవ్ కాసేపు ఆలోచించాడు.

"ఎందుకంటే ఏంచెప్పను? నువ్వర్థం చేసుకోగలవనుకుంటా. మనస్వీగారితో అయినా ఒక్కరోజులో నా బాధంతా చెప్పెయ్యలేదుగా? ఆయనతో కూడా మొదట రెండుమూడు రోజులసలు మాట్లాడలేదు సరిగ్గా. దాదాపు రెండు వారాలపాటు మాట్లాడగా మాట్లాడగా ఫ్రీగా మనసులో ఉన్న బాధ చెప్పుకోగలిగాను. ఆయన కూడా నన్ను తొందర పెట్టకుండా ఎంతో సహనంగా వెయిట్‌చేసి నన్ను మాటాడించేవారు. ఇప్పుడు మళ్లీ మరో కొత్తాయనతో అదంతా చెప్పుకోవడం అంత తేలికైన పని కాదు. మనస్వీగారితో నాకొకరకం బంధం ఏర్పడింది. దాన్ని రాపో అనచ్చులేదా ఎటాచ్‌మెంట్ అనచ్చు అది ఎవరితో పడితే వాళ్లతో మళ్లీ అంత ఈజీగా కుదరదు. ఆ మాట నాన్నావాళ్లు అర్థం చేసుకోరు. ఊరికే కేకలేస్తారు" వివరించాడు.

సరోజ ఒప్పుకుంది. "అవునులే నేనర్థం

చేసుకోగలను. అమ్మానాన్న సంగతి కొత్తకాదుగా! రేపు సాయంత్రం మనిద్దరం వెడదాం మనస్విగారి దగ్గరికి, సరేనా?" అంది.

సరేనన్నట్టు తలూపాడు రాజీవ్.

"సాయంత్రం మీరెళ్లిపోయాక ఉత్పల్ వచ్చాడు" అంది సరోజ మాటమారుస్తూ.

చటుక్కున లేచి కూచున్నాడు రాజీవ్.

"ఏమన్నాడు? ఎందుకొచ్చాడు? ఊరికేనా? లేకపోతే ఏమయినా చెప్పడానికొచ్చాడా? నేనెక్కడికెళ్లానని చెప్పావు?" ఆత్రంగా ఎన్నో ప్రశ్నలడగాలనుకున్నాడు. ఏమీ అడగలేకపోయాడు. వాడికి తెలిసిపోయిందేమో నేను స్కూటరు దేనికో గుద్దించేసి పోలీసుల చేతుల్లో పడ్డానని. ఒకవేళ తెలియకపోయినా అక్క చెప్పే ఉంటుంది. వాడేమనుకున్నాడో! ఎంత చవకబారుగా అనుకున్నాడో నా గురించి! ఇలా ఆలోచిస్తూ సరోజని ఏమీ అడక్కుండా నెమ్మదిగా దిండుమీద వాలిపోయాడు.

రాజీవ్ కళ్లల్లో నీళ్లు తిరిగాయి. తను పోలీస్‌స్టేషన్‌లో ఓ మూల కూచోడం, అక్కడున్నవాళ్లతో ఏదేదో వాగడం లీలగా గుర్తొచ్చింది. తనేం వాగాడు? వాడెవడో తన మాటలకి నోటికి చెయ్యడ్డం పెట్టుకుని వెకిలిగా నవ్వాడు. కానీ ఇంకొక ఆయన తనతో ఎంతో లలితంగా, కరుణతో మాట్లాడాడు. ఎస్సై కాబోలు ఆయన మాటలు వింటుంటే ఎంతో హాయిగా అనిపించింది. అక్కడే ఉండిపోవాలనిపించింది. తండ్రి, తాత రావడం, తనని ఇంటికి తీసుకురావడం అంతా కలలోలాగా స్పష్టాస్పష్టంగా కళ్ల ముందు కదిలింది.

జరిగిన దాంట్లో అక్కకెంత తెలుసు? ఉత్పల్‌కి ఏంచెప్పి ఉంటుంది? రాజీవ్ కళ్లు తెరిచి సరోజ ముఖంలోకి చూడలేకపోయాడు.

సరోజ మరోరకంగా ఆలోచిస్తోంది. ఉత్పల్ రావడం, ఎప్పుడూలేనిది చాలాసేపు కూచోడం తనతో మాట్లాడడం గుర్తు చేసుకుంది. ఉత్పల్ చాలా విషయాలు చెప్పాడు. వయసుకు మించిన తెలివితేటలు, మనోనిబ్బరం ఉన్న ఉత్పల్ మాటలు సరోజనెంతో ఆలోచించేలా చేశాయి.

తండ్రి ఆఫీసులోను, ఇంకా చాలా ప్రభుత్వ కార్యాలయాల్లోను కరప్షన్ ఛార్జెస్‌తో కొందర్ని అరెస్టు చేశార్ట. అరెస్టయి, ఉద్యోగాల్నుంచి సస్పెండయి, కొందరికి ఉద్యోగం పూర్తిగా ఊడిపోయి వాళ్లెదుర్కొంటున్న సమస్యలు ఎన్నెన్నో చెప్పాడు. వాళ్ల మీదే ఆధారపడి బతుకుతున్న వాళ్ల కుటుంబాల గురించి చెప్తుంటే బాధతో గుండె బరువెక్కిపోయింది సరోజకి.

ఉత్పల్ చెప్పినవన్నీ గుర్తొస్తుంటే తన తండ్రి కూడా అరెస్టయితే? అని ఆలోచించింది సరోజ. అప్పుడు తమ జీవితాలెలా ఉంటాయి? తమ్ముడు సంతోషిస్తాడేమో! తను? తనకేమీ రియాక్షనుండదు బహుశ! ఇప్పుడెంత నిర్లిప్తంగా ఉందో అప్పుడూ అలాగే ఉంటుంది. కానీ అమ్మ... ఒక్కసారి ఒళ్లు జలదరించినట్టయింది సరోజకు. "అమ్మ తట్టుకోలేదు. ఈ విలాసాలూ, డబ్బుతో కొనుక్కోగలిగే కంఫర్ట్స్ ఇవేవీ లేకపోతే అమ్మ కుమిలిపోతుంది. ముఖ్యంగా ఇరుగుపొరుగు ఏమనుకుంటారోనని కుంగిపోతుంది.

ఆలోచనల్లోంచి తేరుకుని బెడ్‌లైట్ వెలుగులో రాజీవ్ ముఖంలోకి పరిశీలనగా చూసింది సరోజ. కళ్లు మూసుకుని ఉన్న ఆ ముఖం ప్రశాంతంగా లేదు. మనసులోని ఆందోళన, విషాదం అంతా అతని ముఖంలో ప్రతిఫలిస్తున్నట్టుగా ఉంది. వీడికి ఉత్పల్ చెప్పిన సంగతులేవీ చెప్పకపోతేనే నయమేమో అనుకుంది. ఉత్పల్ కూడా అదే సలహా ఇచ్చాడు. రాజీవ్ మూడ్ బాగా లేకపోతే వాడికి అసలేమీ చెప్పొద్దన్నాడు.




"సాయంత్రం ఊరికే కబుర్లు చెప్పుకుందామని వచ్చాడురా ఉత్పల్. నువ్వు లేవనేసరికి కాసేపు కూచుని వెళ్లిపోయాడు. రేపు మార్నింగ్ క్లాసులన్నీ క్యాన్సిలయ్యాయిట చెప్పమన్నాడు. మధ్యాహ్నం కూడా ఒక్క క్లాసే ఉందిట. నువ్వు కాలేజీకి రాకపోయినా ఫర్వాలేదన్నాడు. రేపు సాయంత్రం తనే మనింటికి వస్తానన్నాడు" అంది.

"ఆమాట చెప్పడానికి వచ్చాడా? " అని అడిగాడు అనుమానంగా.

అవునన్నట్టు తలూపి లేచి నిలబడింది సరోజ. "పడుకో. నేను కూడా కాసేపు చదువుకుని పడుకుంటా" అంటూ గుమ్మంవైపు రెండడుగులు వేసి ఆగి వెనక్కి తిరిగి,

"రేపు మనం డాక్టర్ మనస్విగారి దగ్గరకెడదామా? " అనడిగింది.

"ఊ... వెడదాం" అనేసి దిండులోకి మొహం దూర్చేశాడు రాజీవ్.



రాత్రంతా కలతనిద్రలో గడిపిన సరోజకి పొద్దున్నే మెలుకువ రాలేదు. ఎన్నడూ లేనిది అందరికన్నా ముందు లేచాడు మోహనరావు. లేచినవాడు వెంటనే తయారై బయటకు వెళ్ళబోతూ "ఇదుగో నిన్న స్కూటరు పోలీసుస్టేషన్నించి తెచ్చి రిపేర్లకోసం మెకానిక్‌కిచ్చా. నీ కొడుకునెళ్ళి తీసుకురమ్మని చెప్పు" అన్నాడు లీలతో. నిద్రకళ్ళు పూర్తిగా విచ్చుకోకుండా పాచిమొహంతో ఉన్న లీల "సరేలెండి. మీరు వెళ్ళిరండి" అంది. భర్త అంత పెందరాళే ఎక్కడికెడుతున్నాడో అడగాలని ఆవిడకి ఇప్పుడే కాదు ఎప్పుడూ అనిపించలేదు.

భర్త బయటికెడుతుండగా పన్లోకి వస్తున్న ముసలయ్య కనబడగానే వీధి గుమ్మం గడియ వేసుకోవాల్సిన బాధ్యత అతనిమీదే వేసి ఆవులించుకుంటూపోయి మంచంమీద వాలిపోయింది.

ముసలయ్య వంటింట్లో చేస్తున్న గిన్నెల చప్పుడూ, అతనిమీద పెత్తనం చలాయిస్తున్న మణెమ్మ గొంతూ వింటూ సరోజ నిద్రలేచింది.

తయారై డ్రాయింగ్‌రూమ్‌లో కొచ్చిన సరోజ తండ్రి ఇంట్లో లేడని గ్రహించింది. ఎందుకోగానీ చాలా రిలాక్స్‌డ్‌గా ఫ్రీగా ఫీలయింది. తండ్రి ఇంట్లో ఉన్నంతసేపూ ఎందుకోగానీ డ్రాయింగ్‌రూమ్‌లోకి రాబుద్ధి పుట్టదు. పైగా ఏదో జైల్లో ఉన్న అనుభూతి కలుగుతుంది సరోజకు.

తలదువ్వుకుంటూ టి.వి. ఆన్ చేసింది. లోకల్ ఛానెల్‌లో న్యూస్ వస్తోంది. గత రాత్రి హైవేమీద జరిగిన ఏదో ఏక్సిడెంటు గురించి చెబుతున్నారు. మహిళా కళాశాల విద్యార్థిని అని న్యూస్‌రీడర్ చదువుతుంటే ఎలర్ట్ అయి వాల్యూమ్ పెంచింది సరోజ. "మృతులు శీలా అనే మహిళా కలాశాల విద్యార్థిని, మురళి అనే ఇంజనీరింగ్ స్టూడెంటు" అంటూ వినబడగానే "అయ్యో" అన్నకేక అప్రయత్నంగా సరోజ నోటినుంచి వచ్చింది. సరోజ కేక విని వంటింట్లోంచి ఇవతల కొచ్చిన మణెమ్మ కూడా నిలబడి ఆ వార్త వివరాలన్నీ పూర్తిగా వింది.

"పొయ్యేకాలం. పొయ్యేకాలాలొచ్చి పడ్డాయి. ఆడా మగా తేడా లేకుండా వెధవ్వేషాలేసుకుంటూ రోడ్లంట తిరుగుతే యాక్సిడెంట్లవ్వవూ మరి. ఒళ్ళు కొవ్వెక్కి

చస్తున్నారు కలికాలం కుర్రకారు" మణెమ్మ తిట్లదండకం అర్థమయ్యీ అవనట్టుంది సరోజకి. ఎప్పుడైతే షీలా పేరు మృతుల వివరాల్లో విందో అప్పుడే మెదడు మొద్దుబారినట్టయిపోయింది. ఇతర వివరాలేమీ సరోజ బుర్రకెక్కలా. మణెమ్మ గొంతు కరుకుగా చెవిని పడ్తుంటే నిద్రలోంచి మేల్కొన్నదానిలా "ఏంటి అమ్మమ్మా ఎవర్ని తిడుతున్నావ్? " అంది.

"ఎవర్నేవిటీ. టీవీని. మిడిగుడ్లేసుకు చూస్తున్నావ్‌గానీ ఏం చెప్తున్నాడో వినట్లేదా? ఆ చచ్చిపోయిన కుర్రాడూ, కుర్రదీ పూటుగా తాగున్నార్ట" అంది మణెమ్మ పెదవులు విరుస్తూ.

చటుక్కున లేచినుంచుంది సరోజ, కాలేజీకి వెడితే వివరాలు పూర్తిగా తెలుస్తాయి అనుకుంటూ చకచకా తయారైంది. వెళ్ళబోతూ మణెమ్మ దగ్గరకెళ్ళి "అమ్మమ్మా! రాజీవ్ నిద్రలేస్తే ఇంట్లోనే ఉండమను ఎటూ వెళ్ళనీకు" అంది.

"ఏమోనమ్మా నువ్వూ, నీ తమ్ముడూ ఒకళ్ళు చెప్తే వింటారా? మీకెంత తోస్తే అంత చేస్తారు. వాడి జోలికి నేను పోను బాబూ. నీకూ నీ తమ్ముడికీ ఓ దండం" చేతులు తిప్పుకుంటూ వంటింట్లోకి పోయింది మణెమ్మ. నిట్టూర్చి బయటకెళ్ళిపోయింది సరోజ.

సరోజ వెళ్ళిన కొంతసేపటికి నిద్రలేచాడు రాజీవ్. టి.వీ.లో రిపీట్ చేస్తున్న ఏక్సిడెంటు వార్త వివరంగా విన్నాడు. మురళి, ఇంజనీరింగు స్టూడెంటు అన్న మాటలు అతన్ని కలవరపరిచాయి. ఎవరో గుర్తుకొచ్చీ రానట్టయింది. లేచి వెళ్ళి నీరజ్‌కు ఫోన్ చేశాడు. అవతలవైపు ఎవరూ ఫోను ఎత్తట్లేదు. కాలేజ్‌కి వెడితే వివరాలేమయినా తెలుస్తాయేమో. తనకన్నా ముందు నిద్రలేచినవాళ్ళు పూర్తి వివరాలు వినుంటే చెప్తారుకదా అనుకున్నాడు.





అంతకుముందు క్లాసులో జరిగిన చేదు అనుభవాలన్నీ తాత్కాలికంగా మర్చిపోయి ఈ కొత్త వార్త కలిగించిన కుతూహలాన్ని అణుచుకోలేక కాలేజీకి బయల్దేరాడు రాజీవ్.

రాజీవ్‌ని కాలేజ్‌కెళ్ళకుండా చూడమని సరోజ చెప్పిన మాటలు మణెమ్మ గాలికొదిలేసింది. "ఈ మాయదారి పిల్లలు కాసేపు బయటకెళ్ళడమే నయం బాబూ. ఇంట్లో ఎదురుగుండా కూచుంటే లేనిపోని వెధవ గొడవలు" అన్న తత్వం ఆవిడది. అందుకని రాజీవ్ బయటకెడుతుంటే నిర్లిప్తంగా ఊరుకుంది.

మెకానిక్ దగ్గర్నుంచి స్కూటర్ తీసుకురమ్మని చెప్పాలని మోహనరావు చెప్పిన మాటలు రాజీవ్‌కి లీల చెప్పనేలేదు. ఎందుకంటే రాజీవ్ కాలేజ్‌కెళ్ళే టైముకి లీల నిద్ర లేవనేలేదు.

★ ★ ★

కాలేజీ ఆవరణలో గుంపులు గుంపులుగా నిలబడి తీవ్రస్థాయిలో చర్చలు జరుపుతున్న అమ్మాయిల కోలాహలం చూస్తూనే గ్రహించింది సరోజ రాత్రి ఏక్సిడెంట్లో మరణించిన షీలా తామందరికీ తెలిసిన షీలాయేనని.

బీనా కోసం వెతికింది సరోజ. ఆమె జాడ ఎక్కడా లేదు. ఇవాళ బీనా కాలేజ్ కొస్తుందనుకోవడం తనదే తెలివితక్కువ అని గ్రహించింది. వారిద్దరి కుటుంబాల మధ్యా ఉన్న సాన్నిహిత్యంవల్ల బహుశా బీనా షీలా అమ్మమ్మగారి వద్ద వారికి సాయంగా ఉండిఉంటుంది. షీలా తల్లిదండ్రులకు మెసేజ్ పంపడమూ మిగతా ఏర్పాట్లూ ఇవన్నీ బీనా, ఆమె మేనమామ కుటుంబమూ చూసుకుంటూండవచ్చని ఊహించింది సరోజ.

స్టూడెంట్సందర్నీ ఆడిటోరియమ్ హాల్లో ఎసెంబుల్ అవమని కబురొచ్చింది. అమ్మాయిలంతా అక్కడ చేరారు. ప్రిన్సిపాల్ గారు, మరో ఇద్దరు లెక్చరర్లు స్టేజిమీద కూచుని ఉన్నారు.

ప్రిన్సిపాల్ మైక్ అందుకుని చెప్పడం మొదలెట్టింది. "మీకందరికీ తెలిసేవుం టుంది. ఒకప్పటి మన కాలేజ్ స్టూడెంట యిన షీలా అనే అమ్మాయి నిన్న రాత్రి ఘోర ప్రమాదంలో మరణించింది. ఒక ప్పటి అని ఎందుకంటున్నానంటే కొన్ని రోజులక్రితం ఆ అమ్మాయికి టి.సి. ఇచ్చేసి రిజిస్టర్‌లోంచి పేరు తొలగించెయ్యడం జరి గింది. షి వజ్ నోమోర్ అవర్ స్టూడెంట్. అయినాగానీ నిన్నమొన్నటి వరకూ మన మధ్య మన స్టూడెంటుగా తిరిగిన యువతి దుర్మరణం పాలయిందంటే ఎంతో బాధాక రమైన సంగతి. అందుకే ఈ కండొలెన్స్ మీటింగ్ ఏర్పాటు చేశాం. హిస్టరీ లెక్చరర్ నిర్మలగారు మాట్లాడతారు" అని చెప్పి ప్రిన్సిపాల్ కూచున్నారు.

లెక్చరర్ నిర్మల మైక్ ముందు నిలబడి "ప్రిన్సిపాల్‌గారు ఇప్పుడే చెప్పారు షీలాకి టి.సి. ఇచ్చి పంపెయ్యడం జరిగిందని. అది ఏ పరిస్థితుల్లో జరిగిందో మీలో చాలా మంది ఊహించగలిగే ఉంటారు. మరణిం చినవారి గురించి చెడుగా మాట్లాడకూడద న్నది మన సాంప్రదాయం. అయితే మర ణించిన వ్యక్తి చేసిన పొరపాట్లను ముందె వ్వరూ చెయ్యకుండా ఉండాలంటే వాటిని గురించి చర్చించుకోవడం తప్పనిసరి.

కొన్నిరోజుల క్రితం షీలా గ్రాండ్ పేరెంట్స్ ఆమెను వెతుక్కుంటూ మన కాలే జ్‌కొచ్చారు. ఆరోజు షీలా వాళ్ళతో గొడవ పడింది. అప్పుడా అమ్మాయిని ప్రిన్సిపాల్ గారు తన గదిలో కూచోబెట్టి ఆమెకు కాస్తో కూస్తో సద్బుద్ధి నేర్పడానికి ప్రయత్నిం చారు. నేనూ మరికొందరు అధ్యాపకులం కూడా ప్రయత్నించాం. కానీ షీలా మనసు మారలేదు. పైగా మాతో వాదించి తూలనా డింది. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే ఆమె ఎటువంటి ప్రమాదకరమైన దారిలో జీవితం గడపడానికి అలవాటు పడిందో మీకందరికీ తెలియాలని.

షీలాకోసం వెతుక్కుంటూ ఆమె అమ్మమ్మ, తాతగారూ కాలేజీకి రావలసిన పరిస్థితి ఎందుకొచ్చిందో తెలుసా? ఆమె అంతకుముందు మూడు రోజులుగా ఇల్లువ దిలి వెళ్ళిపోయింది. తన బోయ్‌ఫ్రెండ్ ఇంట్లో మకాం పెట్టింది.

తెలిసీతెలియని అపరిపక్వపు మనసుతో మంచి వయసులో ఉన్న ఆడపిల్ల అటు వంటి పనిచెయ్యడం, ఆమె కుటుంబానికి తలవంపులన్న సంగతి పక్కనపెట్టండి, ఆమెకి మాత్రం అది ప్రమాదం కాదా? దానివల్ల ఆమె సాధించినదేమిటి? చదువు మీద, మరే ఇతర వ్యాపకంమీద ఆసక్తిలేక కేవలం జల్సాలతోనే జీవితం గడిపేద్దాం అనుకోవడం ఆమె చేసిన పెద్ద పొరపాటు ఆమె నమ్ముకున్న బోయ్‌ఫ్రెండ్ నిజంగా ఆమె శ్రేయోభిలాషి, ఫ్రెండ్ ఇన్ ది రియల్ సెన్స్ ఆఫ్ ది వర్డ్ అయితే ఆమెతో సరదాలు తీర్చుకోవడంతోనే రోజులు గడిపకుండా ఈపాటికి ఆమెని వివాహం చేసుకునుండేవాడు. కానీ అతనికా ఉద్దేశం లేదన్నది స్పష్టమయింది. చివరికి ఎటూ కాకుండా ఆమె జీవితం అర్థాంత రంగా సమాప్తమయింది.

మీరనుకోవచ్చు మామూలుగా నీతిగా జీవితం గడిపేవాళ్ళకి మాత్రం ప్రమాదాలు జరగట్లేదా ప్రాణాలు పోవట్లేదా? అని. ఇక్కడ ఆమెకి జరిగిన ఏక్సిడెంటుని గురించి చర్చించడం నా ఉద్దేశంకాదు. ఆమె నడిచిన దారిలో మీరెవ్వరూ నడవకూ డదని మీకు తెలియజెప్పాలన్నదే నా అభి ప్రాయం.

అయినవాళ్ళకి దూరమై అలవికాని పరిస్థి తుల్లో ఉద్యోగాల కోసం ఆమె తల్లిదండ్రులు వెళ్ళారు. అది కేవలం డబ్బుమీది మోజుతో కాదు. ఎంతో కొంత వెనకేసి, ఉన్న ఒక్క కూతురికీ కాస్త మంచి భవిష్యత్తు ఏర్పాటు చెయ్యాలన్న సదుద్దేశంతోనే. కానీ, వారి శ్రమనీ, క్రమశిక్షణనీ అర్థంచేసుకోలేదు



షీలా. తల్లిదండ్రులని తనకోరికల్ని తీర్చే ఖజానాగానే వాడుకుంది. తెరచిన పుస్తకాల వంటి ఆ శ్రమ జీవుల జీవితాలనుంచి ఆమె ఏ పాఠమూ నేర్చుకోలేదు. పైగా వారికి తనమీద ఉన్న ప్రేమానురాగాలను బలహీనతగా తీసుకుని తన ఇష్టానుసారం వాళ్ళని ఆడించి ఏడిపించింది.

ఇంతాచేసి ఆ పిల్ల తను మాత్రం సుఖప డిందా? ఆమె మరణానికి దారితీసిన పరి స్థితులెటువంటివో మీకు వివరిస్తే మీకూ అర్థమవుతుంది. అటువంటి ప్రవర్తనకు ఫలితం తన వారిని క్షోభపెట్టడమే కాక తన మూర్ఖత్వానికి తానే బలవుతారని.

ఆరోజు మురళి అనే షీలా బోయ్‌ఫ్రెండు బర్త్‌డే. హైవేల మీదుండే రకరకాల పోష్ ఢాభాల్లో బర్త్‌డే పార్టీలు చేసుకోడం కుర్రా ళ్ళకి ఫ్యాషన్. షీలా, మురళీ కాక మరో ఐదారుగురు కుర్రాళ్ళు నాలుగు స్కూటర్ల మీద వెళ్ళారు. పార్టీ పేరుతో పీకల్దాకా తిన డమేకాదు తల తిరిగేదాకా తాగారు కూడా. పోస్టుమార్టమ్ రిపోర్ట్‌లో షీలా కూడా ఆల్కా హాల్ ప్రభావంలోనే ఉందని అనధికారి కంగా తెలిసింది. ఈ దుర్వ్యసనాలన్నీ అల వర్చుకుని ఏమి సాధించింది? తన దురల వాట్లకి తన ప్రాణమే బలయిపోయింది. ఇరవై ఏళ్ళు కూడా పూర్తిగా నిండని లేత వయసులో అంతగా దిగజారిన ఆమె కథ అలాగే ముగిసిపోయింది. ఆమెనంత అను రాగంతో కనిపెంచిన ఆమె తల్లికి కూడా బహుశా ఆ పిల్ల గురించి చేదు జ్ఞాపకాలే తప్ప ఒక్క మధుర స్మృతి కూడా మిగిలి ఉండదు.

ఇవాల్టి ఈ కండొలెన్స్ మీటింగ్ ఉద్దేశం మీలో ఎవరూ ఇటువంటి పెడదారులు తొక్కకుండా మీకు అన్నీ వివరించాలనే. నేను చెప్పిన మాటలు విని గాలికి వదిలె య్యకుండా ఆలోచించండి. మీ పెద్దవాళ్ళ కష్టాన్ని,త్యాగనిరతిని అర్థంచేసుకుని వారు గర్వించేలా మీ జీవితాలు తీర్చిదిద్దుకోండి" అని చెప్పి ముగించింది.

అమ్మాయిలందరూ బరువెక్కిన హృద యాలతో హాల్లోంచి బయటికి నడిచారు.

షీలా మరణసమయానికి ఆ కళాశాల విద్యార్థిని కాదు కాబట్టి శలవు ప్రకటించ లేదు. అందరూ ఎవరిక్లాసులకి వారు దారి తీశారు.

షీలా ఉదంతమంతా విని ఆ పిల్ల దుర్మ రణాన్ని తలుచుకుంటే సరోజకు మనసంతా తెలీని భయంతో జలదరించిపోయింది. ఇటువంటి ఘోరాలెందుకు జరుగుతు న్నాయి? తల్లిదండ్రులు పిల్లలమధ్య ఒకరి సమస్యల పట్ల ఒకరికి అవగాహన లేకపో వడమే కారణమా? తల్లిదండ్రులు క్రమశి క్షణ కలిగి, త్యాగమూర్తులైన కుటుంబాల్లో షీలాలాంటి పిల్లలు తయారవడం ఒక విచిత్రం. ఇది సృష్టివైచిత్ర్యమా, ఎవరికి వారు చేసుకుంటున్న స్వయంకృతాపరాధ ఫలితమా?

తమ ఇంటి సంగతే తీసుకుంటే తల్లిదం డ్రులెంత విలాస ప్రియులో తనూ, తమ్ముడూ అంతటి వ్యతిరేకులు.

తల్లిదండ్రులమీద తిరుగుబాటుచేసే ఉద్దే శంతో షీలా అక్రమ లైంగిక సంబంధాలను మార్గంగా ఎంచుకుంది. తండ్రి నిరాదరణ నైనా భరించగలడేమోగానీ రాజీవ్, ఆయన అవినీతి మార్గాన్ని భరించలేక ఏకంగా ఆత్మహత్యకే పూనుకున్నాడు.

ఇంక తన సంగతికే వస్తే ఏళ్ళతరబడి నిర్లిప్తంగా దారీతెన్నూ లేని, ఒక డైరెక్ష నంటూ లేని బతుకు ఎందుకు బతుకు తోందో తెలీని అయోమయ స్థితిలో బతికే స్తోంది.

అన్ని కుటుంబాలూ ఇంతేనేమో అనుకో డానికీ వీల్లేదు. ఉత్పల్, బీనా లాంటి కుదు రైన పిల్లలు కూడా ఉంటూనే ఉన్నారు. ఇక నైనా వాళ్ళని ఆదర్శంగా తీసుకుని సక్రమ మైన మార్గంలో జీవితాన్ని నడిపించుకో వాలి. రాజీవ్‌తో ఇవాళ ఇవన్నీ డిస్కస్

చెయ్యాలి' అనుకుంది సరోజ. ఆ అమ్మాయి కాపూట క్లాసులు ఎటెండవ్వాలనిపించక ఇంటిదారి పట్టింది.

★ ★ ★

కాలేజ్‌లో అడుగు పెడ్తున్న రాజీవ్‌కి ఉత్పల్ ఎదురొచ్చాడు. "ఏరా చాలా ఇర్రెగ్యులర్ అయిపోయావ్? చాలా రోజులయినట్టుంది నువ్వు కాలేజ్ మొహం చూసి?" అన్నాడు. ఉత్పల్‌కి ఇప్పటికీ రాజీవ్‌తో సీరియస్ విషయాలేమీ మాట్లాడ్డం ఇష్టంలేదు. ఏదో మామూలుగా చాలా రోజుల తర్వాత చూసిన మిత్రుడ్ని పలకరించినట్టే పలకరిస్తే రాజీవ్ కూడా రిలాక్స్‌డ్‌గా మాట్లాడగలుగుతాడని అతని ఉద్దేశం.

"ఇవాళ కూడా అసలు రావాలనుకోలేదు. కానీ పొద్దున్న ఏక్సిడెంట్ న్యూస్ విన్నాక, ఆ మురళి అన్న పేరు వింటుంటే ఎక్కడో తెలిసిన మనిషేమో అనిపించింది. కాలేజ్ కొచ్చి మనవాళ్ళని కలుస్తే ఇంకా డీటెయిల్స్ తెలుస్తాయేమోననిపించి వచ్చాను" అన్నాడు రాజీవ్ ఉత్పల్ భుజం మీదుగా కాలేజ్ కాంపౌండులో కోలాహలంగా ఏవేవోచర్చిస్తున్న విద్యార్థుల గుంపులకేసి చూస్తూ.

ఇక్కడ జరుగుతున్న వేడివేడి చర్చలు, ఏక్సిడెంట్లూ, చావులూ ఇవన్నీ రాజీవ్ చెవిని పడితే అతని మనసు చెదిరిపోయి ఏమైనా తీవ్రంగా రియాక్టవుతాడేమోనని ఉత్పల్ భయం.

"ఎవరో ఇంజనీరింగు స్టూడెంటుటరా ఆ మురళి అన్నవాడు. అతను మనకి తెలిసిన వాడెందుకవుతాడు. ఆ పేరుగల వాళ్ళు లక్ష మంది ఉంటారు. రోజుకి లక్షాతొంభై యాక్సిడెంట్లవుతూ ఉంటాయి. క్యాజువల్‌గా తీసుకోవాలంతే" అన్నాడు రాజీవ్‌ని మరిపించే ప్రయత్నంలో.

ఇంతలో సతీష్ అనే మరో విద్యార్థి వీళ్ల వైపు దూసుకుంటూ వచ్చి "హాయ్ రాజీవ్! చాలాకాలమైంది నిన్నుకలిసి. విన్నావా న్యూస్? నిన్న ఏక్సిడెంట్లో చచ్చిపోయాడే మురళి వాడు మన నీరజ్‌గాడి కజిన్ తెలుసా?" అన్నాడు ఆ ఇన్‌ఫర్మేషన్ తనకి తెలియడం చాలా గొప్ప సంగతన్నట్టు గర్వంగా ముఖం పెట్టి.

ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు రాజీవ్. నీరజ్ తనని మందు పార్టీకి పిలిచిన కొద్దిపాటి సందర్భాల్లో ఆ పార్టీలు మురళి ఆధ్వర్యంలోనే జరుగుతుండడం గుర్తుకొచ్చింది. అతణ్ణి చూసిన సందర్భాల్లో ఏ మనిషైనా ఇంత నిశ్చింతగా ఇంత జల్సాగా ఎలా ఉండగలుగుతాడు? అని తను అతనిపట్ల ఈర్ష్య పడడం కూడా గుర్తొచ్చింది రాజీవ్‌కి. అంత హాయిగా బతికేస్తున్న మురళి బతుకు ఇంత అర్ధాంతరంగా ముగిసిపోయిందా? రాజీవ్‌కి భరించలేని బాధ కలిగింది.

"ఒరే రాజీవ్! నువ్వింక ప్రతిదానికీ విపరీతంగా రియాక్టవడం మానుకోవాలిరా. ఏదో జరుగుతుంటాయి. అన్నీ అతిగా మనసుకి పట్టించుకోకూడదు" ఉత్పల్ రాజీవ్ ముఖంలో మారుతున్న రంగుల్ని చూస్తూనే అతని మనోవేదన పసికట్టి ఓదార్పు మాటలు పలికాడు.

రాజీవ్ ఏదో మాటాడబోతుంటే మరో స్టూడెంట్ వచ్చి "కమాన్ కామ్రేడ్స్! నిన్న రాత్రి జరిగిన ఏక్సిడెంట్లో నలుగురు విద్యార్థులు దుర్మరణం పాలయి మరో ఐదుగురు తీవ్రంగా గాయపడడం గురించి మన స్టూడెంట్ యూనియన్ లీడర్ విప్లవ్‌దాస్ ప్రసంగిస్తున్నాడు. పదండి పదండి... డయాస్ దగ్గరికి రండి" అంటూ పిలిచి హడావిడి చేశాడు.

అనాలోచితంగా ఉత్పల్, రాజీవ్‌లతో సహా అక్కడక్కడా గుంపులుగా నిలబడి ఉన్న స్టూడెంట్సందరూ అటువైపు కదిలారు.

ఒకానొక లెఫ్టిస్టు పార్టీలో యాక్టివ్ సభ్యుడుగా ఉంటూ విద్యార్థి నాయకుడుగా వృద్ధి

లోకొస్తున్న విప్లవ్ ప్రసంగం మొదలెట్టాడు.

"సాటి విద్యార్థినీ విద్యార్థులారా! నిన్న రాత్రి ప్రమాదంలో మరణించినవారు మన కళాశాల విద్యార్థులు కాకున్నా మన బోటి విద్యార్థులే. బ్రేకులు ఫెయిలయిన లారీ ఎదురుగా వస్తున్న స్కూటర్ల మీదనుంచి బుల్ డోజర్ తొక్కినట్టు తొక్కుకుంటూ పోయి తిరగబడింది. ఈ ప్రమాదం వల్ల అధికారంలో ఉన్న పార్టీ యొక్క పాలనా వైఫల్యం బయటపడుతోంది. ఏ ఒక్క పార్టూ సరిగా పనిచెయ్యక, అసలు రోడ్డు మీద ప్రయాణించడానికి అర్హతలేని డొక్కు లారీని ట్రాన్స్‌పోర్ట్ వెహికల్ తిప్పుకునేందుకు లైసెన్స్ ఇచ్చిన వాడెవ్వడు. ఈ చేతకాని వ్యవస్థలోని లంచగొండి ప్రభుత్వోద్యోగి! విద్యార్థులు తాగి స్కూటర్లు నడపడం వల్లనే ఇంత పెద్దయాక్సిడెంటయిందని పోలీసులు పోస్ట్‌మార్టమ్ రిపోర్టులను జెండాల్లా ఊపుతూ తప్పంతా స్కూటర్ల వాళ్ల మీదకే నెడుతున్నారు. లారీ లోపాల గురించి వాళ్లు మాటాడట్లేదు. ఎందుకంటే ఆ లారీ అధికార పార్టీకి చెందిన ప్రముఖ రాజకీయ నాయకుడు నడుపుతున్న ట్రాన్స్‌పోర్ట్ కంపెనీకి చెందింది కాబట్టి.

ఆల్ రైట్ లారీని పక్కన పెట్టండి. స్టూడెంట్సుందరూ అమ్మాయితో సహా తాగేసున్నారని చంకలు గుద్దుకు చాటింపేస్తున్నారే, ప్రొహిబిషను అమలులో ఉన్న ఈ రోజుల్లో వాళ్లకి ఆల్కహాల్ దొరికిందంటే అది ప్రభుత్వపు ఫెయిల్యూర్ కదా?"

గొంతెత్తి చుట్టూ ఉన్న వాళ్లలో ఆవేశం కలిగేల్లా లెక్చరు దంచుతున్నాడు విప్లవ్‌దాస్.

ఇంతలో కాలేజీ ప్రిన్సిపాల్ గారు ఆయన వెనక కొందరు అధ్యాపకులు డయాస్‌మీదకి వచ్చి విప్లవ్ చేతిలో మైకు లాగేశారు.

"ఆల్ రైట్ ఆల్ రైట్. మిస్టర్ విప్లవ్!




ఇది నీ రాజకీయ వేదిక కాదు ఎలక్షను స్పీచిలివ్వడానికి. స్టూడెంట్స్! నిన్న రాత్రి పోయినవాళ్లు మన కాలేజీ స్టూడెంట్సు కారు. కాలేజీ ఆవరణలో కండొలెన్స్ మీటింగు జరపనవసరంలేదు. నౌ ప్లీజ్ డిస్పర్స్. గొడవ చెయ్యకుండా క్లాసులకెళ్లి పోండి" అన్నారు ప్రిన్సిపాల్ గారు.

తను చెప్పదలుచుకున్నదంతా ఎలాగూ చెప్పేశాడు కాబట్టి ప్రిన్సిపాల్ గారు వెళ్లిపొమ్మనగానే స్టేజి దిగి తృప్తిగా వెళ్లిపోయాడు విప్లవ్ దాస్.

యాంత్రికంగా వెళ్లి క్లాసులో కూచున్నాడే గానీ రాజీవ్ కి మనసంతా విప్లవ్ దాస్ మాటల గురించే ఆలోచనలు నిండిపోయాయి.. లంచ్ అవర్ లో ఉత్పల్ తో అన్నాడు,

"విప్లవ్ చెప్పిన పాయింట్లు చాలా స్ట్రాంగ్ పాయింట్స్ రా. ప్రొహిబిషన్ ఉన్నప్పుడు ఆల్కహాల్ వాళ్లందరికీ ఎలా దొరికింది? పొరుగు రాష్ట్రాల నుంచి స్మగుల్ చేస్తున్నారు, మన రాష్ట్రంలోనూ రహస్యంగా స్టాక్ చేసి అమ్ముతున్నారు. ఇవన్నీ పేపర్లలో రాస్తున్నారు. అందరికీ తెలిసిన ఓపెన్ సీక్రెట్లే. ఇవన్నీ జరుగుతున్నాయంటే ఇందులో ఎంతో మంది లంచగొండి ఆఫీసర్లు ఇన్వాల్వయి ఉంటున్నారన్న మాటేగా? ఆ లారీ విషయమూ అంతే. ఎందుకూ పనికిరాని వెహికిల్స్ కి లైసెన్సులు దొరుకుతున్నాయి. లంచాలు వరదల్లా ప్రవహిస్తున్నాయి. దాని మూలానే ఎంతో భవిష్యత్తున్న కుర్రాళ్ల జీవితాలు నాశనమయి పోతున్నాయి" అంటూ చిన్నపాటి లెక్చరిచ్చేశాడు.

"నువ్వు ప్రతిదీ అదే యాంగిల్ లో చూడకు. లంచం పుచ్చుకునే వాడున్నంత మాత్రాన ఇచ్చి తీరాలా? సక్రమంగానో అక్రమంగానో దొరుకుతున్నంత మాత్రాన

తాగితీరాలా? ఊరికే వెర్రి ఆవేశంతోకాక కాస్త రేషనల్‌గా ఆలోచించు. చనిపోయిన వాళ్లందరూ స్టూడెంట్లు. స్టూడెంట్లకు జరుగుతున్నదంతా అన్యాయం అని గంగవెర్రులెత్తి చిందుల్తొక్కడం కాదు. స్టూడెంటన్నవాడు తన చదువూ, తన కెరీరూ కాక తాగుడూ తందనాలూ అలవర్చుకోడం తప్పుకాదా? ఒరే రాజీవ్! నేను చెప్తున్నా విను. ఏ అన్యాయం, అక్రమం జరిగినా ఏదో ఏ ఒక్కరి మీదో బ్లేమ్ వేసి సింపుల్‌గా తప్పించుకోకూడదు. ఇటువంటి సంఘటనల్లో అందరి వైపునుంచీ తప్పుంటుంది. ఇవన్నీ చాలా కాంప్లికేటెడ్ విషయాలు. మనం ఓవర్ రియాక్టవకూడదు. అలాగని దేనికీ స్పందించకూడదనీ నేననను. కానీ ప్రస్తుతం మన వయసుకి మన లెవెల్‌కి మనం చెయ్యవలసిందల్లా మన చుట్టూ జరుగుతున్నదంతా పరిశీలించి చెడుని విసర్జించి మంచిని గ్రహించడం. ఏదో ఒక రోజు మనమూ మన వంతుగా సమాజాన్ని సంస్కరించే కార్యం చెయ్యగలుగుతాం. అప్పటివరకూ జాగ్రత్తగా మన వ్యక్తిత్వాన్నీ జ్ఞానాన్నీ పెంచుకుంటూ పోవడమే మన డ్యూటీ" మరో లెక్చరిచ్చాడు ఉత్పల్.

అతని మాటలు రాజీవ్‌కంతగా రుచించలేదు. "ఏదేమైనా లంచగొండితనమే... కరప్షనే సోషల్ ఈవిల్స్ అన్నిటికీ మూలకారణం. అవినీతిపరులున్నంతకాలం దేశానికీ మనకీ కూడా భవిష్యత్తులేదు" అన్నాడు ఆవేశంగా.

"ఎన్ని చెప్పినా నీ ధోరణి మానవుకదా. సరేపద. నీకివాళ నేను సైకోథెరపీ ఇస్తాను. మీ ఇంటికెళ్ళి కాసేపు డిస్కస్ చేద్దాం" అంటూ ఉత్పల్ రాజీవ్‌ని బయల్దేరదీశాడు.

ఉత్పల్‌కసలు రాజీవ్ వాళ్ళ ఇంటికి వెళ్లడం ఇష్టంలేదు. ఆరోజు రాజీవ్ తాగిపడినప్పుడు తనూ, నీరజ్ ఉత్పల్‌ని క్షేమంగా ఇల్లు చేర్చినప్పుడు మోహనరావు తమతో కటువుగా మాట్లాడడం అతను మర్చిపోలేకపోతున్నాడు. ఏదో ఉపకారం చేద్దామని వెళ్ళిన తమని మోహనరావు చాలా అవమానించాడు. వాళ్ళింటికి వెడితే మోహనరావు ఎదురుపడితే మళ్ళీ అతను తిక్కగా మాట్లాడితే తనకీ కోపం వచ్చి నోరు జారతాడేమోనన్న సందేహం ఉంది ఉత్పల్‌కి. కానీ ఇవాళ రాజీవ్ మూడ్ బొత్తిగా బాగున్నట్టు లేదు. అతనికి కంపెనీ అవసరం. ఒక్కడ్నీ ఒంటరిగా వదిలితే అతనికి డిప్రెషన్ రావచ్చు కాసేపు అతనితో కూచుని కాస్త ఉల్లాసపరిచి రావడం అవసరం అనిపించింది. అందుకే రాజీవ్‌తో పాటు అతని ఇంటికెళ్ళాడు ఉత్పల్.

ఇద్దరూ ఇంటికి వెళ్ళేసరికి అప్పుడే ఇల్లు చేరిన సరోజ ఎదురొచ్చింది. "ఎక్కడికి వెళ్ళావురా రాజీవ్?" అంటూ.

"కాలేజ్‌కే వచ్చాడులే అక్కా. ఏం? కంగారుపడ్డావా ఎటుపోయాడోనని?" అన్నాడు ఉత్పల్.

"పొద్దున్న న్యూస్ నువ్వు విన్నావా అక్కా? నిన్న యాక్సిడెంటులో పోయిన మురళి అనే స్టూడెంటు నాకు తెలిసినతనే. నీరజ్ వాళ్ళ కజిన్" అన్నాడు రాజీవ్.

ఆశ్చర్యంగా చూసింది సరోజ. "నిజంగానా? అతను నీకు బాగా ఫ్రెండా?" అనడిగింది. మురళితో సావాసం రాజీవ్‌కెలా కుదిరిందా అని ఆలోచిస్తూ.

"అబ్బే, బాగా ఫ్రెండు కాదు. నీరజ్ చుట్టంగా తెలుసు. రెండు మూడుసార్లు చూశాను. అంతే" అన్నాడు ఉత్పల్.

"అదే యాక్సిడెంట్లో పోయిన శీలా అనే అమ్మాయి మా కాలేజ్ స్టూడెంటే. నన్నెప్పుడూ ఏదో ఒకటి అని ఏడిపిస్తుండేది. రీసెంట్‌గా ఆ పిల్ల బిహేవియర్ బొత్తిగా బాలేదని టి.సి. ఇచ్చి పంపేశారు మా ప్రిన్సిపాల్‌గారు" అంది సరోజ. మళ్ళీ తనే అందుకుని "ఆ శీలా బోయ్‌ఫ్రెండే నీకు




తెలిసిన మురళి. వాళ్ళిద్దరి గురించీ చాలా బ్యాడ్‌గా చెప్పుకుంటుండేవారు మా కాలేజ్‌లో" అంది.

"వాళ్ళిద్దరూ చెడ్డవాళ్ళంటే నేనొప్పుకోను. వాళ్ళలా అవడానికి వాళ్ళ పేరెంట్స్ బాధ్యత కూడా ఉంటుంది. ఇద్దరి పేరెంట్సూ వీళ్ళ మానాన్న వీళ్ళనొదిలేసి ఫారిన్‌లో ఉంటున్నారు. వీళ్ళకి ప్రాపర్ గైడెన్స్ లేక చెడు సావాసాలు పట్టారు" అన్నాడు రాజీవ్ వాదించే ధోరణిలో.

"ఇదక్కా మీ తమ్ముడి ధోరణి. ప్రతిదానికీ పేరెంట్స్ మీదే బ్లేమ్‌వేసి బుర్ర వాయగొట్టేస్తున్నాడు. ఇంక లాభంలేదని ఇంటికి తోలుకొచ్చేశా" అన్నాడు హాస్యధోరణిలో వాతావరణాన్ని కాస్త తేలిక పరుద్దామని.

"ఉత్పల్ మాటలు నిజమేరా రాజీవ్. అన్నిటికీ పేరెంట్స్‌నే నేరస్థుల్ని చెయ్యకూడదు. ఏ పేరెంట్సయినా ఎంతవరకూ గైడ్ చెయ్యగలరు? ఒక వయసొచ్చాక ఎవరి విచక్షణ వారికుండాలి. షీలా పేరెంట్సూ, మురళి పేరెంట్సూ విదేశాల్లో ఉన్నారంటే వాళ్ళ సొంత స్వార్థం కోసం కాదుగదా? షీలా పేరెంట్సువి చిన్న చిన్న ఉద్యోగాలు. ఈ దేశంలో జీవితకాలం కష్టపడ్డా సంపాదించలేని డబ్బు ఆ దేశాల్లో అయిదారేళ్లలో సంపాదించుకోవచ్చు. ఆ చిన్న ఆనందంతో వాళ్ళు వెళ్ళారు. వాళ్ళేం షీలాని నడిరోడ్డు మీద వదిలేసి పోలేదుగా? గ్రాండ్ పేరెంట్స్ దగ్గిరే ఉంచారు. ఈ అమ్మాయి పెద్దవాళ్ళ సాధక బాధకాలు అర్థం చేసుకోవద్దా? సరిగ్గా అలాంటి పరిస్థితుల్లోనే బీనా అని మరో అమ్మాయి ఉంది. ఆ పిల్ల ఎంత బుద్ధిమంతురాలో!" అంటూ సరోజ బీనా గురించిన వివరాలు చెప్పింది.

సరోజ మాటలు విప్పారిన ముఖంతో సంతోషంగా విన్నాడు ఉత్పల్. "చూశావా? ఇందాక నాకేదో పెద్ద లెక్చరిచ్చావు. పేరెంట్స్ దగ్గర లేకపోవడమే మహాప్రమాదం. అయితే మరి బీనా ఎందుకు చెడిపోలేదు. చెడిపోడానికి ఆ అమ్మాయికీ ఈక్వల్ ఛాన్సెస్ ఉన్నాయిగా? అందుకని నాయనా నువ్వు పిడుక్కి బియ్యానికి ఒకే మంత్రం చెప్పి పిడివాదాలు చేసే ధోరణి తగ్గించుకో" అన్నాడు ఉత్పల్. దానికి రాజీవ్ ఏం సమాధానం చెప్పేవాడో ఏమో గానీ ఇంతలో స్కూటరు ఢమఢమా చప్పుడు చేసుకుంటూ మోహనరావు వచ్చిపడ్డాడు.

ఇంట్లోకి అడుగుపెడుతూనే "ఏరా స్కూటర్ తీసుకొచ్చావా? " అని కేకపెట్టాడు. రాజీవ్‌కి సంగతేంటో అర్థం కాక తెల్లమొహం వేశాడు. "ఏం స్కూటరు? " అన్నాడు గొంతు తడారిపోయినట్టవుతుండగా.

"ఏం స్కూటరని అడిగేదాకా వచ్చిందా? తమరు దీపస్థంభానికి గుద్దించేసి పోలీసు స్టేషనులో సన్మానాలందుకున్నారే ఆ స్కూటరు" అన్నాడు వెటకారంగా.

రాజీవ్ తలొంచేసుకుని ఉత్పల్‌వైపు బెదురుచూపులు చూశాడు.

అప్పుడే ఉత్పల్‌ని గమనించిన మోహనరావు 'వీడెందుకొచ్చాడిప్పుడు? ' అన్నట్టు అతనివైపు కొరకొరా చూశాడు.

ఇరకాటంలో పడ్డ ఉత్పల్, "నేవెళ్ళొస్తారా" అని చెప్పేసి వెళ్ళిపోయాడు.

"ఊం... ఇప్పుడు చెప్పు స్కూటరెందుకు తేలేదు? " అని ఉరిమాడు మోహనరావు.

"పోలీస్‌స్టేషన్నుంచి స్కూటరు తేవాలా? " అన్నాడు రాజీవ్ అయోమయంగా.

"పిచ్చివెధవలా వాగకు. పోలీస్‌స్టేషన్నుంచి విడిపించి దాన్ని రిపేర్లకోసం మెకానిక్‌కిచ్చాను. ఇవాళ వెళ్లి తెమ్మని చెప్పలా? " గద్దించాడు మోహనరావు.

"నాకు... నాకెవరూ చెప్పలేదే" అన్నాడు రాజీవ్ ఇంకా అయోమయంలో పడిపోతూ.

"లీలా" అని గావుకేక పెట్టాడు మోహనరావు. టీగ్లాసు హస్తభూషణంగా ధరించి

తీరిగ్గా వేంచేసింది లీల.

"వీడికి మెకానిక్ దగ్గర్నుంచి స్కూటరు తీసుకురమ్మని చెప్పలేదా? " అసహనంగా అరిచాడు మోహనరావు.

"ఏరా? పొద్దున్న చెప్పలా? " డబాయిం చింది లీల.

"నేను కాలేజీ కెళ్ళే లోపల నువ్వసలు నిద్రలేస్తేకదా నా కేమయినా చెప్పడానికి" అన్నాడు అప్పటికి అసలు సంగతి అర్థమ యిన రాజీవ్.

"అందరూ అందరే. ఇల్లంతా ఇర్రెస్పాన్సి బుల్ ఫెలోస్ తయారయ్యారు. దరిద్రపు సంత. ఇప్పటికైనా అర్థమయిందా ఇవాళ కుదరకపోతే రేపయినా దాన్ని తీసుకొచ్చితగ లడు" కసిరాడు మోహనరావు.

"అన్నిటికీ నన్ను కూడా కలిపి తిడతారు. కుర్ర వెధవలు చేసే తింగరపనులకి నామీద కేకలు పెట్టడమేంటి? " అంటూ అరగంట సేపు సతాయించింది లీల.

సరోజ తన గదిలోకెళ్ళి చెవుల్లో దూదులు పెట్టుకుని చదువుకుంటూ కూచుంది.



మర్నాడు పొద్దున్న ఆఫీసుకెళ్లడానికి తయారవుతూ "ఆ పొగరుమోతుగాడిద లేచాడా? " అని రంకెవేశాడు మోహన్రావు. రాజీవ్ గురించి అడుగుతున్నాడని గ్రహించి రాజీవ్‌ని పిలిచింది లీల.

"ఇదుగో చూడూ! మొన్న పోలీస్ స్టేషను కెళ్లి వాడు తాగించిన మూడు చెరువుల నీళ్లూ తాగి అక్కడివాళ్లందరికీ వాళ్లడిగిన అడ్డమైన గడ్డీ తినిపించి చచ్చీచెడీ స్కూటరు విడిపించుకొచ్చాను. నీ కొడుకు చేసిన నిర్వాకానికి అది తుక్కయింది. మెకానిక్‌కి చ్చొచ్చినట్టుచెప్పానుగుర్తుందా? నిన్ననే ఇస్తా నన్నాడు. నీ జమీందారు సుపుత్రుడు వెళ్లి తీసుకొస్తాడో లేదో కనుక్కో. లేకపోతే వారి లెవెల్‌కి అలాంటి పనులు చెయ్యడం అవ మానమేమో అడుగు" అన్నాడు మోహ న్రావు రాజీవ్‌వైపు చూడకుండా లీలతో.

"మీ ఇద్దరిమధ్యా తడకనా ఏవిటి నేను? నామీద ఎగురుతారెందుకు? ఏరా వింటు న్నావుగా? నోరు మెదపవేం? " అంది లీల రాజీవ్‌కేసి కోపంగా చూస్తూ.

"తీసుకొస్తా" తలొంచుకుని చెప్పాడు రాజీవ్.

కాలేజీకి వెళ్లబోతూ సరోజ రాజీవ్ దగ్గర కెళ్లి "మెకానిక్ దగ్గర్నుంచి స్ట్రెయిట్‌గా ఇంటికే వస్తావుగా? డాక్టరుగారి దగ్గరకె ళ్లాలి. మర్చిపోకు" అంది.

సరేనన్నట్టు తలూపాడు రాజీవ్.

కాలేజీకి బయల్దేరిందేగానీ సరోజ మన సంతా రాజీవ్‌మీదే ఉంది. వాడు బయటకె ళ్లినప్పుడల్లా ఈ రెండుమూడు రోజులుగా వాడి మనసు చెదిరిపోయే సంఘటన ఏదో జరుగుతూనే ఉంది. దాని మూలాన వాడు మనశ్శాంతి దొరుకుతుందన్న భ్రమతో ఆల్కహాల్ నాశ్రయిస్తున్నాడు. అసలే మందులు సరిగ్గా వాడట్లేదు. ఇలాంటి పరి స్థితుల్లో వాడ్ని నాన్న బయటికి పంపకపో తేనేం? ఆ స్కూటరు తనకి వీలయినప్పుడే తీసుకొచ్చుకోవచ్చుగా? వీడినెందుకు పంపడం? తీరా మళ్లీ ఏదైనా అయితే? ఆలోచించడానికే భయపడింది సరోజ.

బస్ స్టాప్‌లో నుంచుని ఆలోచించేకొద్దీ





రాజీవ్‌ని ఒక్కడినే స్కూటర్ కోసం బయటికి పంపడం అంత శ్రేయస్కరం కాదనిపించింది సరోజకు. తిరిగి ఇంటికి వెళ్లిపోదామా అని ఆలోచించింది. మధ్యాహ్నం వాడితోపాటు మెకానిక్ దగ్గరకెళ్లి దగ్గరుండి ఇంటికి తీసుకు రావచ్చు అనుకుంది.

అదేక్షణంలో కాలేజీ బస్సొచ్చి ఆగడంతో సరోజతోబాటు బస్‌కోసం ఎదురుచూస్తున్న మిగతా అమ్మాయిలు బిలబిలమంటూ బస్సెక్కుతూ "ఏయ్ సరోజా తొందరగా ఎక్కు" అంటూ చేతులు పట్టుకుని లాక్కుపోవడంతో అనాలోచితంగా బస్సెక్కేసింది సరోజ. సరోజ మనసులోని సందిగ్ధంతో పనిలేని బస్సు వేగంగా పరుగెత్తింది.

★ ★ ★

మధ్యాహ్నం తండ్రి చెప్పిన మెకానిక్ దగ్గరకెళ్లాడు రాజీవ్. "మీ బండిమీద ఇంకా కొంచెం పనుంది బాబూ. ఒక్క అరగంటలో పూర్తయిపోతుంది. కాసేపు కూచుంటారా? " అన్నాడు మెకానిక్. ఓ పక్కగా వేసున్న స్టీలు కుర్చీలో కూచున్నాడు రాజీవ్.

అరగంటలో పూర్తవుతుందన్నాడేగానీ మెకానిక్ రాజీవ్ స్కూటర్ మీదకాక అక్కడే నిలబడి తొందరపెడుతున్న మరొక లావుపాటాయన స్కూటర్ పని చూస్తున్నాడు. మెకానిక్ పక్కనే గొంతుక్కూచుని అతనడిగిన రెంచి, స్క్రూ డ్రైవర్ లాంటివి అందిస్తున్న చిన్న కుర్రాడిమీద పడింది రాజీవ్ దృష్టి. సన్నగా పీలగా బలహీనంగా ఉన్నాడు ఆ కుర్రాడు. యజమానికి కావలసినవి అందిస్తూ అతనివైపు భయం భయంగా చూస్తున్నాడు ఏ క్షణాన ఏంవిరుచుకుపడతాడోనన్నట్టు. ఆ పిల్లాడు భయపడ్డంతా అయింది. మెకానిక్ ఒకటడిగితే ఇంకోటందించాడతను. అది చూస్తూనే తన చేతిలో ఉన్న రెంచ్‌తో ఆ పిల్లాడి వేళ్ల మీద ఒక్కటేశాడు మెకానిక్. నిశ్శబ్దంగా నోరునొక్కుకుని బాధభరిస్తూ దెబ్బతగిలిన వేళ్లమీద రెండో చేత్తో రుద్దుకున్నాడతను.

రాజీవ్ మనసు చివుక్కుమంది. "ఎందుకోయ్ చిన్న పిల్లాడ్నంత గట్టిగా కొడతావ్? " అన్నాడు అసంకల్పితంగా. అనేశాక కాస్త మొహమాటపడ్డాడు.

మెకానిక్, అతని పక్కన్నుంచున్న లావుపాటాయన రాజీవ్‌కేసి చిత్రంగా చూశారు. రాజీవ్‌కి మరీ మొహమాటం వేసింది. "ఆడికప్పుడప్పుడూ ఓ చురకంటించకపోతే మనసు పెట్టి పని చెయ్యడు బాబూ! ఇప్పుడు నేర్చుకోకపోతే ఇంకెప్పటికీ పనిరాదాడికి" అన్నాడు మెకానిక్.

కుర్రాడు బెరుకుబెరుగ్గా చూశాడు రాజీవ్ వైపు. ఆ పిల్లాణ్ణి చూస్తుంటే తనకు తెలిసిన చాలామంది ఆ వయసు పిల్లలు గుర్తొచ్చారు రాజీవ్‌కి. పాపం! హాయిగా స్కూలు కెళ్లాల్సిన వయసు పిల్లాడు దెబ్బలు తింటూ కాయకష్టం చేసుకుంటున్నాడు అనుకుని జాలిపడ్డాడు.

"అరే పిలగా! పోయి మాకందరికీ చాయ్ పట్రా, లగెత్తు" అంటూ పిల్లాడ్ని దౌడు తీయించాడు మెకానిక్. వాడు పరుగెత్తుకుంటూ పోయి ఓ పక్క గల్లీలో మాయమయ్యాడు. మరో అయిదు నిముషాల్లో చేతిలో టీ గ్లాసుల స్టాండుతో ప్రత్యక్షమయ్యాడు.

"ఆ సారుక్కూడా ఇయ్యి పో" మెకానిక్ చెప్పగా రాజీవ్ దగ్గర కొచ్చి ఒక గ్లాసు ఇచ్చాడు. ఇంతింత కళ్లేసుకుని వాడు తన ముఖంలోకి చూస్తూ టీ అందిస్తుంటే రాజీవ్ మనసు కరిగిపోయింది. "నాకొద్దు, నువ్వు తాగెయ్" అన్నాడు చిన్నగా నవ్వుతూ జేబులోంచి టీకి డబ్బులు తీసి వాడి చేతిలో పెడుతూ. వాడు సందేహంగా యజమాని వైపు చూశాడు.

"తీసుకో తాగు. సార్ తాగమన్నాడుగా, తాగెయ్" అన్నాడు మెకానిక్.

వాడు తన గ్లాసు పట్టుకుని ఓ పాత టైరుమీద కుదురుగా కూచుని ఊదుకుంటూ

టీ తాగడం మొదలెట్టాడు. మధ్యమధ్యలో రాజీవ్‌వైపు దొంగ చూపులు చూస్తూ తృప్తిగా మొహం పెట్టి వాడు టీ తాగు తుంటే. రాజీవ్ మనసుకి ఉల్లాసంగా అని పించింది.

మెకానిక్ ఇంకా రాజీవ్ స్కూటరు మీద పని మొదలెట్టలేదు. లావుపాటి ఆయన స్కూటరే చూస్తున్నాడు. ఇంకా చాలా టైమ్ పట్టేట్టుంది అనుకున్నాడు రాజీవ్. కాసేపు ఎటైనా వెళ్లొద్దామా అని ఆలోచించాడు. ఆఫ్టర్‌నూన్ సెషన్‌లో కూడా క్లాసులు క్యాన్సిలయ్యాయికదా! బహుశా ఉత్పల్ ఇంటి దగ్గరే ఉంటాడేమో వెళ్లాలనిపించింది రాజీవ్‌కి. కాస్సేపు ఉత్పల్‌తో కబుర్లు చెప్పు కుని వస్తానంటే అతణ్ణి కూడా తోడు తీసు కుని మళ్లీ ఇక్కడికి రావచ్చు అప్పటికి స్కూటర్ రిపేరయి ఉంటుంది. స్కూటర్ మీద ఉత్పల్‌ని మళ్లీ ఇంటి దగ్గర డ్రాప్ చేసెయ్యొచ్చు అనుకున్నాడు రాజీవ్.

"నేను కాసేపు మా ఫ్రెండింటికి వెళ్లి ఓ గంటలో వస్తాను. నువ్వు స్కూటర్ రెడీ చేసిపెట్టు" అని చెప్పి లేచాడు.

"గంటెందుకు బాబూ అరగంటలో అవగొట్టేస్తాను. ఇదుగో ఈ సార్‌ది చిన్న రిపేరే కదా అని ఇది ముందు మొదలెట్టా. అయి పోవచ్చింది. అయిపోగానే ఇంక మీ బండీ మొదలెడతా. మీరెళ్లిరండి. రాగానే స్కూటర్ రెడీగా ఉంటుంది" అన్నాడు మెకానిక్.

అతని మాటలు పూర్తికాకముందే లేచి నిలబడి కాళ్లు, చేతులు సాగదీసుకుని బస్‌స్టాప్‌వైపు నడిచాడు రాజీవ్. ఉత్పల్ ఇంటి వైపు వెళ్లే బస్సేదేనా దొరుకుతుందేమోనని చూస్తూ నిలబడ్డాడు. పది నిముషాలైనా ఏ బస్సూ రాలేదు. ఆ రోడ్డుమీద ఆటోలు కూడా కనిపించలేదు. ఇంక అయిదు నిము షాలు చూసి వెళ్లి ఆ మెకానిక్ షెడ్‌లోనే కూచుందామనుకున్నాడు రాజీవ్.

ఇంతలో ఎవరో "సార్! ఒక్క రూపాయి ఇప్పించండి సార్! నిన్నట్నుంచి టీకూడా తాగలా" అని అడుక్కుంటున్న మాటలు వినబడ్డాయి. తల తిప్పి అటు చూశాడు రాజీవ్. ఎవరో పెద్దాయన బస్‌స్టాపులో నిలబడ్డ వాళ్లని అడుగుతున్నాడు. ఆ ముస లాయన్ని ఎక్కడో చూసినట్టుగా అనిపించి అటువైపుగా నాలుగడుగులు వేశాడు. దగ్గ ర్నుంచి ఆ ముఖాన్ని చూసి గుర్తుపట్టి షాక్ తిన్నాడు రాజీవ్.

ఆ అడుక్కుంటున్న ముసలాయన కమల్ తాతగారు.

ఆయన రాజీవ్‌వైపు కూడా తిరిగి చెయ్యి చాపాడు. చాపిన చేతిని గబుక్కున పట్టు కుని "ఇదేమిటి మీరిలా? " అన్నాడు రాజీవ్ బాధగా. ఆయన అప్పుడు రాజీవ్‌ని తేరి పార చూసి గుర్తుపట్టాడు.

"నువ్వా బాబూ! నీకు తెలీదా? " అంటూ ఘొల్లుమన్నాడు ముసలాయన.

రాజీవ్ చటుక్కున ఆయన భుజాల చుట్టూ చేతులు వేసి పట్టుకుని నడిపించి రోడ్డుపక్కగా ఉన్న చిన్న హోటల్లోకి తీసు కెళ్ళి కూర్చోబెట్టాడు. ఆయనచేత గ్లాసుతో మంచినీళ్ళు తాగించాడు. అవి తాగి ఆయ నకాస్త సర్దుకుని కుదుట పడ్డాక టిఫిన్ తెప్పించి పెట్టాడు. ఆయన ఆత్రంగా తింటుంటే కళ్ళల్లో నీళ్ళు నిండుకొచ్చాయి రాజీవ్‌కి. ఆ చిన్న హోటల్లో జనం కిటకిట లాడుతున్నారు. అక్కడ ఆ జనం మధ్య ఆయనతో మాట్లాడాలనిపించలేదు రాజీ వ్‌కి. ఆయన తినడం అయ్యాక "రండి తాతగారూ! ఆ పక్కన పార్కులో కూచుని మాట్లాడుకుందాం" అని ఆయన్ని లేవదీ శాడు.

ఇద్దరూ రోడ్డువారగా పార్కుకేసి నడు స్తుంటే రివ్వున రెండు కంకర్రాళ్ళొచ్చి రాజీవ్ నుదుటికొకటి, భుజానికొకటి తగి లాయి. "అబ్బా" అంటూ నుదురు పట్టుకుని నిలబడిపోయాడు. రుమాలుతో నుదురు వొత్తుకుంటూ రాళ్ళు వచ్చిన వైపు చూశాడు.




రోడ్డుపక్కనే చిన్న గల్లీ అది. ఆ గల్లీలో పావురాయి గూళ్ళలాంటి ఒంటిగడి ఇరుకిరుకు కొంపలు ఒకదానిమీదొకటి లెక్కలేనన్ని ఉన్నాయి. అన్ని ఇళ్ళ గుమ్మాలూ సరాసరి గల్లీమీదకే ఉన్నాయి. గుమ్మాల ముందు చెత్తకుప్పలు, ఒకపక్క మురికి కాలవ వీటన్నిటిమధ్యా పదిమంది పిల్లలాడుకుంటున్నారు. ఆడుకుంటున్న పిల్లల గుంపుకి ఇవతలగా ఒకపిల్లాడు ఒక్కడూ నుంచుని రాజీవ్‌వైపు కోపంగా చూస్తూ ఏదో అరుస్తున్నాడు.

చింపిరిజుట్టు కప్పేసిన వాడి ముఖాన్ని తేరిపార చూసి, గుర్తుపట్టాడు రాజీవ్, "బాలు" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఎదవా! ఎదవనాయాల! మీనాన్నే! మీనాన్నే మానాన్నని చంపేశాడు. నిన్నూ మీనాన్ననీ నేన్చంపేస్తాను. ఎదవ చచ్చినాళ్ళలారా" ఏడుస్తూ, కీచుగా అరుస్తూ ఇంకో రాయి తీసి విసిరాడు బాలు. అసంకల్పితంగా పక్కకి తప్పుకుని రాయి తగలకుండా తప్పించుకున్నాడు రాజీవ్.

"మీ నాన్న చచ్చిపోయాడా? " నమ్మలేనట్టు అడిగాడు రాజీవ్. బాలు మళ్ళీ ఇంకో రాయి తీసి విసరబోయాడు. కమల్ తాతగారు గబుక్కున వాడ్ని పట్టుకుని రాయి లాగేశాడు. విడిపించుకోడానికి గింజుకుంటున్న వాడిని ఆడుకుంటున్న పిల్లల గుంపు వైపు బలవంతాన లాక్కెళ్తూ, "ఇంకచాలు పో, ఇంట్లోకిఫో. ఏయ్ బాబూ! వీడ్ని ఇంటికి తీసుకుపోండి" అని మిగతా పిల్లల్ని పిలిచాడు. వాళ్ళు ఆటాపేసి వింతగా చూస్తూ నిలబడ్డారు.

ఆయన రాజీవ్ చెయి పట్టుకులాగి, "పద బాబూ! పార్కులోకిపోదాం" అన్నాడు. నిశ్చేష్టుడై కాళ్ళు నేలకి అంటుకుపోయినట్టు నిలబడి పోయిన రాజీవ్ నిద్రలో నడుస్తున్న వాడిలా ఆయనతోపాటు నడిచాడు. రెండు అడుగులు వేసేసరికి మళ్ళీ ఇంకొక రాయి వచ్చి రాజీవ్ వీపుకి తగిలింది. రాజీవ్ వెనక్కి తిరిగి చూడకుండా నడిచి పార్కు గేటులోకి తిరిగాడు. ఇద్దరూ ఓ చెట్టుకింద కూలబడ్డారు.

"బాలు వాళ్ళ నాన్న చచ్చిపోయాడా? " ఏదో పీడకలనుంచి తేరుకోలేకపోతున్నవాడిలా తడారిపోయిన గొంతు పెగుల్చుకుని అడిగాడు రాజీవ్.

అతని ప్రశ్న విని కమల్ తాతయ్య "నిజంగా నీకు తెలీదా బాబూ? " అనడిగాడు నమ్మలేనట్టు చూస్తూ. లేదన్నట్టు తలూపాడు రాజీవ్.

"బాలు వాళ్ళనాన్న మీనాన్న పనిచేసే ఆఫీసులోనే చేసేవాడుగా? మీనాన్న చెప్పలేదా అతను పోయినట్టు? " లేదన్నట్టు మళ్ళీ తలూపాడు రాజీవ్.

"బాలు తండ్రి ఆత్మహత్య చేసుకున్నాడు" అన్నాడాయన.

"ఎందుకు? " అనడిగాడు రాజీవ్ భయంగా చూస్తూ.

"ఎందుకంటే... అదోకథ! లంచం తీసుకుంటూండగా పట్టుబడ్డాడు. అరెస్టు చేశారు. సస్పెండ్ చేశారు. ఉద్యోగం పోతుందని భయపెట్టేశార్ట తెలిసినవాళ్ళు. ఉరేసుకుని చచ్చిపోయాడు" క్లుప్తంగా చెప్పాడు గణపతి కథని.

"సస్పెండ్ అయినంత మాత్రాన ఉద్యోగంపోదుగా? కేసు నడుస్తుంది ఇంకా చాలా తతంగం ఉంటుందిటగా? చాలా మంది మళ్ళీ ఉద్యోగంలో చేరిపోతార్ట? " ఎప్పుడో ఎక్కడో విన్న విషయాలు గుర్తొచ్చి తడబడుతూ అడిగాడు రాజీవ్.

విరక్తిగా నవ్వాడు కమల్ తాతగారు. "నెల జీతం తప్ప మరో ఆధారం లేని సన్నకారు బతుకులు బాబూ మా అందరివీ. కేసు సాగతీయించుకోవాలంటే లాయర్ని పెట్టుకోవాలి. అంతటి స్తోమతు అతనికెక్కడిదీ? లంచాలు పట్టి సంపాదిస్తున్నాడన్న మాటేగానీ, ఆ సంపాదన పాత అప్పులు తీర్చడానికి, కొత్తగా అయిన దురలవాట్లు,

సరదాలు తీర్చుకోడానికి ఎక్కడికక్కడ చెల్లు. మరింక కేసు వాదించుకోటానికి, కేసు జరుగుతున్నంతకాలం ఖర్చులు భరాయించుకోడానికి స్తోమతెక్కడేడిసిందతనికి? ఇంక ఉద్యోగం ఊడిపోతుంది, పెళ్ళాంపిల్లల్ని పోషించుకోలేను అన్న భయంతోటే ఉరేసేసుకునుంటాడు"

ముసలాయన చెప్తున్నది వింటుంటే రాజీవ్ నోట మాటరాలేదు. అలిసిపోయిన వాడిలా కళ్ళు మూసుకుని చెట్టు కానుకుని కూచునున్నాడు ముసలాయన. ఆయన మాటలు వింటూ ఆ ముడతలుపడ్డ ముఖంలోకి చూస్తూ అంతసేపూ మాట్లాడకుండా కూచున్న రాజీవ్‌కి ఇప్పుడాయన తల భుజంమీదకి వాల్చేసి కళ్ళు మూసుకున్న ఆయన్ని చూస్తుంటే ఏదో తెలీని భయం సన్నగా గుండెలో తలెత్తింది.

ముసలాయన కళ్ళు తెరిచి గాజుగోళీల్లాంటి కళ్ళతో చూస్తూ మళ్ళీ చెప్పాడు. "బాలు తండ్రి చాలా కాలం చిన్నచిన్న ప్రైవేట్ కంపెనీల్లో చిన్నా చితకా ఉద్యోగాలేవేవో చేసి దాదాపు ఏజ్ బారయిపోయేముందు ఈ స్టేట్ గవర్నమెంట్ ఉద్యోగం రెండేళ్ళక్రితమే సంపాదించాడు. పెద్దవాళ్ళు చాదస్తంకొద్దీ డిగ్రీ అన్నారాకముందే చేసిన పెళ్ళి మూలాన ఉద్యోగంకన్నా ముందు భార్యా, కొడుకూ సంసారభారం వచ్చిపడ్డాయి. చాలీచాలని సంపాదనవున్న రోజుల్లో ఉన్నంతలో సద్దుకుబతికే వాడు. ఇంక గవర్నమెంటుద్యోగం వచ్చేసరికి చేతులో నాలుగు డబ్బులాడాయి. చెడు స్నేహాలూ, ఆదాయానికి మించిన ఖర్చులూ అలవాట్లూ, ప్చ్.. ఏవిటోలే. కర్ణుడి చావుకిలాగా బాలు నాన్న చావుకి ఒకటా రెండా? బోలెడు కారణాలున్నాయి. అది బాబూ బాలు తండ్రి కథ. భర్తపోయాడని తెలియగానే బాలు తల్లికూడా




బావిలో దూకేసింది. బాలుకిప్పుడు తల్లి కూడా లేదు. మేనమామలెవరో ఇక్కడ చిన్నచిన్న టీ దుకాణాలు నడుపుకునే వాళ్ళున్నార్ట. వాళ్ళు తీసుకొచ్చిపెట్టుకున్నారు దగ్గర. అదీ బాలు కథ. ఈ ఏరియాలో అడుక్కోవడంవల్ల ఈ బాలు కథ పూర్తిగా తెలిసింది" అంటూ ఓ వెర్రి నవ్వు నవ్వాడు కమల్ తాతగారు.

రాజీవ్‌కి తల తిరిగిపోయినట్టయింది. 'ఎప్పుడు? ఎప్పుడు జరిగిందిదంతా?' గత రెండు మూడు వారాలుగా తన బాధలో తనలోకంలో తనుంటున్నాడు. ఈ కొద్దిరోజుల్లో ఇంత ఘోరం జరిగిపోయిందా? ఇదే నా క్లాసులో ఉత్పల్ వాళ్ళు గుసగుసలాడుకునేవారు. తనకి చెప్పకుండా దాచిపెట్టి తను అడిగితే ఏవేవో కథలల్లి చెప్తుండేవారు బాలు సంగతి తనకి తెలియకూడదనే కాబోలు!

అతనికి లీలగా దాదాపు గత పదిరోజులుగా తండ్రి ప్రవర్తన జ్ఞాపకం వచ్చింది. ఫోన్లో గుసగుసగా ఏదో మాట్లాడుతూండడం, ఏవేవో ఫోన్‌కాల్స్ అందుకుని ఉన్నపళంగా బయటికి వెళ్ళొస్తుండడం, అయినదానికీ కానిదానికీ మామూలుకన్నా ఎక్కువగా కోపంతో ఎగిరిపడుతుండడం, ఆ ప్రవర్తనకంతకీ ఇప్పుడు అర్థం తెలుస్తోంది. బాలు తల్లిదండ్రులిద్దరూ వెంటవెంటనే పోయారు. ఆ సంగతి తెలిసీ ఇంట్లో చెప్పలేదు. ఒకే ఆఫీసు వాళ్ళు కాబట్టి చూడ్డానికి వెళ్ళక తప్పక వెళ్ళుంటాడు! బాలు తండ్రి పట్టుబడడంలో తన తండ్రి హస్తం కూడా ఉందేమో అన్న సందేహం వచ్చింది రాజీవ్‌కి. తెలియని భయంతో ఒళ్ళు జలదరించింది. 'అందుకే అందుకే బాలు నా మీద కోపం పెంచుకున్నాడు' అనుకున్నాడు. కమల్ తాతగారింకా ఏదో చెప్తున్నారు. రాజీవ్‌కి స్పృహ తప్పిపోతుందేమోననిపిం

చింది. బలవంతాన మనసు నిలబెట్టుకుని ఆయన మాటలు విన్నాడు.

మళ్ళీ పిచ్చిగా నవ్వాడాయన "ఇంతకీ నేనెందుకు అడుక్కుంటున్నానో నీకు తెలీదు కదూ? నాదీ, బాలుదీ ఒకే కథ బాబూ. బాలు తండ్రికన్నా ముందు నా కొడుకు పోయాడు బాబూ. నీకు తెలుసుగా వాడికి చాలా పెద్దయాక్సిడెంటయింది. డాక్టర్లు బతికించలేకపోయారు. చచ్చిపోయాడు. నీకెవరూ చెప్పలేదేమో" ముసలాయన గొంతుపూడుకుపోయింది. మొహం కప్పుకుని శబ్దం చెయ్యకుండా రోదించాడాయన. రాజీవ్ కళ్ళలోంచి నీళ్ళు ధారగా కారిపోయాయి.

అతనికి మళ్ళీ కాలేజ్ సంఘటనలు గుర్తుకొచ్చాయి తను ప్లేగ్రౌండులో నిలబడి ఉన్నప్పుడు ఉత్పల్ కి తెలిసిన కుర్రాడొకతను పరిగెత్తుకురావడం, తమ చుట్టాలాయనకి ఏక్సిడెంటయిందని చెప్తుంటే అతన్ని ఉత్పల్ దూరంగా తీసుకెళ్ళిపోవడం అన్నీ స్పష్టంగా జ్ఞాపకం వచ్చాయి. బహుశా ఆ చుట్టాలాయనే కమల్ తండ్రి మంగపతి అయ్యుంటాడు. అతను పోయాడని చెప్పడానికే ఆ కుర్రాడు తమ దగ్గరకు పరిగెత్తుకొచ్చాడు. ఉత్పల్ తన దగ్గర అన్ని సంగతులూ దాచాడు. తనకేమీ తెలియనివ్వలేదు. రాజీవ్ కి బాగా ఏడుపొచ్చింది.

కమల్ తాతగారు ఏడుపు కంట్రోల్ చేసుకుని చొక్కాతో ముఖం తుడుచుకున్నాడు. మళ్ళీ బొంగురు గొంతుతో చెప్పడం మొదలెట్టాడు. "మా అబ్బాయి పోయాక, మా కోడలి పుట్టింటి వాళ్ళొచ్చి ఆమెనీ కమల్ నీ తీసుకుపోయారు. వాళ్ళవీ అంతంతమాత్రం బతుకులే. నన్ను కూడా పోషించడం వాళ్ళకి తలకుమించిన భారం. నాకు చేతులో పైసా మిగల్లేదు. నేను చేసిన ఇంతోటి ఉద్యోగానికీ పెన్షను రావాలంటే మీనాన్న లాంటి వాళ్ళెవరెవరివో చేతులు తడపాలి. కాళ్లావేళ్ళాపడాలి. నాకవన్నీ చెయ్యడం రాదు. ఏం చెయ్యాలో తెలీదు. ఇలా అడుక్కోడం తేలికైనపని. బతికిన న్నాళ్ళు బతుకుతా. ఆ తరువాత ఏరోడ్డు పక్కనో ఎక్కడో శాశ్వతంగా కళ్ళు మూస్తా" ఆయన గొంతు దుఃఖంతో పూడుకుపోయింది.

రాజీవ్ మోకాళ్ళమధ్య తలపెట్టుకుని వెక్కివెక్కి ఏడుస్తున్నాడు.

తాతగారు మళ్ళీ అందుకున్నాడు. "ఏడవకు బాబూ! నాదేముంది? బతికినన్నాళ్ళు బతకను. బాలు సంగతే మరీ దీనంగా ఉంది. అయినా ఏముందిలే అలాంటి పిల్లలు ఎందరులేరు? ఏ మెకానిక్ దగ్గరో పన్లో చేరి పొట్టపోసుకుంటాడు. నాలాంటి ముసలాడినెవరూ పన్లో పెట్టుకోరు. అసలే రోగిష్టివాడ్ని. పాపం! బాలు వాళ్ళమ్మకి మా కోడలికున్నపాటి చదువు కూడా లేదనుకుంటా. ధైర్యంలేక ప్రాణాలు తీసేసుకుంది. మా కోడలు మాత్రం పాపం ఏం చేస్తుంది? ఏ వంటలు చేసుకునో, బట్టలు కుట్టుకునో బతుకుతుందేమో! కొంతమంది మా అబ్బాయి ఆఫీసులోనే మా కోడలికి ఉద్యోగం దొరుకుతుందంటున్నారు" ముసలాయన పూనకం వచ్చినవాడిలా ఏదేదో మాట్లాడ్తున్నాడు.

రాజీవ్ కి ఆయన మాటలు కొన్ని బుర్రకెక్కుతున్నాయి కొన్ని ఎక్కట్లేదు. మోకాళ్ళ మధ్య తలపెట్టుకుని వెక్కివెక్కి ఏడుస్తూనే ఉన్నాడు. 'నీటుగా యూనిఫామ్ వేసుకుని స్కూలుకెళ్ళే బాలు మెకానిక్ దగ్గర దెబ్బలు తింటూ పనులు చేసుకుంటూ బతుకుతాడా? కమల్ వాళ్ళమ్మ కూడా చదివించలేక చదువు మాన్పించేస్తుందా? కమల్ పరిస్థితి కూడా అంతేనా?' రాజీవ్ కి దుఃఖం ఆగట్లేదు.

ముసలాయన ఉన్నట్టుండి గొంతు పెంచి కేకలు పెట్టాడు "ఏయ్ రాజీవ్ మా కోడలికి ఉద్యోగం వస్తుందా రాదా మీనాన్నన





డుగు. రావాలంటే ఎంత లంచం ఇవ్వాలో కనుక్కునొచ్చి నాతో చెప్పు" హిస్టీరికల్‌గా అరుస్తూ దెయ్యం పట్టినవాడిలా రాజీవ్‌మీదపడి రాజీవ్‌ని ముందుకూ వెనక్కూ ఊపేశాడాయన. మళ్ళీ సడన్‌గా ఒంట్లో శక్తంతా మాయమైపోయినట్టు చెట్టుకింద బోర్లాపడిపోయి ఏడుస్తూ "బాబూ మా కోడల్ని అడుగుతావా? తనకి ఉద్యోగం వస్తే నన్ను కూడా తనింటికి తీసుకెడుతుందేమో అడుగుతావా? తన కొడుకుతోపాటు నాకూ ఇంత అన్నం పెడుతుందేమో అడుగు బాబూ! లంచం ఇస్తేగానీ అన్నం పెట్టనంటుందా? ఇవ్వడానికి నా దగ్గర డబ్బేదీ? " ముసలాయన కుళ్ళికుళ్ళి ఏడ్చాడు.

రాజీవ్ ఇంక భరించలేకపోయాడు. కాళ్ళల్లో సత్తువంతా కూడదీసుకుని లేచి నిలబడ్డాడు. జేబులో పర్సు తీసి దాన్ని కమల్ తాతగారి చేతిలో పెట్టాడు. గబగబా నడుచుకుంటూ రోడ్డుమీద కొచ్చాడు. కనిపించిన ఆటో ఎక్కి పోనియ్యమన్నాడు.

ఇంటికొస్తున్నంతసేపూ అతనికి ఒకే ఆలోచన. 'ఇలా జరక్కూడదు. ఇలా జరక్కూడదు. వాళ్ళు కాదు చచ్చిపోవాల్సింది. బాలు చెప్పినట్టు నేనూ మా నాన్నా చావాలి. దేవుడా! బాలు ఎలా బతుకుతాడు? కమల్ ఎలా బతుకుతాడు? ఆ తాతగారేమయిపోతారు? గజిబిజిగా ఆలోచనలు రాజీవ్ బుర్రనిండా ముసురుతూనే ఉన్నాయి.

ఆటోవాడికి ఇల్లెలా చూపించాడో ఇంట్లో కెలావచ్చాడో అతనికే తెలీదు. ఇంట్లోకొచ్చీ రాగానే ఒళ్ళెరగకుండా మంచంమీద పడిపోయాడు. తలుపు తీసిన ముసలయ్య రాజీవ్ ముఖంచూసి భయపడ్డాడు.

సాయంత్రం బస్సు దిగి కాలేజ్‌నించి వస్తున్న సరోజకు అంతదూరంలో ముసలయ్య తమ ఇంటిగేటు తెరుచుకుని ఎదురింటికి పరిగెడుతుండడం కనిపించింది. ఎదురింటి గేటు తెరవబోతూ ముసలయ్య దూరంగా వస్తున్న సరోజను చూసి తొందరగా రమ్మన్నట్టు చేతులు గబగబా ఊపాడు. సరోజ గుండె ఆగిపోయింది. ఖచ్చితంగా రాజీవ్‌కేదో పెద్ద ప్రమాదమే జరిగుంటుందని భయపడింది.

నాలుగంగల్లో ముసలయ్యను చేరుకుని "ఏమైంది ముసలయ్యా? రాజీవ్‌కేమయింది? ఇంట్లోనే ఉన్నాడా? " అనడిగింది ఆదుర్దాగా.

"ఇంట్లోనే ఉన్నాడమ్మా" అంటూనే ఏడ్చేశాడు ముసలయ్య. సరోజ మరీ ఖంగారుపడిపోయింది.

"ఏమైంది. చెప్పు ముసలయ్యా" అని ఆత్రంగా కేకపెట్టింది ఇంట్లోకి పరుగెడుతూ.

వెనకాలే పరుగెడుతున్న ముసలయ్య "ఏమోనమ్మా బాబు ఇందాకట్నే తలుపులు బిడాయించుకున్నాడు గదిలో. పిలిస్తే పలకట్లేదు" అన్నాడు ఏడుపు బలవంతాన ఆపుకుని.

"అమ్మావాళ్ళేరీ? " రాజీవ్ గదితలుపు దబదబా బాదేస్తూ అడిగింది సరోజ.

"అమ్మగారూ, అమ్మమ్మగారూ మ్యాట్నీకి పోయారు. అయ్యగారూ వాళ్ళెటుపోయారో నాకు తెలీదు. మూడింటికల్లా వొచ్చేశాడు రాజీవ్‌బాబు. నేనెళ్ళి టీ తాగమని పిలిస్తే రాలేదు. అరగంటక్రితం టిఫిను చేశాను. గదిలోకి తీసుకురానా అనడిగితే నన్ను కసిరేసి ఇంక నన్ను విసిగించకు ఫో అని తోసేసి తలుపులేసేసుకున్నాడు. పదినిముషాలక్రితం నాకెందుకో అనుమానం వచ్చి తలుపు కొడితే తియ్యట్లేదు సరికదా జవాబు కూడా చెప్పలేదు" ఏడుస్తూనే జరిగిందంతా వివరంగా చెప్పాడు ముసలయ్య. సరోజ తలుపులు బాదుతూనే ఉంది. లోపల్నించి ఏ శబ్దమూ లేదు.

గుండెలదిరిపోతుండగా ఎదురింటికి పరుగెత్తింది సరోజ. ఆ ఇంట్లో రెండు పోర్షన్లకీ కలిపి పద్మ, పుష్ప ఇద్దరే ఉన్నారు. వాళ్ళిళ్ల

ల్లోనూ పెద్దవాళ్లు బయటకెళ్లారు. పరిస్థితి చెప్పింది సరోజ ఆయాసపడ్తూ. పుష్ప అవతలి పక్కింటికి పరుగెత్తింది ఎవరైనా సహాయం తీసుకొస్తానంటూ.

పద్మ, సరోజ వచ్చి రాజీవ్ గది తలుపులు మళ్లీ బాదడం మొదలెట్టారు. ముసలయ్య గోడకి చేర్లబడి సన్నగా ఏడుస్తున్నాడు.

గుమ్మం దగ్గర మాటలు వినబడి అటు చూసింది సరోజ. ఉత్పల్, నీరజ్ ఇంకా కొందరబ్బాయిలు ఇంట్లో కొస్తున్నారు.

"రాజీవ్‌ని చూసి పోదామని వచ్చామక్కా" అంటున్న ఉత్పల్‌ని పట్టుకుని,

"రాజీవ్ తలుపులేసేసుకుని ఎంత పిలిచినా పలకట్లేదు" అని బావురుమంది సరోజ అంతసేపూ అణుచుకున్న ఏడుపు నింక ఆపుకోలేక.

"కంగారుపడకక్కా" అంటూ వాళ్లు కూడా లోపలికొచ్చి తలుపులు గట్టిగా బాదారు. ఉత్పల్ ఒక్కక్షణం ఆగి అటూ ఇటూ చూశాడు. రాజీవ్ గది గోడకి చిన్న కిటికీ డ్రాయింగ్ రూమ్‌లోకి తెరుచుకునేది ఒకటి ఉంది. రాజీవ్ ఆ కిటికీని ఎప్పుడూ మూసే ఉంచుతాడు. ఉత్పల్ బల్లమీది యాష్‌ట్రే అందుకుని కిటికీ గాజు తలుపుల్ని కొట్టాడు. ఒక పలక ఫెళ్లున పగిలింది.

ఆ పగిలిన ఖాళీలోంచి పైనుంచి వేలాడుతున్న రాజీవ్‌కాళ్లు కనిపించాయి. కెవ్వున కేకపెట్టి స్పృహతప్పి పడిపోయింది సరోజ.

ఉత్పల్ వేగంగా ఆలోచించాడు. అతను ఎక్కడో ఎప్పుడో చదివిన విషయం స్ఫురించింది. ఉరేసుకున్న వాళ్లకి వెంటనే ప్రాణం పోదు. ఆ మనిషి కాళ్లు పట్టుకుని పైకెత్తి గొంతు దగ్గరి ముడివదులయ్యేలా చేస్తే ఊపిరాడి ప్రాణం దక్కే అవకాశం ఉంది. ఆ పని చెయ్యాలంటే రాజీవ్ గదిలోకెళ్లాలి.

"ముసలయ్యా! ఇంట్లో గునపం లాంటిదే





ధైనా ఉందా? ” అడిగాడు.

ముసలయ్య కళ్లు తుడుచుకుని డాబా మెట్ల వైపు చూపించాడు. అక్కడున్న గునపం, రెండుమూడు ఐరన్ రాడ్లు ఉత్పల్, నీరజ్, శిరీష్, పంకజ్ ఎవరికందినవి వాళ్లు తీసుకుని తలుపులు పగిలేలా కొట్టడం ప్రారంభించారు.

పద్మ, పుష్ప సరోజ మొహాన నీళ్లు జల్లి, మంచినీళ్లు తాగించి స్పృహలోకొచ్చేలా చేశారు. అప్పుడే ఇంటికొచ్చిన పుష్ప తల్లిదండ్రులు ఇంకా ఇరుగుపొరుగు వాళ్లూ అంతా చేరారు. కొందరు ముసలయ్యను ప్రశ్నలు వేసి లీల దగ్గర్లోని థియేటరుకే మ్యాట్నీకి వెళ్లిందని సమాచారం రాబట్టి ఆవిణ్ణి తీసుకు రావడానికి పరిగెత్తారు.

పద్మ తండ్రి ఫోన్ నంబర్లు రాసున్న పుస్తకం సంపాదించి సరోజ దగ్గర కూచుని మోహన్రావు స్నేహితుల నంబర్లు, కొలీగ్స్ నంబర్లూ నెమ్మదిగా అడిగి తెలుసుకుని డయల్ చేశాడు. ఏ నంబరు కలిస్తే ఆ నంబర్లో ఇన్ఫర్మేషనిచ్చి మోహన్రావుకి ఎలాగైనా కబురందించమని, వెంటనే రావాల్సిందిగా మెసేజ్ ఇమ్మని చెప్పాడు.

ముసలయ్య గోడవారన కూలబడి గోడు గోడున ఏడుస్తూ “హిరణ్యకశిపుడు, హిరణ్యకశిపుడిలాంటి తండ్రికి ప్రహ్లాదుడిలా పుట్టాడు మా రాజీవ్‌బాబు. రాక్షసుడిలాగే చంపేస్తున్నాడు మా బాబుని” అని గొణుక్కుంటున్నాడు.

సరోజకదంతా భయంకరమైన పీడకలలా ఉంది. ఇది నిజంకాదు. ఈ పీడకల ముగిసిపోతుంది. రాజీవ్ తలుపు తీస్తాడు. అనుకుంటూ ఇల్లంతా నిండిపోయి హడావిడి చేస్తున్న మనుషుల్ని ఏ భావమూలేని కళ్లతో చూస్తోంది.

ఆ గోలలో ఎవరో “పోలీసులకి ఇన్ఫార్మ్ చెయ్యాలేమో” అనడం వినబడింది.

పోలీసులా? రాజీవ్ ఏం నేరం చేశాడు? మొద్దుబారిపోతున్న సరోజ మెదడుకి జవాబు దొరకలేదు. ఇంతలో రోడ్డు మీదనుంచే కేకలు పెట్టుకుంటూ వస్తున్న తల్లి కనబడింది.

"బాబోయ్! ఏం పిల్లాడు బాబోయ్! ఎప్పుడూ ఏదోటి ప్రాణం మీదకి తెచ్చుకుంటాడు. ఏవయిపోయాడు దేవుడోయ్" అని ఏడుపుతో పెడబొబ్బలు కలగలుపుతూ ఇంట్లోకి పరుగెత్తుకొచ్చింది లీల. ఆమె వెనకే గుండెలు బాదుకుంటూ శోకన్నాలు పెడుతూ వచ్చింది మణెమ్మ.



బర్రున వచ్చి మోహన్‌రావు స్కూటరు గుమ్మం ముందు ఆగింది. "అడుగో వచ్చాడు హిరణ్యకశిపుడు" అని హిస్టీరికల్‌గా అరిచాడు ముసలయ్య. ఆ గొడవలో అతని అరుపునెవరూ పట్టించుకోలేదు.

ఎవరో అన్నంత పనీ చేసి పోలీసులకి న్ఫార్మ్ చేశారు కాబోలు ఎస్సై పంతులు, మరో కానిస్టేబుల్ బైక్‌మీద వచ్చి మోహన్రావు స్కూటరు వెనకే ఆగారు. మోహన్రావు పోలీసుల్ని చూడలేదు.

"ఏమయింది? మళ్లీ పీకలమీదకేం తెచ్చాడీ వెధవ?" అని రౌద్రంగా కేకలు పెడుతూ లోపలికొచ్చాడు మోహన్రావు. అతని వెనకే పోలీసులూను.

అదే క్షణంలో గునపం దెబ్బలింక తట్టుకోలేక ఫెళఫెళమంటూ విరిగిపడ్డాయి తలుపులు.

ఒక్క పరుగున వెళ్లి తాడు కత్తిరించి రాజీవ్‌ని దింపి కింద పడుకోబెట్టారు ఉత్పల్, నీరజ్.

సరోజ, పద్మ, పుష్ప, శిరీష్, పంకజ్, కుసుమ్, చంపక్ రాజీవ్ చుట్టూచేరి ఆర్తిగా, ఆత్రంగా చూశారు.

రాజీవ్ బతికే ఉన్నాడా?

సంఘం నరనరానా వ్యాపించిపోయిన అవినీతి క్యాన్సర్ అతణ్ణి భయపెట్టి బలితీసుకుందా?

ఎదురునిల్చి పోరాడాలన్న చిగురుటాశ ఆఖరి క్షణంలో అతనిలో మిణుకు మిణుకుమని అతన్నింకా కొన ప్రాణంతో నిలిపి ఉంచిందా?

పెద్దలు చేసే దుర్మార్గాలు చూడలేక ఎన్నెన్ని రాజీవాలు వాడిపోతున్నాయో!

ఉత్పల్, నీరజ్, సరోజ, పద్మ, పంకజ్, పుష్ప, శిరీష్, చంపక్, కుసుమ్ కళ్లలోంచి నీళ్లు ధారగా కారిపోతుంటే ఎలాగైనా ఈ రాజీవ్‌ని బతికించండని అర్థిస్తున్నట్టుగా చూశారు లోపలికొస్తున్న పెద్దలవైపు.

ఏం చేస్తారా పెద్దలు?

సహస్రదళాలుగా కళకళలాడుతూ సన్మార్గపు పరిమళాలు వెదజల్లుతూ విచ్చుకోవాల్సిన ఆ లేలేత మొగ్గల్ని పూర్తిగా వికసించనిస్తారా?

విరిసీ విరియక మునుపే ఉరిపోసుకుని దారిపక్కనే రాలిపోండని శపించిపోతారా?

రాజీవ్‌ని బతికించుకుంటారా?






# ఏరినముత్యాలు

★ విశ్వసృష్టిలో స్పష్టంగా గోచరించే శాశ్వత సత్యం పరివర్తన

-సంజీవదేవ్

★ బుద్ధిగా ప్రేమించుకోక యుద్ధాలు ఎందుకు చేస్తారో నాకర్థం కాదు

-ఇస్మాయిల్

★ మంచివంశంలో పుట్టాలనుకోవడం తప్పేమీ కాదు. అయితే ఆ గొప్పతనం పూర్వీకులకు చెందుతుందే కానీ మనకు వర్తించదు.

-ప్లూటార్క్

★ ఆదర్శమైన ప్రేమలో వ్యక్తిత్వమే నశించాలి. 'నేను, నువ్వు' అనే భావమే అదృశ్యం కావాలి.

-చలం

★ చావుపుట్టుకల మధ్య సందేహం లాంటిది జీవితం. మంచి గంధంలాగ పరిమళించేది మానవత్వం.

-తిలక్

★ ప్రవర్తన అద్దం లాంటిది. ప్రతిమనిషి ప్రతిబింబం అందులో కనిపిస్తుంది.

-గోథే

★ వ్యక్తిత్వాన్ని మలుచుకునేందుకు ఊహాశక్తిని పరిపుష్టం చేసుకునేందుకు ఏకాంతం చాలా అవసరం.

-లోకెల్

★ అలవాటును ప్రతిఘటించకపోతే త్వరలో అవసరంగా మారుతుంది.

-అగస్టిన్

★ మన ఆలోచనలే మన జీవితాన్ని సరిదిద్దుతాయి.

-అరివియస్

★ మంచీ చెడూ అని రెండు రకాలులేవు. ఆలోచనలద్వారా అలా అనుకుంటాం అంతే.

-షేక్స్‌పియర్

★ మానసికంగా తనకన్నా చిన్నవాడైన పురుషుడిని స్త్రీ ప్రేమించదు

-మేడమ్ డ్యూఫత్

★ యుద్ధంలోనూ, భార్యను ఎంచుకోవడంలోనూ ఒక్కసారి తప్పుచేస్తే జీవితాంతం దాని ఫలితాన్ని అనుభవించాలి.

-మిడిల్‌టన్

★ తన తల్లిని గాఢంగా ప్రేమించే వ్యక్తి జీవితాంతం విజేత మనస్తత్వంతో ఉంటాడు.

-ఫ్రాయిడ్

సేకరణ: పట్నంశేషంశెట్టి

# ఏరినముత్యాలు

★ సంతృప్తి అనేది మనిషికి సహజమైన సంపద. ఇక భోగాలూ, విలాసాలు అంటారా అవి కృత్రిమమైన దారిద్ర్యం లాంటివి.

–సోక్రటీస్

★ మహత్తరమైన త్యాగాలవలననే మహోన్నతి సాధించగలం.

–స్వామి వివేకానంద

★ భగవంతుడొక్కడే సత్యం. తక్కినది మిధ్య.

–శారదాదేవి

★ ధనసంపాదనకన్నా, విజ్ఞాన సంపాదన మేలు.

–బైబిల్

★ ఇంటిని మించిన పాఠశాలలేదు! తల్లితండ్రులను మించిన గురువులేరు.

–గాంధీజీ

★ మాటలు మంత్రసిద్ధిని కలిగిస్తాయి. పొందికగా మాట్లాడటం నేర్చుకుంటే ఆ మాట లవలన ముక్తి కూడా లభిస్తుంది.

–వేమన

★ రేపు చేయాలనుకున్న పనిని నేడే చెయ్యి. నేడు చేయాలనుకున్న దానిని ఇప్పుడే తల పెట్టు.

–కబీరు

★ అంతర్విచారం, ఆత్మసంస్కరణముకంటే గొప్ప సాధన లేదు.

–రామతీర్థ

★ మంచి భార్య దొరకడం వరం. భార్య చెడ్డది కావడం శాపం.

–సిమోనైడ్

★ ఎప్పుడూ ప్రేమలో వుండాలంటే పెళ్లి మానుకో.

–ఆస్కార్‌వైల్డ్

★ మన బతుక్కి ఒక ఆశయం, ఒక లక్ష్యం కల్పించబడితేగాని అది జీవితమనిపించు కోదు.

–రాఫెల్

★ వెనుకటి తప్పులు మళ్లీ చేయటం కాక, కొత్త తప్పులు చేయటం అనుభవం.

–ఈనోస్

★ మనిషి చిరునవ్వు పుష్పానికి సూర్యరశ్మిలాంటిది

–జోసఫ్ ఎడిసన్

సేకరణ: దోగిపర్తి ఆదినారాయణరావు

# చతురప్రపంచం

## ఇంటర్‌నెట్

ఎక్కడ చూసినా 'ఇంటర్‌నెట్' పేరు మారుమోగిపోతోంది. అసలు ఇంటర్‌నెట్ అంటే ఏమిటి? ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లో వున్న అనేక కోట్ల కంప్యూటర్లని, వాటిలోని సమాచారాన్ని ఒకదాని కొకటి కలిపే వ్యవస్థ. వాటి




మధ్య టెలిఫోన్ వైర్లద్వారా సమాచారం పంపచ్చు పొందచ్చు ఇందుకు వీలుగా ఉపగ్రహాలను ఉపయోగిస్తున్నారు.

1969లో అమెరికన్ రక్షణశాఖ 'ఆర్పానెట్' అనేపేర వివిధ ప్రాంతాల్లోని డిఫెన్స్ కంప్యూటర్లలోని సమాచారాన్ని ఒకదాంట్లోంచి, ఇంకో దాంట్లోకి పంపే వ్యవస్థకి శ్రీకారం చుట్టారు. తరువాత యూనివర్సిటీ కంప్యూటర్లకి దీన్ని విస్తరింపచేశారు. క్రమేపీ ఈ పద్ధతి విస్తృతమై 'ఇంటర్‌నెట్' వ్యవస్థగా రూపుదిద్దుకుని అనేక అభివృద్ధులు సాధించి నేటి పరిస్థితికి చేరుకుంది.

కంప్యూటరు వున్నవారు ఇంటర్‌నెట్ కనెక్ట్ కావాలంటే ఐ.ఎస్.పి. (ఇంటర్‌నెట్ సర్వీస్ ప్రొవైడర్)లని ఆశ్రయించాలి. ఐ.ఎస్.పి. ఉపగ్రహం ద్వారా కంప్యూటర్లు, లేదా వెబ్ సైట్స్ కనెక్ట్ అయ్యే అవకాశాన్ని కల్పిస్తాయి. ఇండియాలో వి.యస్.ఎన్.ఎల్. ఒక ఐ.ఎస్.పి. సత్యంలాంటి మరికొన్ని ప్రయివేట్ ఐ.ఎస్.పి.లు కూడా వచ్చాయి.

డబ్ల్యు.డబ్ల్యు.డబ్ల్యు... లేదా వరల్డ్ వైడ్ వెబ్ లలో ఎంతో సమాచారం టెక్ట్స్

(మాటలు), చిత్రాలు, గ్రాఫిక్స్‌లలో నమోదై వుంటుంది. ఈ వెబ్‌లనుంచి ఉచితంగా గానీ, డబ్బు చెల్లించిగానీ మన కంప్యూటర్ లోకి ఆ సమాచారాన్ని ఎక్కించవచ్చు. ఉచితంగా ఇచ్చేవాళ్ళు ప్రకటనదారులనుంచి ఆదాయం పొందుతుంటారు.

1998లో 15 కోట్ల 40 లక్షల మంది ఇంటర్నెట్‌ను ఉపయోగిస్తున్నారని ఓ అంచనాలో తేలింది. వారిలో 88 శాతం మంది ధనిక దేశాలకి చెందినవారు. 2001 కల్లా ప్రపంచం మొత్తంమీద 70 కోట్ల మంది ఇంటర్‌నెట్‌ను ఉపయోగిస్తారని ఇంకో అంచనా. 2000లలో ప్రపంచ జనాభాలో 2.47 మంది ప్రజలు ఇంటర్‌నెట్‌కి కనెక్ట్ చేయబడివున్నారు. ఐస్‌ల్యాండ్, స్వీడన్, ఫిన్‌లాండ్ దేశాలు మొదటిస్థాయిలో వున్నాయి. చాలామంది భావించేట్టుగా అమెరికాది ఇంటర్‌నెట్ వినియోగంలో మొదటిస్థానం కాదు.

ప్రపంచ జనాభాలో 23.5 శాతం మంది సౌత్ ఏసియాలో నివసిస్తున్నా వారి ఇంటర్నెట్ కనెక్షన్ శాతం ప్రపంచ జనాభాలో 0.04 శాతం మాత్రమే. ప్రపంచంలో ఇంటర్‌నెట్‌ను అధికంగా ఉపయోగించేవారి ప్రొఫైల్ 35 ఏళ్ళలోపు యువకుడు, యూనివర్సిటీ పట్టభద్రుడు, ఎక్కువ ఆదాయం కలిగి ఇంగ్లీషు బాగా వచ్చిన వ్యక్తి. ప్రపంచ జనాభాలో ప్రతి పదిమందిలో ఒకరు ఇంగ్లీషు మాట్లాడతారు కాబట్టి వెబ్‌సైట్స్‌లోని సమాచారం 80 శాతం ఇంగ్లీషులో నమోదైవుంటుంది.

చదువురానివారు ఇంటర్‌నెట్‌ను ఉపయోగించడం అరుదు. చైనాలో ఇంటర్‌నెట్‌ని ఉపయోగించేవారిలో 60 శాతం మంది కాలేజీ విద్యార్థులే. బ్రెజిల్‌లో కూడా 75 శాతం మంది విద్యార్థులే ఇంటర్‌నెట్‌ను ఉపయోగిస్తున్నారు. అమెరికాలో ఓ కంప్యూటర్ ఖరీదు ఓ నెలజీతం. అదే బంగ్లాదేశ్‌లో 8 సంవత్సరాల జీతానికి సమానం.

రూరల్ జనాభాకంటే అర్బన్ జనాభాయే ఎక్కువగా ఇంటర్‌నెట్‌ను ఉపయోగిస్తున్నారు. అలాగే వృద్ధులకన్నా యువకులే ఎక్కువగా దీన్ని వాడుతున్నారు.

---

## ఏనుగు... ఏనుగు...నల్లనా...!

ఏనుగు సగటు బరువు 6000 కిలోలు. ఆడ ఏనుగు కొంచెం బరువు తక్కువగా వుంటుంది. భూమినుంచి భుజాలదాకా ఏనుగు ఎత్తు పదిన్నర అడుగులు. నిమిషానికి ఏనుగు గుండె 34 సార్లు కొట్టుకుంటుంది. ఏనుగు తోక బరువు 11 కిలోలు. ఏనుగు చర్మం 0.8 నుంచి 1.5 అంగుళాల మందం కలిగివుంటుంది. దీనికి మనిషిలా స్వేదగ్రంధులుండవు కాబట్టి నీటిలో ప్రవేశించి చల్లబడవలసివుంటుంది.

ఒక చెవిబరువు 55 కిలోలు వుంటుంది. చేటల్లాంటి చెవులతో విసురుకుంటూ శరీర ఉష్ణోగ్రతను తగ్గించుకుంటుంది ఏనుగు. ఏనుగుకు 6 దంతాల సెట్లుంటాయి. ఆఖరి సెట్టు కూడా అరిగిపోతే ఇది ఆహారం తినలేక మరణిస్తుంది.

ఏనుగుదంతం 6 నుంచి 8 అడుగుల దాకా పెరుగుతుంది. వీటి సగటు బరువు 90 కిలోలు. 2, 3 ఏళ్ళకి ఇవి ఆరంభమవుతాయి. దీని తొండం 150 కిలోల బరువుంటుంది. 40,000 కండరాలు గల తొండం 7 అడుగుల పొడవుంటుంది. తొండంలో ఒకటిన్నర గేలన్ల నీరు పడుతుంది. తొండం చేతిలా ముక్కులా కూడా ఉపయోగిస్తుంది. రెండు మైళ్ళ దూరంలోని వాసనను కూడా ఇది పసిగట్టగలుగుతుంది.

60 ఏళ్ళు బతికే ఏనుగుకి 10-13 ఏళ్ల మధ్య సంతానార్హత లభిస్తుంది. ఏనుగు రెండు అంగుళాల దంతంతో పుడుతుంది.








అయితే ఇది రెండోయేట ఊడిపోయి కొత్తది మొలుస్తుంది.

రోజుకి 18-20 గంటలపాటు ఏనుగు తింటూ గడుపుతుంది. రోజుకి 200 నుంచి 250 కిలోల బరువుగల ఆకులు, గడ్డి తిని 50 గేలన్ల నీటిని తాగుతుంది. ఇది జీవించడానికి 300 చదరపు మైళ్ల అడవి అందుకే అవసరం. దాని జీర్ణవ్యవస్థ సమర్థవంతమైనది కాదు గాబట్టి అవసరానికి రెట్టింపు ఆహారం తినాల్సొస్తుంది దానికి.

---

## అక్కడ కారంటే చిరాకు

మనకో కారుంటే బావుండుననిపిస్తుంది కానీ థాయ్‌లాండ్ రాజధాని అయిన బ్యాంకాక్ నగరవాసులకి కారంటేనే బేజారు. ప్రపంచంలో తలసరి కార్లు అత్యధికంగా వున్న నగరం బ్యాంకాక్. దాంతో ఆ పట్టణంలో ట్రాఫిక్ జామ్ అధికం.

ఈ కారణంగా స్కూలుపిల్లలతోసహా కుటుంబ సభ్యులంతా ఉదయం నాలుగున్నరకే లేస్తారు. అయిదున్నరకి ఇంట్లోంచి బయలుదేరితే ట్రాఫిక్ జామ్‌లో ఇరుక్కోకుండా గమ్యానికి చేరుకుంటారు. అదే ఇంటివద్ద పొరపాటున ఓ గంట లేటయితే వెళ్ళవలసిన చోటుకి రెండు గంటలు ఆలస్యంగా చేరుకుంటారు.

బ్యాంకాక్‌లో 40 లక్షల కార్లున్నాయి. వాళ్ళు సగటున 6 గంటలకాలం తమ కార్లలోనే ఖర్చుచేస్తుంటారు. దాంతో వాళ్ళ అవసరాలకు తగ్గట్టు కార్లలో రకరకాల ఏర్పాట్లు చేసుకుంటారు.

పెట్రోల్ బంక్స్‌లో పోర్టబుల్ టాయిలెట్స్‌ని అమ్ముతారు. కార్లలో ఉపయోగించుకుని ఆ తర్వాత పారేసే డిస్పో

జిబుల్ వి. కార్లలోనే (మొబైల్) ఆఫీసులను ఏర్పాటుచేసుకుంటారు.

కొందరు కార్లలో బ్యాటరీతో నడిచే కంప్యూటర్లని పెట్టుకుని ట్రాఫిక్ జామ్‌లో కంప్యూటర్‌పని చేసుకుంటారు. ఒక కిలో మీటరు పొడవున ఏర్పడ్డ ట్రాఫిక్ జామ్‌లో అది దాటడానికి 90 నిమిషాలనుంచి రెండు గంటలు పడుతుంది. ఒక కారుకి సెల్ ఫోన్, టీ.వీ., డిక్టేటింగ్ మెషీన్, టైప్‌రైటరు, కాఫీ తయారుచేసుకునే మెషీన్, ఫ్రిజ్‌లాంటివి దాదాపు అన్ని కార్లలో తప్పనిసరిగా వుంటాయి.

కొందరు కార్లు బదులు వ్యాన్‌లు తీసుకుని దాంట్లోనే సీట్లు తిరిగేవిధంగా ఏర్పాటు చేసుకుంటారు. జామ్‌లో చిక్కుకోగానే ఆ సీటు వెనక్కి తిప్పుకుని టీ.వీ. చూడడమో, కంప్యూటర్ పని చేసుకోవడమోలాంటిది చేస్తారు. అక్కడ రోజుకి 400 కొత్తకార్లు అమ్ముడుపోతూవుంటాయి.

ట్రాఫిక్‌పోలీసుటవర్స్ వద్ద ఆక్సిజన్ మాస్కులుంటాయి. వారు తరుచు ఆ మాస్కులను తగిలించుకుని, ఆక్సిజన్ పీల్చి పొల్యూషన్ బారినుంచి తప్పించుకుంటారు. ఆక్సిజన్ బార్‌లు కూడా బ్యాంకాక్ ప్రజల అవసరాలకి సమృద్ధిగానే వున్నాయి.






Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

